

‘ఆంధ్రవ్యాస’ - ‘కవికుల రత్నదీప’ - ‘వైదికాగమాలంకార’ - భాషాప్రవీణ

కీ.శే. యేలూరిపాటి అనంతరామయ్యగారు

(1935-2002)

తోగుమ్మి, కొవ్వూరు మండలం, పశ్చిమ గోదావరి జిల్లా

# చైతన్యకవిత

*There are only three things*
*in the world.*
*One is to read poetry;*
*another is to write poetry;*
*and the best of all is*
*to live poetry*

*-Rupert Brooke*

సంపాదకుడు
ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు

# అంతర్జ్ఞానం

-కె. శివారెడ్డి

## అంకితం

ఒక స్థితి చాలా విషయాలు చెబుతుంది.
అంతకుముందు గమనించనివి గమనానికొస్తాయి.

మామూలుగా అయితే కాళ్ళకు మనం ఏం ప్రాధాన్యత యివ్వం.
ప్రమాదానికి లోనయినప్పుడు తెలుస్తుంది కాలి విలువ;
కదిలే ప్రపంచం విలువ.
ఇప్పుడు నాకేమనిపిస్తుందంటే ప్రతివాడు పొద్దున్న లేవగానే
వాడి కాళ్ళకి వాడు నమస్కరించి తిరగడానికి బయల్దేరాలని.

ఈ ఎనిమిది నెలల అనంత గది జైలు నిర్బంధం నుంచి,
దుఃఖం నుంచి కదిలిన కవితలివి -
ఈ ఎనిమిది నెలల్లో అటు ఆస్పత్రిలోను, ఇటు ఇంటివద్ద
నన్ను ప్రేమించీ, పలకరించీ, ఓదార్చీ అండగా నిలిచిన...

మిత్ర ప్రపంచం గొప్పది. బహుశ కవిత్వం లేకపోతే
ఇంతమంది స్నేహితుల్ని పొందటం సాధ్యమయ్యేది కాదు.

అందుకే

అపార పారావార ప్రేమాన్వితులయిన మిత్రులకు,
బంధువులకు, నా కుటుంబ సభ్యులకు

ఈ పుస్తకాన్ని కృతజ్ఞతలతో అంకితం చేస్తున్నాను.

## మొదటికవిత

గదిలో కూచున్నవాడి ప్రపంచమే వేరు
కళ్ళుంటాయి,
పరిమితమయిన దృశ్యాలకే పరిమితం
మూసిన కిటికీల్ని, గోడల్ని దాటలేవు -
సర్కస్ బోనులోని సింహాల్లా, అసహనంగా
అన్నింటినీ మింగేసేటట్టు అక్కడక్కడే తిరుగుతుంటాయి.

- నుంచున్న పుస్తకాలూ, పడిపోయిన పుస్తకాలూ
పాత పేపర్లూ, కొన్ని జ్ఞాపికలూ, ఖాళీ ఫ్లవర్‌వేజ్
అర్ధాకలితో వున్న బౌద్ధభిక్షువూ
చెడిపోయిన టెలిఫోన్, ఖాళీ కుర్చీలు
ముప్పై ఏళ్ళ కిందటి యౌవనం ఫోటోలు
టిష్యూ పేపర్స్, దయామయి వాకర్
అక్కడక్కడ చించి పారబోసిన చీకటి ముక్కలూ -

అన్నీ భయంకర స్వప్నాల్ని గర్భీకరించుకుని
నీరెండిపోయిన నేత్రాల్లా,
గదిలో కూర్చున్నవాడి ప్రపంచమే వేరు,
పరిమితమయిన
అపరిమిత దృశ్యాలకే పరిమితం. (7-1-2002)

*(ప్రముఖ విప్లవకవి శ్రీ కె. శివారెడ్డిగారికి హైదరాబాదులో ఒక రోడ్డు ప్రమాదంలో కాలు విరిగింది. పదిమాసాలపాటు మంచం మీదనే ఉండిపోయారు. వృద్ధాప్యంలో చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు చెప్పినట్లుగా ''గదిలో మంచమె ఎల్లలోకమై'' అన్నట్లుగా బతికారు. ఆ దుర్భరమైన అనుభూతితో 75 ఇండికలలో 'అంతర్జనం' అనే కవితా సంపుటిని ప్రచురించారు. దానిలోని 'అంకితం'ను మొదటి కవితను ఇక్కడ పునర్ముద్రించాం)*

*- తంగిరాల*

# కాళోజీ

– డా॥ అమ్మంగి వేణుగోపాల్

అతడు
గడ్డిపోచను తలదాల్చే హిమశిఖరం!
మొగ్గలపై కురిసినప్పుడు మంచు
'రాజ'కీయాలను గాయపర్చినప్పుడు
అతని వ్యక్తిత్వం కత్తిఅంచు!

ఉపన్యాసం
ఉద్యమానికి ఊపిరి
వ్యాఖ్యానం
కవిహృదయానికి దర్పణం!

మేఘమై గర్జించినా
మెరుపుదాడి చేసినా
కంట తడి పెట్టినా
కవిత రాసినా
ప్రజలకోసం

తెలంగాణా అతని ఊరు!
త్రికరణశుద్ధికి మారుపేరు!!

(రచనాకాలం: నవంబర్ 1978)

('మిణుగురు' కవితా సంపుటి నుండి)

# చైతన్య కవిత

## 36 & 37

చిత్రభాను శరత్తు - స్వభాను వసంతం
October 2002 & April 2003

సంపాదకుడు

ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు

సహాయకులు

డా॥ దివాకర్ల రాజేశ్వరి
అంబికా అనంత్
న్యాయపతి శ్రీనివాసరావు (వాసు)
వై. ముకుందరామారావు
ఇంద్రకంటి పినాకపాణి
జోళదరాశి (గుత్తి) చంద్రశేఖరరెడ్డి
దాసరి అమరేంద్ర -నండూరి భాస్కర్

చైతన్య కవితా వేదిక
40/12-7 ''సౌరభ'' (మేడపైన)
22వ క్రాస్, గోవిందరాజనగర్, విజయనగర్
బెంగుళూరు - 560 040

**CHAITANYA KAVITA,** an anthology devoted to Modern Telugu Poetry and Published by Chaitanya Kavita Vedika, 40/12-7 "Saurabha" (Upstairs), 22nd Cross, Govindaraja Nagar, Vijayanagar, BANGALORE - 560 040, October, 2002 and April, 2003.

Pp. 160

ముఖచిత్రం : ప్రజాకవి, 'పద్మవిభూషణ్'
డా॥ కాళోజీ నారాయణరావుగారితో సంపాదకుడు
తంగిరాల సుబ్బారావు, వరంగల్లు, 18-9-2000

అట్టవెనుక : కర్ణాటక రాష్ట్ర గవర్నరుగా పనిచేసి పదవీ విరమణ చేసిన
శ్రీమతి వి. యస్. రమాదేవిగారికి బెంగుళూరులోని
తెలుగు సంఘాల పరంగా వీడ్కోలు చెపుతున్న
'దాన చింతామణి' శ్రీ డి.కె. ఆదికేశవులుగారు.
మధ్యన ఉన్నవారు 'తెలుగు విజ్ఞాన సమితి' అధ్యక్షులు
శ్రీ ఎ. రాధాకృష్ణరాజుగారు.

అక్షరాలంకరణ : ఆచార్య పి.సి. నరసింహారెడ్డి
కళాప్రపూర్ణ శ్రీ 'బాపు'

వెల : విడిప్రతి : రూ. 40-00
జీవిత సభ్యత్వం : రూ. 500-00
పోషక సభ్యత్వం : రూ. 1,000-00
విదేశాలలో : $ 100

**For Copies** : **Prof. T.V. Subba Rao** M.A., Ph.D.
No. 40/12-7, "Saurabha" (Upstairs)
22nd Cross, Govindarajanagar,
Vijayanagar, Bangalore - 560 040
Ph.: 080-330 59 02

**M/s. Visalaandhra Book House**
4-1-435, Bank Street, Hyderabad - 500 001
and all its Branches.

**DTP and Printed By** : **Sree Laxmi Art Printers**
910/A, 3rd Main, Vijayanagar,
Bangalore - 560 040 Ph: 330 00 93

# అంకితం - 1

(శరత్పంచిక)

**1999** నుండి **2002** వరకు
కర్ణాటక రాష్ట్ర గవర్నరుగా ఉండి
తన పరిపాలనా దక్షతతో ప్రజాభిమానాన్ని
మిక్కిలిగా చూరకొన్న మహిళా రాజకీయవేత్త
స్త్రీ చైతన్యాన్ని దశదిశలా ప్రసరింపజేసిన సాహిత్యవేత్త
లలిత కళారాధకులపై కురిసిన పన్నీటి జల్లు
కన్నడ నింగిలో విరిసిన తెలుగుతల్లి హరివిల్లు
సౌజన్య సౌశీల్య సౌహార్దాలకు పుట్టినిల్లు
ఆంధ్రులు గర్వింపదగిన ఆడుపడుచు
అయిన -

## శ్రీమతి వి. యస్. రమాదేవిగారికి ...

ఆయురారోగ్య సంపత్పరంపరాభివృద్ధిని ఆకాంక్షిస్తూ ...
'చైతన్య కవిత'ను పోషిస్తున్న 'దాన చింతామణి'

## శ్రీ డి. కె. ఆదికేశవులుగారి పరంగా ...

కర్ణాటక రాష్ట్రంలోని అసంఖ్యాత
ఆంధ్ర సోదర సోదరీమణు లందరి పరంగా ...

సమర్పణ:

- తంగిరాల సుబ్బారావు - దివాకర్ల రాజేశ్వరి -
అంబికా అనంత్ మరియు ఇతర 'శ్రీరస' సభ్యులు

# అంకితం - 2

(వసంత సంచిక)

గత మూడు దశాబ్దాలుగా
బెంగుళూరులో నేను నిర్వహిస్తున్న
సాహిత్య కార్యక్రమాలకు
చేయూతనిస్తున్న -

'నా గౌతమీ తీర సఖుడు'
శ్రీ వై. వి. వెంకటేశ్వరరావు గారికీ ...

'తావి గల మేలిమి బంగారం'
శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠిగారికీ ...

'కోనసీమ వేద మాండలికం'
శ్రీ కూచిమంచి
పూర్ణచంద్రరావు (కె.పి.రావు) గారికీ ...

ఆయురారోగ్య సంపత్పరంపరాభివృద్ధిని
ఆకాంక్షిస్తూ అనేక నమస్సులతో...

- తంగిరాల సుబ్బారావు



**1999-2002** మధ్య కర్నాటక రాష్ట్ర గవర్నరుగా పనిచేసిన

## శ్రీమతి వి. యస్. రమాదేవిగారు



'మేలు కలయిక' స్థాపకులు, కళాపోషకులు

శ్రీ వై. వి. వెంకటేశ్వరరావుగారు

బెంగుళూరు



'ప్రతిభా జ్యాయశ్రీ' అధినేత, సాహిత్య పోషకులు

శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠిగారు

బెంగుళూరు



‘తెలుగు విజ్ఞాన సమితి’ మాజీ అధ్యక్షులు, ప్రముఖ ఆడిటర్

శ్రీ కూచిమంచి పూర్ణచంద్రరావు (శ్రీ కె.పి.రావు) గారు

బెంగుళూరు

# శరత్తారలు - వసంత కోకిలలు

# పగడాల దీవి

-డా॥ రాజేశ్వరీ దివాకర్ల

## 1

బాధ్యత లెన్నున్నా
భుజం మైత్రిని విస్తరిస్తుంది.

పదవుల నెన్ని పొందినా
పలుకు మృదువుగా తడిసిపోతుంది.
ఎన్నికల కమిషనరైనా
ఎన్నుకున్న గవర్నరైనా
అన్నిటిలో మన్నన లభించింది.

భాషంటే అభిమానముంది
పొరుగు బాసనాడే విన్నాణముంది
అధికారాన్ని వినయంతో సాధించగల ప్రాశస్త్యముంది.
పరిపాలన సాగిస్తూ
ప్రజలతో కలసిపోయే ప్రతిభ ఉంది
అతులితమైన ప్రకృతి నారాధించే తత్వముంది
నివాస భవనాన్ని కళాకృతిగా తీర్చే చాతుర్యముంది

సాధారణంగా కనిపించే వ్యక్తి
కట్టుబొట్టు తీరులో కలిగి ఉన్న ఆసక్తి
సరస హాస్యంతో మేళవించిన ఉక్తి
నిజానికి ఆమె మంచి రచయిత్రి.

## 2

ఇక్కడున్నంత కాలం
పత్రికలలో ఉండేది ప్రత్యేక కాలమ్
ప్రతి ఛాయాచిత్రంలో
కళ్ళను ఆకట్టుకునే విగ్రహం

మానవతను మరువని హృదయం
అందుకే రాష్ట్రం వీడినా
మరచిపోలేము ఆమెను మనం.

తెలుగింట పుట్టిన కాకతి రుద్రమదేవి
రాజనీతి ప్రజ్ఞాపాటవాలకు
అలనాటి పలనాటి నాగమ్మ ఠీవి
దృఢచిత్తానికి రాణి చెన్నమకు వావి
అఖిల నారీ గౌరవానికి విరులెత్తిన తావి
వర్తమాన మహిళా సాహిత్య సముద్రంలో
పలుకు నుడికారాల పగడాల దీవి!
ఆమె పేరు శ్రీమతి వి.యస్. రమాదేవి!!

* * *

# SHINING BEACON

**- Ambika Ananth**

Smt. V.S. Ramadevi, a lady full of grace and vitality
has a charming and endearing quality
though a social, political and public celebrity

A symbol of virtue and intelligence
A life glowing with dedication and diligence;
In a male dominated society,
with her vast erudition and boundless energy,
she claimed a new identity,
a brave departure from conformity.
Assertive, positive and fearless,
she dispelled the notion, that
a woman is helpless, hopeless and voiceless
and put the image of a woman
in the realm of power and possibility!

She carried out with penchant and poise
many high and eminent positions,
Honourable Governor,
Chief Election Commissioner
Rajya Sabha's Secretary General,
apart from being a loving spouse and caring mother!
Spreading legal awareness
with vast judicial experience,
working for the handicapped and weaker sections
authoring on topics of constitutional aspects
and also literary essays, novels, stories and plays,
studying political developments -
National and International
Smt. Ramadevi is truly
an all-encompassing success symbol!
This is a tribute to Smt. Ramadevi,
a striking coloured college
a combination of tradition and modern age,
a great phenomenon
a 'shining beacon!'

* * *

## 'నా గౌతమీ తీర సఖుడు'

- తంగిరాల

అక్కడ
మన జీవనది గోదావరికి
అద్దరిని మీరు
ఇద్దరిని నేను.
ఇద్దరం కలసి
బ్రతుకు తెరువు తీర్థయాత్రలో
ఉద్యోగ అర్ధాంగితో కూడి

ఇక్కడ
ఈ కావేరీ తీరంలో
'సరిగంగ స్నానాలు'!

మీది
రాజరాజనరేంద్రుని రాజధాని
ఆదికవి నన్నయ నడయాడిన అవని
వీరభద్రారెడ్డి ఏలిన పోతుగడ్డ
శ్రీనాథ కవిసార్వభౌముని ముద్దుబిడ్డ
అందుకే మీరు
సాహిత్య రసికతా 'హింగువు కట్టిన గుడ్డ'!
కవితా రచనా శక్తి
అంతరంగాన నిశ్చల భక్తి
నిరంతర శ్రీనివాస పాదారవింద సంసేవానురక్తి
నాటక సృజన, నటన, హాస్యప్రియత
చమత్కార సంభాషణా చతురత, మీ స్వీయం
సాహిత్య పోషణలో, కవిపండిత సత్కారంలో
రాయలను జ్ఞప్తికి తెచ్చే మీ వ్యక్తిత్వం
అభినందనీయం!
ఈ కన్నడ నాడులో -
'కవి సమ్రాట్' ను ఘనంగా సత్కరించింది ఎవరు?
బెంగుళూరు విశ్వవిద్యాలయంలో
తెలుగు శాఖ సంస్థాపనకు సహకరించింది ఎవరు?
ఈ ఉద్యానవన నగరంలో -
చెల్లాచెదరుగా పడివున్న
తెలుగు సంఘాలనన్నింటినీ
ఒకే త్రాటిమీదికి తెచ్చిన మొనగాడు ఎవరు?
'మేలు కలయిక' ను సృష్టించిన ఆ అపరబ్రహ్మ ఎవరు?
శ్రీ వేంకటేశ్వరుని మహిమను
షిర్డీ సాయిబాబా కరుణను

శ్రీ రమణ మహర్షి ఎరుకను
వందలాది భక్తిగీతాలుగా రచించిన కవి వరేణ్యు డెవరు?
నాకూ నా 'చన్నాప్రగడ' కూ అచ్చమైన నెచ్చెలి ఎవరు?
ఎవరు ఎవరేమిటి?
ఆయన మావారే!
మా పవిత్ర గౌతమీ తీరంవారు
వై.వి. వేంకటేశ్వరరావుగారు!
బెంగుళూరులో
తెలుగు వెలుగులకు
జయపతాక లెత్తినవారు!!

* * *

## తావి గల మేలిమి బంగారం

– తంగిరాల

జుంటి తేనెవంటి తీయని పలుకులో
చల్లని పిల్లతెమ్మెరల హాయి
బూరుగు దూది వంటి మెత్తని మనసులో
విరిసిన పండు వెన్నెలల రేయి
సింపిల్ లుంగీ
ఖద్దరు లాల్చీ
మెడ చుట్టూ సిల్కు కండువా
బొండు మల్లెల రాశిలా
తెల్లని దుస్తుల సింగారం!
నిండైన ఆయన వ్యక్తిత్వం ముందు
ఓడిపోతుంది మేలిమి బంగారం!

తన్మయీభూత శ్రీరామభక్తి
చిన్మయానంద వేదాంతరక్తి

విరామ రహిత సమాజ సంసేవానురక్తి
కవి పండిత పోషణాభివ్యక్త సంపత్తి!

ఎవిన్యూ రోడ్డులోని
సువర్ణ వ్యాపార పారావారానికి
ఆయన 'ప్రతిభ' ఒక లైట్ హౌస్!
బెంగుళూరు ఆర్యవైశ్య ప్రపంచానికి
ఆయన నాయకత్వం ఒక వైట్ హౌస్!!

33 వసంతాల మా చెలిమి
పాతిక విశ్వనాథ జయంతుల కలిమి
సౌమ్య సౌజన్య సౌహార్ద సౌమనస్యాల బలిమి!
ఒక నవరస భరిత లలితకళా గోష్ఠి
శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠి!

బంగారానికి పరిమళాన్ని
జోడించలేకపోయాడు బ్రహ్మ!
ఆ లోపాన్ని సరిచేసుకుందుకు
సకల సద్గుణ సంపన్నులైన
మా శ్రేష్ఠిగారిని సృష్టించాడు
ఆ పరమేష్ఠి!!

* * *

# కోనసీమ వేద మాండలికం

– తంగిరాల

పీఠికాపుర సంస్థానంలో 'కందరాడ' గ్రామకరణం
కాండిన్యస గోత్రుడు కూచిమంచి తిమ్మకవి 'కవిసార్వభౌముడు'
ప్రసిద్ధుడు జగ్గకవి ఆయన తమ్ముడు
వారి వంశంలో పుట్టిన మహామహుడు

'శ్రీ కూచిమంచి పూర్ణచంద్రరావు' ఉరఫ్ 'కె.పి.రావు'
అందుకే అంతులేని ఆ సాహిత్య పిపాస
అందుకే ఆ లలితకళాపోషణాభిలాష
అందుకే ఆ దక్షిణామూర్తి ఉపాసనా శక్తి!

బెంగుళూరులో అడుగుపెట్టిన సుముహూర్తానికి
సువర్ణమహోత్సవం జరిగినా
మీ పరిపూర్ణ వయస్సుకు వజ్రోత్సవం జరిగినా
ఒక్క పొల్లుపోకుండా కోనసీమ వేదమాండలికాన్ని
ఈనాటికీ వెదచల్లుచున్న మీ వాగ్ధోరణికి
నా ఆశ్చర్య చకిత మనస్సు అర్పిస్తోంది
సహస్ర నమస్సుమనస్సులు... వేలాది వెన్నెల కోళ్ళు!

ఆనాటి విశ్వనాథవారి సన్మానంలో
విశ్వవిద్యాలయ అంధ్రశాఖ అభివృద్ధిలో
భావరాజు రంగనాయకమ్మగారి కీర్తి పతాకను ఎగురవేయడంలో
మీ పాత్ర అతిప్రధానం

ఆర్థిక సమస్యల ఇంద్రజిత్తు అస్త్రాల దెబ్బకు
సొమ్మసిల్లిన 'తెలుగు విజ్ఞాన సమితి'
మీ ఆధ్వర్యవ సంజీవనీ స్పర్శ సోకిన వెంటనే
మూర్ఛ తేరింది లక్ష్మణ స్వామిలా!
అందుకే అయ్యారు మీరు
'రాగిగుడ్డ' మీద 'ఆంజనేయస్వామివారు'!

ప్రసన్న గంభీరమైన మీ ఆకృతి మధురమైనది
'పూర్ణచంద్రుని' వంటి మీ ముఖపద్మం మధురమైనది
చల్లని వెన్నెలవంటి మీ పలకరింపు మధురమైనది
'మధురాధిపతే రఖిలం మధురం' అన్నట్టుగా

మీ వ్యక్తిత్వమంతా మధురాతి మధురమైనది.
బెంగుళూరు తెలుగువారికి మీ స్నేహం
ఒక వాసంత సమీర స్పర్శలా ముదావహం
'రసిక జన మనోభిరామం'!
'సుజన మనః కుముద చంద్రిక'!

అయ్యా! రావుగారూ!
ఈ నగరానికి మకుటాయమానమైన ఆడిటర్‌గారూ!
ఇప్పుడే
ఈ పండు ముసలితనంలోనే
ఇంత అందంగా ఉన్నారే మీరు –
మరి కోడె వయసులో మీ సొగసు
కంత వసంత జయంత నల నలకూబరుల్ని
తప్పక తలపించి ఉంటుంది!
వాల్మీకి వర్ణించిన శ్రీరామచంద్రుని సౌందర్యంలా
'పుంసాం మోహన రూపాయ' గా ఉండి ఉంటుంది!
అప్పుడు బహుశః పురుషజాతికూడా మిమ్మల్ని
గట్టిగా ముద్దుపెట్టుకొని ఉంటుంది!!

* * *

## గుజరాతు గాయం

మతము సవాలు చేసినది, మైత్రికి నూకలు చెల్లిపోయె, భా
రతమొక అగ్నికుండమయి ప్రాక్తన సంస్కృతి నూడ్చివైచె, జీ
వితములతోడ నాడుకొను పిచ్చితనానకు గుర్తుగా 'సబ
ర్మతి' బలియయ్యె, గాయమిది మానునె మందులవెన్ని పూసినన్!

(–ఇటీవల వెలువడిన రసరాజుగారి 'వేదిక' అనే పద్యకవితా సంపుటి నుండి)

సంపాదకీయం - 1

# ఉగ్రవాదులు - హింసోన్మాదం
## (రక్తసిక్తమైన 2002)

### 0. నిర్వచనం:

'ఉన్మాదం' అంటే 'పిచ్చి'. ఇది రెండు రకాలు: మతసిద్ధాంతపరమైనది, రాజకీయ సిద్ధాంతపరమైనది. ఒక్కొక్కసారి రెండూ కలగలిసిన పిచ్చి కూడా ఉంటుంది. ఇటువంటి పిచ్చి తలకెక్కినవాళ్ళు ఘోరమైన హింసాకృత్యాలకు పాల్పడతారు. స్త్రీ బాలవృద్ధులనే విచక్షణ లేకుండా అందరినీ పరమ క్రూరంగా చంపివేస్తారు. జనసమ్మర్దమైన ప్రదేశాలలో బాంబులు పేలుస్తారు. రైళ్ళు కూల్చివేస్తారు. పెద్ద పెద్ద భవనాలు పేల్చివేస్తారు. బస్సులు తగులబెడతారు. విమానాలను హైజాక్ చేసి, ఏమీ తెలియని ప్రయాణీకుల్ని నరకయాతనలకు గురిచేస్తారు. దేవాలయాలమీద దాడిచేసి, అమాయకులైన భక్తుల్ని ఎ.కె. 47 రైఫిళ్ళతో కాల్చి చంపుతారు. వీళ్ళనే ''ఉగ్రవాదులు'' అంటారు. వీళ్ళు ఆధునిక రాక్షసులు.

### 0.1 ఉదాహరణలు:

''ఒసామా బిన్ లాడెన్'' నాయకత్వంలోని ''అల్-ఖైదా'', ''మొల్లాహ్ ఒమర్'' నాయకత్వంలోని ''తాలిబన్లు'', పాకిస్థాన్ గూఢచారి సంస్థ ''ఐ.యస్.ఐ.'' - దాని దగ్గర శిక్షణ పొంది భారతదేశంలో - ముఖ్యంగా కాశ్మీర్‌లో నరమేధం కొనసాగిస్తున్న ''లష్కర్-ఏ-తోయిబా'', ''జైషే మొహమ్మద్'', ''హిజ్‌బ్-ఉల్-ముజాహిద్దీన్'', ''జె.కె.ఎల్.ఎఫ్.'', ''Students of Islamic Movement of India'' (SIMI) మొదలైనవి ఇస్లామిక్ మత సంబంధమైన ఉగ్రవాద సంస్థలు. వీటిలో ''అల్-ఖైదా'' సుమారు 60 దేశాల్లోకి వ్యాపించి ఉంది. శ్రీలంకలోని ''ఎల్‌టిటిఇ'', భారతదేశంలోని ''నక్సలైట్లు'', నేపాల్‌లోని ''మావోయిస్టులు'' మొదలైనవారు రాజకీయ సిద్ధాంత సంబంధమైన ఉగ్రవాదులు. పాలస్తీనాలో ''హమస్'' అనే ఆత్మాహుతి దళాలున్నాయి. మనదేశంలో అస్సాం, నాగాలాండ్, మణిపూర్, త్రిపుర మొదలైన ఈశాన్యరాష్ట్రాలలో క్రైస్తవులుగా మారిపోయిన ఉగ్రవాదులున్నారు. వీరు ప్రత్యేక దేశాలుగా విడిపోవాలని తిరుగుబాట్లు చేస్తున్న గిరిజన ఉగ్రవాదులు. వీరంతా అటు మతమూ, ఇటు రాజకీయమూ కలగలిసిన ఉగ్రవాదులు. ఈ రకరకాల ఉగ్రవాదుల హింసోన్మాదాన్ని 'చైతన్యకవిత' నిర్ద్వంద్వంగా ఖండిస్తోంది.

### 1. భారతదేశంలో ఇస్లామిక్ ఉగ్రవాదుల బెడద:

పాకిస్థాన్ ప్రేరేపిత సీమాంతర ఉగ్రవాదులతో భారతదేశం చాలా అవస్థలు పడుతోంది. 1993లో ''దావూద్ ఇబ్రహీం'', అతని తమ్ముడు ''అనీస్ ఇబ్రహీం'' అతని అనుచరుడు

''అబూసలేం'' మొదలైనవాళ్ళు బొంబాయిలో వరుసగా బాంబులు పేల్చి, ఎందరినో చంపి, పాకిస్థాన్‌కూ, అరబ్ దేశాలకూ పారిపోయారు. 22-12-2000 నాడు ఇస్లామిక్ ఉగ్రవాదులు ఢిల్లీలోని ఎఱ్ఱకోటపై దాడిచేశారు. తరువాత కాశ్మీర్ అసెంబ్లీపై దాడి చేసి ప్రాణనష్టం కలిగించారు. 13-12-2001 నాడు ఏకంగా మన పార్లమెంటుపైనే విరుచుకు పడ్డారు. తొమ్మిదిమంది సెక్యూరిటీ గార్డుల్ని బలితీసుకున్నారు. 16 మందిని గాయపరిచారు.

కేవలం కాశ్మీర్‌లోనే కాకుండా ఇంచుమించు ప్రతిరాష్ట్రంలోనూ ఇస్లామిక్ ఉగ్రవాదులు తిష్ఠవేసుకుని కూర్చున్నారు. వీరికి కొందరు స్థానిక ముస్లింల సహాయ సహకారాలు కూడా అందుతున్నాయి. తమిళనాడులోని ''అల్ ఉమ్మా'', ''ముస్లిం డిఫెన్స్ ఫోర్స్'', ''న్యూ విజన్'', ఆంధ్రప్రదేశ్‌లోని ''దీన్‌దార్ అంజుమన్'' ఈ కోవలోకి వస్తాయి. విచిత్రం ఏమిటంటే - మనరాష్ట్రంలోని ''మజ్లిస నాయకులు, వామపక్షాలు, పౌరహక్కుల సంఘాలవారు, ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ ఉగ్రవాదులకు మద్దతు పలుకుతున్నారు. టెర్రరిస్టుల తరపున వకాల్తా పుచ్చుకొని వాదిస్తున్నారు. ఆలయాలపై దాడులను ఖండించకపోగా, ఉగ్రవాదులను అమరవీరులుగా కీర్తిస్తున్నారు'' (-శ్రీ తిరందాసుగిరి, హైదరాబాద్, 'ఈనాడు లేఖలు', 21-12-2002). ఇటువంటి ధోరణిని 'చైతన్యకవిత' ఖండిస్తోంది.

## 2. గుజరాత్‌లో మతకలహాలు:

గౌతమ బుద్ధుని తర్వాత సత్యాహింసలను గురించి విశేషంగా ప్రచారం చేసిన మహానుభావుడు గాంధీజీ. హిందూ ముస్లిముల సమైక్యం కోసం తన జీవితమంతా శ్రమించిన ఉత్తమవ్యక్తి గాంధీజీ. ఆయన పుట్టి పెరిగిన రాష్ట్రం గుజరాత్. ఆయన స్థాపించిన ఆశ్రమం పేరు ''సబర్మతి''. ఆయన పేరుమీద స్థాపింపబడిన రాష్ట్ర రాజధాని ''గాంధీనగర్''. అటువంటి గాంధీమహాత్ముని రాష్ట్రంలో చెలరేగిన మతకలహాలు భారతీయులందరికీ తలవంపులు తెచ్చిపెట్టాయి. ''గోధ్రా'' మారణకాండతో దీనిని ప్రారంభించినవారు మాత్రం ముస్లింలే.

''గోధ్రా'' గుజరాత్‌లో ఒక రేల్వేస్టేషన్. ఆ స్టేషన్ సిగ్నల్ దగ్గర ఒక ముస్లిం కాలనీ ఉంది. అందులో ''మౌలానా హుసేన్ ఉమర్జీ'' అనే మతగురువు ఉన్నాడు. ఆయన ఐ.యస్.ఐ. ఏజెంటు. పాకిస్థాన్ నుండి పుష్కలంగా నిధులు అందుకుంటున్నాడు. 2002 ఫిబ్రవరి 26వ తేదీని ఈ ఉమర్జీ ''జాబిర్ బెహ్రా'' అనే ముస్లిం యువకుని నాయకత్వంలో ఉన్న 12 మంది దుండగుల్ని పిలిచాడు. వారికి హిందువులపై ద్వేషాన్ని కలిగిస్తూ బాగా 'బోధ' చేశాడు. మర్నాడు ''సబర్మతీ ఎక్స్‌ప్రెస్''లో అయోధ్యనుండి రామమందిర కరసేవకులు వస్తున్నారనీ, వారు ''ఎస్-6'' బోగీలో ఉంటారనీ, ఆ బోగీకి నిప్పు పెడితే

ఒక్కొక్కరికి 1500రూ.లు ఇస్తాననీ వాగ్దానం చేశాడు. అంతేకాదు. తాను చెప్పిన 'ఘనకార్యాన్ని' వాళ్ళు చేయడం ఎక్కడ మానివేస్తారో అని వాళ్ళందరి చేతా ఖురాన్ షరీఫ్‌పై ఒట్టు కూడా వేయించుకున్నాడు. (ఈ విషయాలన్నీ అరెస్టయిన జాబిర్ బెహ్రా కోర్టులో చెప్పాడు. తాను చేసిన నేరాన్ని అంగీకరించాడు. ఈ కేసులో అతనితోపాటు మరో 75 మంది కూడా అరెస్టయ్యారు).

2002 ఫిబ్రవరి 27వ తేదీనాడు గోధ్రా రైల్వేస్టేషన్ నుండి బయలుదేరిన సబర్మతీ ఎక్స్‌ప్రెస్‌పై ఔటర్ సిగ్నల్ దగ్గర, ''జాబిర్ బెహ్రా'' నాయకత్వంలో 2000 మంది ముస్లిం దుండగలు దాడిచేశారు. పెట్రోలు పోసి ''ఎస్-6'' బోగీని పూర్తిగా దగ్ధం చేశారు. ఈ పైశాచిక చర్యలో 59మంది శ్రీరామ కరసేవకులు, స్త్రీలు, పిల్లలు కాలి బూడిదైపోయారు. ఈ వార్త దేశమంతటా కార్చిచ్చులా వ్యాపించింది. ముస్లిములు చేసిన ఈ మారణహోమానికి ప్రతీకారంగా హిందూ తీవ్రవాదులు విజృంభించారు. అహమ్మదాబాద్‌లోని ముస్లిములపై దాడి చేశారు. తరువాత మధ్య దక్షిణ గుజరాత్‌లోని సూరత్, వదోదర, ఆనంద్, బరూచ్ పట్టణాలకు కూడా మతకలహాలు వ్యాపించాయి. నిజానికి గోధ్రాలో రైలు బోగీని తగులబెట్టిన ముస్లిమ్‌లకూ, ఈ పట్టణాలలో నివసించే ముస్లిమ్‌లకూ ఏమీ సంబంధం లేదు. (అలాగే ఇందిరాగాంధీని హత్య చేసిన సిక్కు బాడీగార్డులకూ, ఢిల్లీలో నివసించే వేలాదిమంది సిక్కులకూ ఏమీ సంబంధం లేదు. అయినా ఇందిరాగాంధీ అభిమానులు వారిమీద దాడి చేసి ఐదువేలమంది సిక్కుల్ని చంపి వేశారు). ఈ సత్యాన్ని గుర్తిస్తే అసలు మతకలహాలూ మారణకాండలూ ఉండవు. కాని 'మంద మనస్తత్వం' (Mob Psychology)గల ఉగ్రవాదులు పగ ప్రతీకారం అనే మూర్ఖత్వంలో పడి రాక్షసంగా ప్రవర్తిస్తారు. ఏమీ సంబంధంలేని అమాయక ప్రజలమీద దాడులు చేస్తారు. హత్యలు చేస్తారు. మానభంగాలు చేస్తారు. గృహదహనాలు చేస్తారు. జనజీవితాన్ని అస్తవ్యస్తం చేస్తారు.

2002, ఫిబ్రవరి 27వ తేదీని గోధ్రాలో ప్రారంభమైన మతకలహాలు సుమారు రెండునెలలపాటు నిరాఘాటంగా జరిగాయి. వీటిలో 700 మంది చనిపోయారు. పోలీసుకాల్పుల్లో 170 మంది మరణించారు. ఈ మతకలహాలకు మూలకారణం ''మౌలానా హుసేన్ ఉమర్జీ'' అనే ముస్లిం మతగురువు ప్రోత్సాహంతో''జాబిర్ బెహ్రా'' నాయకత్వంలో ముస్లిం దుండగలు చేసిన గోధ్రా మారణకాండ అని స్పష్టంగా తెలుస్తోంది. కాని ప్రతిపక్షాలు, ప్రసారమాధ్యమాలు, ఆంధ్రప్రదేశ్‌లోని కొందరు ''కవులు, రచయితలు, కళాకారులు'' - ముస్లింలు చేసిన గోధ్రా పైశాచిక చర్యను ఏమాత్రమూ ఖండించకుండా, ఆ తరువాత హిందువులు జరిపిన మతకలహాలను గోరంతలు కొండంతలుగా చేసి ముమ్మరంగా ప్రచారం చేశారు. హిందువులను రాక్షసులుగా చిత్రించారు. దీనితో ముస్లిం యువకులలో పగ ప్రతీకార వాంఛ పెరిగాయి. వారిలో కొందరు పాకిస్థాన్ వెళ్ళి ఉగ్రవాద చర్యలలో శిక్షణ పొంది వచ్చి,

24-9-2002నాడు గుజరాత్‌లో గాంధీనగర్‌లో ఉన్న ''అక్షరధామ్'' అనే స్వామీ నారాయణ్ దేవాలయంపై దాడిచేసి, 31 మంది భక్తుల్ని చంపివేశారు; నూరుమందిని గాయపరిచారు. 22-11-2002నాడు హైదరాబాద్‌లో దిల్‌సుఖ్‌నగర్‌లో షిర్డీ సాయిబాబా గుడిదగ్గర బాంబులు పేల్చారు. అక్కడ 13మంది భక్తులు చనిపోయారు, 50 మంది గాయపడ్డారు. 24-11-2002 నాడు జమ్మూ నడిబొడ్డున ఉన్న రఘునాథ ఆలయంపై ఇద్దరు ''ఫిదాయీ'' ఇస్లామిక్ ఉగ్రవాదులు దాడిచేసి 12 మంది భక్తుల్ని చంపివేశారు. 50మందిని గాయపరిచారు. ఇటీవల ఆంధ్రప్రదేశ్‌కు చెందిన నలుగురు ముస్లిం యువకులు 'అస్గర్ అలీ'' - ''మహమ్మద్ అబ్దుల్ బారీ'' (వీరిద్దరూ నల్గొండకు చెందినవారు); ''సయ్యద్ ఇఫ్‌తెకార్'' - ''అబ్దుల్ రవూఫ్'' (వీరిద్దరూ హైదరాబాద్‌కు చెందినవారు) పాకిస్థాన్ వెళ్ళి ఐ.యస్.ఐ. దగ్గర ఉగ్రవాద కార్యకలాపాల్లో శిక్షణపొంది వచ్చి, 26-3-2003నాడు గుజరాత్ వెళ్ళి అక్కడి బి.జె.పి. మాజీ హోంమంత్రి హరేన్ పాండ్యాను హత్యచేశారు. వీరిపై కేసు నడుస్తోంది.

దేశంలో తరచుగా జరుగుతున్న రైలు ప్రమాదాలకు కూడా ఈ పాకిస్థాన్ ప్రేరేపిత ముస్లిం ఉగ్రవాదులే కారణమని పరిశీలకులు భావిస్తున్నారు. కలకత్తా రాజధాని ఎక్స్‌ప్రెస్ 9-9-2002నాడు బీహార్‌లోని రఫీగంజ్ వద్ద ఘోరప్రమాదానికి గురి అయింది. ఈ ప్రమాదంలో 93 మంది చనిపోయారు, 200 మంది గాయపడ్డారు. ఆంధ్రప్రదేశ్‌లో కాచిగూడ-బెంగుళూరు ఎక్స్‌ప్రెస్ 20-12-2002 నాడు కర్నూలు జిల్లాలో పెండేకల్లు - పగిడిరాయి సమీపాన రామలింగాయపల్లెవద్ద పట్టాలు తప్పింది. ఐదుబోగీలు ధ్వంసమయ్యాయి. నాలుగు బోగీలు రైల్వే బ్రిడ్జిమీదనుండి వాగులో పడ్డాయి. ఈ ప్రమాదంలో 20మంది చనిపోయారు, 101మంది గాయపడ్డారు. దుండగలు రైలుపట్టాల్ని కోసివేయడంవల్ల ఈ ప్రమాదం జరిగిందని తెలిసింది. ఇన్ని చేసినా మన ప్రభుత్వం ఉగ్రవాదుల్ని ఏమీ చేయలేకపోతోంది. ''ఉగ్రవాదుల్ని ఇనుప పాదాలతో అణచివేస్తాం!'' అని బీరాలు మాత్రం పలుకుతోంది!

## 2.1. హింసాప్రచారం పెద్ద తప్పు:

గుజరాత్ మతకలహాల నుండి రాజకీయ పక్షాలు ( ప్రభుత్వ పక్షాలూ, ప్రతిపక్షాలూ కూడా) ఓట్లు దండుకోవాలని ప్రయత్నించడం చాలా దారుణమైన విషయం. అలాగే ఈ మతకలహాలను భూతద్దంలో చూపించిన ప్రసార మాధ్యమాలు, ప్రతిపక్షాలు, ''గుజరాత్ గాయం కవులు, రచయితలు, కళాకారులు'' చాలా పెద్దతప్పు చేశారు. గుజరాత్ గాయం కవులు .... ఒక సంస్థను కూడా స్థాపించారు. దానిపేరు ''లౌకిక ప్రజాస్వామిక సాహిత్య సాంస్కృతిక వేదిక'' (''Secular Democratic Literary and Cultural Forum'' లేదా ''SDLCF''). ఈ వేదికవారు కొందరు కవులను రచయితలను గుజరాత్ తీసికొనివెళ్ళి

అక్కడి పరిస్థితులను చూపించారు. మతకలహాల దుర్భరమైన ఛాయాచిత్రాలను తీయించారు. తిరిగి హైదరాబాద్ వచ్చి సభలు సమావేశాలు ఏర్పాటు చేశారు. కవితలు వ్యాసాలు వ్రాయించారు. ''గుజరాత్‌గాయం'' అనే తెలుగు కవితా సంకలనాన్ని, ''గుజరాత్‌కే జఖమ్'' అనే ఉర్దూ కవితా సంకలనాన్ని, ఒక వ్యాస సంకలనాన్ని, ఒక ఫోటోల పుస్తకాన్ని ముద్రించారు. ఈ పుస్తకాలన్నింటినీ అట్టహాసంగా హైదరాబాదులో ఆవిష్కరించారు. ప్రతిజిల్లాలోనూ ఆవిష్కరించబోతున్నారట. ఈ పని చాలా తప్పిదమైన పని అని నేను భావిస్తున్నాను. నేను భావించడమే కాదు, ఢిల్లీలోని ప్రెస్ కౌన్సిల్ కూడా ఇలాగే భావించింది. ''మృతుల ఛిద్ర అవయవాల బొమ్మలను చూపించవద్దు'' అని మీడియాకు గట్టిగా సూచించింది. ఉగ్రవాదుల దాడులకు, మతకల్లోలాలకు సంబంధించిన వార్తాకథనాలను ప్రచురించే లేదా ప్రసారం చేసే సమయంలో ఆయాఘటనల్లో మృతుల తాలూకు ఛిద్రమైన శరీర భాగాలను కానీ, సంబంధిత ఇతర దృశ్యాలను కానీ, కళ్ళకు కట్టే బొమ్మలను ఆ కథనాలకు జతచేసి అచ్చువేయడంగానీ, ప్రసారం చేయడంగానీ చేయరాదంటూ ప్రెస్ కౌన్సిల్ ఒక కొత్త నియమాన్ని ప్రవేశపెట్టింది. అలాంటి దృశ్యాలు భయాన్ని, ఏహ్యభావాన్నీ రేకెత్తిస్తాయనీ; ఫలితంగా ఘోరప్రతిక్రియలకు దారితీసే ప్రమాదం ఉందనీ, ప్రజలలో మతపరమైన ఉద్రిక్త భావనలను రెచ్చగొట్ట వచ్చుననీ ప్రెస్ కౌన్సిల్ తన ఆందోళనను వ్యక్తం చేసింది. వివిధ ప్రసార సాధనాలు వాటి విధినిర్వహణలో జాతీయ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని పై నియమాన్ని అంటే మార్గదర్శక సూత్రాన్ని అనుసరించాలని విజ్ఞప్తి చేసింది (''ఈనాడు'', 24-12-2002). ప్రతిపక్షాలు, ప్రసారమాధ్యమాలు, గుజరాత్ గాయం కవులు మాత్రమే కాదు, కొన్ని ఆంగ్ల పత్రికలు కూడా గుజరాత్ మతకలహాల విషయంలో పక్షపాత దృష్టితో హిందువులకు వ్యతిరేకంగా దుష్ప్రచారం చేశాయి: ''**Prasar Bharathi Chief M.V. Kamath has criticised the reporting by English media during communal riots that broke out in the state after Godhra carnage and exhorted the need for a more responsible attitude. ...Naming particularly an electronic channel and a newspaper, Mr. Kamath alleged that reports were biased. Such reporting tarnished the image of Gujarath in India and elsewhere. ... He said that the role of newspapers is to make the feeling of nationalism stronger**''. **(Deccan Herald, Wednesday, April 16, 2003)**

ప్రతిపక్షాలు, ప్రసారమాధ్యమాలు, SDLCF వారు చేసిన విషప్రచారాన్ని చైతన్య కవిత ఖండిస్తోంది.

## 2.2 'గుజరాత్ గాయం' కవులకు 'కాశ్మీర్ గాయాలు' కనపడవా?

మనదేశంలో మతకలహాలకు మూలవిరాట్ ''మహమ్మదాలీ జిన్నా''. దేశవిభజన సమయం (1947) లోనూ, అంతకు ముందూ ''జిన్నా'' తన విషపూరితమైన ఉపన్యాసాలతో

ముస్లిములను రెచ్చగొట్టి ఎన్నో మతకలహాలను సృష్టించాడు. ''నౌఖాళీ మతకలహాలు'', ''మోప్లా మతకలహాలు'' మొదలైన వాటిలో లక్షలాది హిందువులు చంపి వేయబడ్డారు. దేశవిభజన జరిగిన తరువాత కూడా పశ్చిమ పాకిస్థాన్‌లో ఉన్న వేలాది హిందువుల్ని చంపివేసి, ఆ శవాలను రైలు బోగీలలో నింపి భారతదేశానికి రవాణా చేశారు అక్కడి ముస్లిం దుండగులు. వాటితో పోలిస్తే గుజరాత్ మతకలహాలు చాలా చాలా చిన్నవి.

1984లో ఇందిరాగాంధీ ఇద్దరు సిక్కు బాడీగార్డుల చేత చంపబడినప్పుడు, ''ఆమె భక్తులు'' ఢిల్లీలో ఐదువేలమంది సిక్కుల్ని దారుణంగా హత్యచేశారు. ఆ హంతకులకు ఇంతవరకూ శిక్ష పడలేదు. ఆనాడు హత్య చేయబడిన వారి భార్యలు (వితంతువులు) ఒక సంఘంగా ఏర్పడి, న్యాయం కోసం ఈనాటి వరకూ పోరాడుతూనే ఉన్నారు. ఆనాటి సిక్కుల ఊచకోతతో పోల్చినపుడు ఈనాటి గుజరాత్ మతకలహాలు ఏమీ పెద్దవి కావని తేలుతుంది. గుజరాత్ మతకలహాలను గురించి ఈనాడు గుండెలు బాదుకుంటున్న ప్రధాన ప్రతిపక్షం ఆనాడు తాను అధికారంలో ఉన్న విషయాన్ని గుర్తించడం మంచిది.

సీమాంతర ఇస్లామిక్ ఉగ్రవాదులు గత 20 ఏండ్లుగా కాశ్మీరులో జరుపుతున్న దారుణ మారణకాండతో పోల్చి చూచినప్పుడు కూడా గుజరాత్ మతకలహాలు మిక్కిలి అల్పమైనవిగా కనబడతాయి. గత 20 ఏండ్లలో కాశ్మీర్‌లో 35 వేలమంది హిందువులు చంపబడ్డారు. 2 లక్షల 50 వేలమంది హిందువులు (కాశ్మీరీ పండితులు) అక్కడి నుండి తరిమి వేయబడ్డారు. కాశ్మీర్‌లో హిందువులు పూజించుకునే భగవతి దేవాలయాన్ని నేల మట్టం చేశారు. నిన్నగాక మొన్న, అంటే 24-3-2003నాడు కాశ్మీర్‌లో ఉగ్రవాదులు 24 మంది కాశ్మీరీ పండితుల్ని వరుసగా నుంచోబెట్టి రైఫిల్స్‌తో కాల్చి చంపారు. వీరిలో 11మంది స్త్రీలు, ఇద్దరు పిల్లలు కూడా ఉన్నారు. ఇప్పుడు కాశ్మీరీ పండితులందరూ జమ్మూలోనూ, ఢిల్లీ పరిసరాల్లోనూ కాందిశీక శిబిరాల్లో దుర్భరమైన జీవితాలు గడుపుతున్నారు. వీరిని గురించి ఏ రాజకీయ పక్షమూ పట్టించుకోవడం లేదు. (వీరికి ఓట్లు లేవు కదా!). మన ఆంధ్రప్రదేశ్‌లోని ''గుజరాత్‌గాయం'' కవులకూ, రచయితలకూ, కళాకారులకూ ఈ ''కాశ్మీర్‌గాయాలు'' కనపడకపోవడం ఆశ్చర్యంగా ఉంది! వీరి పక్షపాత దృష్టిని చైతన్య కవిత ఖండిస్తోంది.

## 2.3 ఉపసంహారం:

ఏదిఏమైనా, మతకలహాలు చిన్నవైనా పెద్దవైనా, మనమంతా ఖండించి తీరవలసిందే. మనది సెక్యులర్ దేశం. అన్ని మతాలవారూ, అన్ని కులాలవారూ, అన్ని భాషల వారూ సమానమైన అవకాశాలు కలిగి కలసిమెలసి ఉండాలి. ఇది తరతరాలుగా వస్తున్న భారతీయ సంస్కృతి. అయితే ముస్లింలలోని కొందరు ఉగ్రవాదులూ, హిందువులలోని కొందరు అతివాదులూ దేశంలో హింసను ప్రజ్వరిల్ల జేస్తూ ప్రజలకు శాంతి లేకుండా చేస్తున్నారు.

ప్రభుత్వం వీరిని అదుపులో పెట్టడం చాలా అవసరం. ఈ సందర్భంగా గాంధీ మహాత్ముని మాటల్ని మనమంతా జ్ఞప్తికి తెచ్చుకోవాలి:

''దేవుడు మనుషులందరినీ ఒకే జాతిగా పుట్టించాడు. కానీ మనిషి తన అతి తెలివితో, స్వార్థంతో, అహంకారంతో, కుసంస్కారంతో రకరకాల మతాలను, కులాలను సృష్టించుకున్నాడు. ఇదే భవిష్యత్తులో మనుషులకు శాపంగా పరిణమించనుంది!''

---

## సంపాదకీయం - 2

# ఇరాక్ యుద్ధం

ఈ సంవత్సరం మార్చి 20వ తేదీని అమెరికా ఇరాక్‌పై దండెత్తింది. బ్రిటన్ కూడా అమెరికాకు తోడయింది. 'సంకీర్ణ దళాలు' (Allied Forces) అనే పేరుతో ఈ రెండు దేశాలూ కలిసి ఇరాక్‌ను ముట్టడించాయి. బాగ్దాద్‌పైనా ఇతర నగరాలపైనా అహోరాత్రాలు బాంబుల వర్షం కురిపిస్తున్నాయి. ఇరాక్ నియంత సద్దాం హుస్సేన్‌ను గద్దె దింపడమే ఈ దండయాత్రకు పరమావధి. ఈ యుద్ధం చాలా అన్యాయమనీ, ఇరాక్ నగరాలలోని స్త్రీలు, వృద్ధులు, పిల్లలు అన్యాయంగా బలి అయిపోతారనీ ప్రపంచ దేశాలన్నీ ముక్తకంఠంతో ఘోషపెడుతున్నాయి. ఐక్యరాజ్యసమితి ఈ యుద్ధానికి అనుమతి నివ్వలేదు. అయినా అమెరికా లెక్కచేయలేదు. అమెరికాలోనూ బ్రిటన్‌లోనూ ఉన్న ప్రజలు కూడా 'యుద్ధం వద్దు బాబోయ్' అని గోల పెడుతున్నారు. అరబ్ రాజ్యాలే కాకుండా, అగ్రరాజ్యాలైన ఫ్రాన్సు, జర్మనీ, రష్యా, చైనాలు ఈ యుద్ధాన్ని వ్యతిరేకించాయి. అయినాసరే అమెరికా తన మొండివైఖరిని విడనాడలేదు.

సద్దాంహుస్సేన్ దగ్గర జీవ ఆయుధాలూ, రసాయన ఆయుధాలూ ఉన్నాయనీ, వాటిని ప్రయోగిస్తే ప్రజలు అసంఖ్యాకంగా చనిపోతారనీ, అతడు ఆ ఆయుధాలను 'అల్‌ఖైదా' నాయకుడైన 'ఒసామా బిన్ లాడెన్' కు ఇస్తాడనీ అమెరికా ఆరోపణ. ఈ ఆరోపణలో కొంత నిజం లేకపోలేదు. ఇదివరలో సద్దాం హుస్సేన్ ఈ మారణాయుధాలను 1980-88 మధ్య జరిగిన ఇరాక్-ఇరాన్ యుద్ధంలో ఇరాన్‌పై ప్రయోగించాడు. తన దేశంలోనే ఉత్తరాదిని తిరుగుబాటు చేస్తున్న ఖుర్దులపైన కూడా ప్రయోగించాడు. 1988 లో మార్చినెలలో ''హల్‌బ్జా'' అనే చోట విషవాయువును ప్రయోగించి వేలాదిమంది ప్రజల్ని (ఖుర్దుల్ని) హతమార్చాడు. అలాగే 'అల్-ఖైదా' తీవ్రవాదులకు ఇరాక్‌కు సన్నిహిత సంబంధాలున్నాయి. 1998 మార్చిలో అల్-ఖైదా రాయబారి బాగ్దాద్‌ను దర్శించాడు. 2001 సెప్టెంబరు 11వ తేదీని లాడెన్ అమెరికాపై దొంగదెబ్బ తీసినప్పుడు అతనికి ఆర్థిక సహాయం చేసింది కూడా సద్దాం హుస్సేనే! అతడు తన ప్రజల్ని పరమక్రూరంగా అణచివేస్తున్నాడన్నది కూడా

యథార్థమే. తనకు ఎదురు తిరగడానికి ప్రయత్నించిన ప్రజల చేతులు నరికివేసి, కాళ్ళు నరికివేసి, కళ్ళు పీకివేసి, రహస్యంగా ఉరి తీసివేసి, తన గద్దెపై కన్నువేశారనే అనుమానంతో సొంత అల్లుళ్ళిద్దరని చంపివేసి, పరమ కిరాతకంగా గత 25 ఏళ్ళనుండి ఘోరంగా పాలిస్తున్న నియంతను పదవీచ్యుతుణ్ణి చేయడంలో ఏమీ తప్పులేదని కొందరు రాజకీయ విజ్ఞులు భావిస్తున్నారు. పాలకుడు ఎంత క్రూరుడైనా సరే, ఒకదేశంయొక్క సార్వభౌమాధికారాన్ని హరించే హక్కు అమెరికాకు లేదని మరికొందరు రాజకీయ విద్వాంసులు భావిస్తున్నారు. ఎడాల్ఫ్ హిట్లర్, జోసెఫ్ స్టాలిన్‌ల తరువాత చెప్పదగిన పరమక్రూరుడైన నియంత సద్దాం హుస్సేన్ అనడంలో ఏ మాత్రం సందేహం లేదు.

సద్దాం హుస్సేన్ క్రూర పరిపాలనను, అతని ''బాత్‌పార్టీ''ని వ్యతిరేకించిన వారిని రోజుకు ఐదారుమందిని రహస్యంగా ఉరి తీయించేవాడు. వీరిలో స్త్రీలు కూడా ఉండేవారు. ఈ 'దోషుల' పేర్లు వ్రాయకుండా వీరిలో ఒక్కొక్కరికి ఒక్కొక్క సంఖ్యను కేటాయించేవాడు. అలా సంఖ్యలుగల రాతిపలకలతో కూడిన సమాధులు ఇటీవల ఒక శ్మశానంలో 900 వరకూ బయటపడ్డాయి. మరొక గుహలో 1980-88 మధ్య జరిగిన ఇరాక్-ఇరాన్ యుద్ధంలో ఇరాన్‌కు చెందిన షియామతస్థులైన సైనికుల అస్థిపంజరాలు అట్టపెట్టెల్లో పెట్టి ఉంచాడు. అమెరికా దండయాత్రలో ఒక చోట ఇటువంటి పెట్టెలు 1200 వరకూ బయటపడ్డాయి. సద్దాంహుస్సేన్ ఎంత క్రూరుడో చెప్పడానికి ఒక జీవవంతమైన ఉదాహరణ ఇస్తాను. **"Sami Girgis Dawud"** ఒక ఇరాకీ పౌరుడు. అతడు సద్దాం హుస్సేన్ బాత్‌పార్టీని వ్యతిరేకించాడు. అతని జైల్లో పెట్టి చిత్రహింసలకు గురిచేశారు. ఆ హింసలను గురించి అతని మాటల్లోనే చెపుతాను. **"Twice I was locked up, because I was against the party. They had me in the Karkh security headquarters, hanging naked from the ceiling and they shocked me with electrodes. As my skin burned, they laughed." (Deccan Herald, Sunday, April 27, 2003)**

సద్దాం హుస్సేన్‌కు సుందోపసుందులవంటి లేదా హంస డిభకుల వంటి ఇద్దరు కొడుకులు ఉన్నారు: 'ఉదయ్', 'ఖుసే'. క్రూరత్వంలో వీళ్ళు తండ్రికన్నా నాలుగాకులు ఎక్కువ చదివారు. వీళ్ళు చేసిన హత్యలు, మానభంగాలు లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి. వీళ్ళు కోట్లాది డాలర్ల ధనాన్ని కూడా కూడబెట్టుకున్నారు. (వీళ్ళ రాక్షస కృత్యాలను పూర్తిగా తెలుసుకోవాలంటే చూడుడు: **"The Brutal Sons", Deccan Herald, March 23,2003**).

క్రీ.శ. 1757 జనవరి 24వ తేదీని 'బొబ్బిలి కోట'ను ఖాళీచేసి 'పాలకొండ'కు వలస పోవలసిందిగా ఆజ్ఞాపించాడు ఫ్రెంచివారి 'బుస్సీదొర'. 2003 మార్చి 20వ తేదీలోగా ఇరాక్‌ను వదలి (తన ఇద్దరు కొడుకులతో సహా) ఎక్కడికైనా వలసపొమ్మన్నాడు అమెరికావారి 'బుష్‌దొర'! బొబ్బిలివీరులు ఆత్మాభిమానంతో 'బుస్సీదొర'ను ఎదిరించారు. ఇప్పుడు

సద్దాంహుస్సేన్ తన కొడుకు లిద్దరితో కలిసి 'బుష్‌దొర'ను ఎదిరిస్తున్నాడు కేవలం ఆత్మాభిమానంతోనే! కాని తన ఆత్మాభిమానంకోసం అమాయకులైన ప్రజల్ని బలిచేయడం ఎంతవరకు సమంజసం? ఇది బొబ్బిలి వీరులు తమ అంతఃపుర కాంతల్ని కత్తులతో నరికి చంపివేయడం వంటి నరమేధం లాంటి కిరాతక చర్య! అమెరికాను జయించే దేశం ఈ భూప్రపంచంలో ఎక్కడా లేదు. అమెరికాను జయించగలనని సద్దాంహుస్సేన్ భావిస్తే అది అతని మూర్ఖత్వానికి పరాకాష్ఠ!

ఇప్పటికే ఇరాక్‌పై అమెరికా విధించిన **sanctions** వల్ల, గత పదేళ్ళుగా సరియైన ఆహారం లేక ప్రతి సంవత్సరమూ వేలాదిమంది శిశువులు చనిపోతున్నారు. మూలిగే నక్కపై తాటిపండు పడ్డట్టుగా ఇప్పుడు మళ్ళీ ఈ యుద్ధం వచ్చి పడింది. ఈ యుద్ధంలో ఎందరో స్త్రీ బాల వృద్ధులు చనిపోతున్నారు. వందల్లో సైనికులు చనిపోతున్నారు. సద్దాం హుస్సేన్‌కు నిజంగా తన దేశప్రజలపై ఏమాత్రం ప్రేమానురాగాలు ఉన్నా, జార్జ్‌బుష్ చెప్పగానే తన దేశం వదలి ప్రవాసం పోయి ఉండవలసింది. ప్రజల సంక్షేమం కన్నా పాలకుడు ముఖ్యమా? 25 ఏళ్ళుగా (క్రూరంగా) పాలిస్తున్నాడు, చాలదా? అమెరికాను గెలుద్దామనేనా ఈ దుస్సాహసం? సమాజం కన్నా వ్యక్తి ముఖ్యం కాదు. ఒక దేశంలో ఉగ్రవాదుల్ని పెంచి పోషించే నియంతను దింపి ప్రజాస్వామ్యాన్ని రక్షించడంలో తప్పేమీ లేదు. కాని అటువంటి నియంతలున్న అన్నిదేశాల్లోనూ అమెరికా ఈ పనిచేస్తే (ముఖ్యంగా పాకిస్థాన్‌లో చేస్తే) మనం సంతోషించేవాళ్ళం. కేవలం పెట్రోలు బావులమీద కన్నేసి ఇరాక్‌లో ఈ మాయదారి యుద్ధానికి దిగినాడేమో బుష్ దొరగారు అని అనిపిస్తోంది. (ఈ ఇరాక్ యుద్ధం తరువాత కాశ్మీర్‌లో వేలుపెడతాడేమో అని నాకు భయంగా కూడా ఉంది).

రావణుడు సీతను తెచ్చి, రామునకిచ్చి, ఆయన కాళ్ళమీద పడి క్షమించమని ప్రార్థిస్తే రామరావణ యుద్ధం జరిగేది కాదు. పాండవుల 12 సంవత్సరాల అరణ్యవాసం, ఒక సంవత్సరం అజ్ఞాతవాసం చేసిన తరువాత దుర్యోధనుడు పాండవుల రాజ్యభాగం పాండవులకిచ్చివేస్తే (కనీసం ఐదుగురికీ ఐదు ఊళ్ళైనా ఇచ్చి ఉంటే) కురుక్షేత్ర సంగ్రామం జరిగి ఉండేది కాదు. లక్షలాది వీరులు చనిపోయి ఉండేవారు కాదు. 2001 సెప్టెంబరు 11 తర్వాత ఆఫ్ఘనిస్థాన్‌లోని తాలిబన్లు ''ఒసామా బిన్‌లాడెన్''ను అమెరికాకు అప్పగించి ఉంటే ఆఫ్ఘన్ యుద్ధం జరిగి ఉండేది కాదు. అనేక దశాబ్దాలుగా అంతర్యుద్ధాలతో అణగారిపోయిన ఆ దేశంపై అమెరికా బాంబులు పడేవికావు. జననష్టం సంభవించి ఉండేది కాదు. ఈ సంవత్సరం మార్చి 20వ తేదీకి ముందుగానే సద్దాం హుస్సేన్ తన కొడుకులతో సహా ఇరాక్‌ను వదలివేసి ఉంటే ఈ యుద్ధం జరిగి ఉండేది కాదు. వందలాది మంది సైనికులు, పిల్లలు, స్త్రీలు, పురుషులు, వృద్ధులు చనిపోయి ఉండేవారు కారు. ఇంత విధ్వంసం జరిగి ఉండేది కాదు. సరిగ్గా యుద్ధ ప్రారంభానికి మూడు రోజులు ముందుగా మార్చి 17వ తేదీని రష్యా అధ్యక్షుడు

'వ్లాడిమిర్ పుతిన్' తమ మాజీ ప్రధానమంత్రి ఇరాక్‌కు చిరకాల మిత్రుడు అయిన Yevgeny Primakov ను సద్దాం హుస్సేన్ దగ్గరకు రహస్య రాయబారిగా పంపి, ఇరాక్ ప్రజలసంక్షేమం కోసం దేశాన్ని వదలి వెళ్ళిపొమ్మని హితువు చెప్పించాడు. అయినా సద్దాం హుస్సేన్ వినలేదు. అందువల్ల ఇరాక్ యుద్ధం అనే అనర్థం సంభవించింది. సద్దాం హుస్సేన్‌తో తాను జరిపిన రహస్య సమావేశాన్ని గురించి ఇటీవల రష్యన్ టెలివిజన్‌లో ముచ్చటిస్తూ ఎవ్‌జనీ ప్రిమకోవ్ ఇలా అన్నాడు: "I told him this: 'if you love your country and love your people... and if you want to save your people from these sacrifices, you must leave your post as President of Iraq'. I told him that I understood how difficult this proposal was for him and how it could change his life, but that he had to understand that he was doing this for Iraq, for his motherland," Primakov said. (Deccan Herald, Sunday, April 13, 2003)

ఇప్పుడు ఇరాక్‌పై అమెరికా చేస్తున్న ఈ (అన్యాయపు) దాడిని ప్రపంచంలోని అన్ని దేశాల ప్రజలూ ముక్తకంఠంతో ఖండిస్తున్నారు. పాపం, అంతకన్నా ఏమి చేయగలరు వారు? సుమతిశతకకారుడు చెప్పినట్టుగా ''సామజము చెఱకు మేసిన, దోమలు పదివేలు చేరి త్రోలంగలవా?'' అన్నట్టుగా ఉంది యుద్ధ వ్యతిరేకులైన ఈ వివిధదేశాల ప్రజల పరిస్థితి.

''యుద్ధం అవసరమా? సమర్థనీయమేనా? అనే ప్రశ్నలు అనవసరం. యుద్ధం ఒక నేరం. అంతే!'' అన్నాడు ఎర్నెస్ట్ హెమింగ్‌వే.

''యుద్ధాలను మనమే పాతిపెట్టాలి. లేకపోతే ... అవే మనల్ని పాతిపెడతాయి!'' - అన్నాడు జాన్ ఎఫ్. కెన్నడీ.

''యుద్ధమంటే నాయకులకే ఆసక్తి. దానిని కోరుకునే ప్రజలెక్కడా కనిపించరు'' - అంటాడు రాల్ఫ్ బంచ్.

ఈ సందర్భంలో మళ్ళీ మనం మహాత్మా గాంధీగారి మాటల్ని జ్ఞప్తికి తెచ్చుకోవాలి: ''శత్రువులతో పోరాడాల్సిన పరిస్థితే వస్తే ... వారిని ఆయుధాలతో కాదు ... ప్రేమతో జయించు!''.

**తాజాకలం:** ఇరాక్‌లో సద్దాం హుస్సేన్ ప్రభుత్వం కూలిపోయింది. అరాచకం చెలరేగింది. దుండగులు ప్రభుత్వ భవనాలను బ్యాంకులను, ధనికుల ఇళ్ళను దోచుకుంటున్నారు. వేలాది సంవత్సరాల సంస్కృతి కలిగిన జాతీయ మ్యూజియంలోని అపురూప కళాఖండాలలో కొన్నింటిని ఎత్తుకుపోయారు. మరికొన్నింటిని ధ్వంసం చేశారు. మిక్కిలి ప్రాచీనమైన గ్రంథాలు కలిగిన విలువైన లైబ్రరీని అగ్నికి ఆహుతి చేశారు. సద్దాం హుస్సేన్ అమెరికాకు ఎదురు తిరగడంవల్ల ఇన్ని దుష్ఫలితాలు జరిగాయి.

-14-4-2003

**అతిథి సంపాదకీయం:**

# చెట్లపై కవితలు

'ఆకులో ఆకునై/ పూవులో పూవునై / కొమ్మలో కొమ్మనై / నునులేత రెమ్మనై / ఈ యడవి దాగిపోనా / ఎట్లైన యిచటనే ఆగిపోనా' అంటూ అద్భుతమైన గీతాన్ని వ్రాశారు ఆంధ్రా షెల్లీ అనిపించుకున్న కృష్ణశాస్త్రి. ఆ భావాన్నే ఏనాడో నిజం చేశారు ఫ్రెంచి కవి జీన్ డి శాంట్యూల్. 17వ శతాబ్దికి చెందిన జీన్ డిశాంట్యూల్ లాటిన్‌లో అద్భుతమైన కవితలు వ్రాసి ఎంతో పేరు తెచ్చుకున్నాడు. ప్రకృతి సౌందర్యాన్ని వర్ణిస్తూ ఆయన వ్రాసిన ఆ మధుర కవితలు సాహితీ ప్రియులను విశేషంగా ఆకర్షించాయి. అయితే జీన్ డిశాంట్యూల్ ఆ కవితలను కాగితాలపై పెన్నుతో వ్రాయలేదు - ఓ బంగారు జడపిన్నుతో చెట్ల బెరడులపై చెక్కాడు. ఫ్రాన్సులోని చాంటిల్ గ్రామంలో ఓ తోటలో ఉంటూ ఆ తోటలో నుంచి బయటకు అడుగుపెట్టని జీన్ డిశాంట్యూల్ విశాలమైన ఆ తోటలో గల అసంఖ్యాకమైన చెట్లపై తన కవిత్వాన్ని చెక్కాడు. అతిలోక సుందరి అయిన తన ప్రియురాలి బంగారు జడపిన్ను అడిగి తీసుకొని, ఆ పిన్నుతో తన కవితలను చెట్ల బెరడులపై చెక్కాడు. జీన్ డిశాంట్యూల్ మిత్రుడొకరు చెట్టు చెట్టుకీ తిరిగి ఆ కవితలను కాగితాలపై వ్రాసి పారిస్ చేర్చాడు. లాటిన్ భాషలో ఉన్న ఆ కవిత్వం ప్రజల్ని బాగా ఆకర్షించింది. పుస్తకాల రూపంలో అచ్చయింది. పారిస్‌లోని అనేక ఫౌంటెన్ల పైనా ప్రసిద్ధ కట్టడాలపైనా ఆ కవితల్నీ, జీన్ డిశాంట్యూల్ ఇతర సూక్తుల్నీ చెక్కారు. వాటిని ఈనాటికీ మనం చూడవచ్చు. జీన్ డిశాంట్యూల్ కవితలను మూడు సంపుటాలుగా చేసి న్యూయార్క్ పబ్లిక్ లైబ్రరీలో భద్రపరిచారు!

# పాతబడని పాట

సుఖంలో దుఃఖంలో ఆనందంలో విషాదంలో - ప్రతి సందర్భంలోనూ పాటలు పాడుకోవడం మనుషులకు అలవాటే. పనులు చేసుకొనేటప్పుడు శ్రమను మరిచిపోవడానికి కూడా గొంతెత్తి పదం అందుకుంటూ ఉంటారు. కొత్తనీరు వచ్చి పాత నీటిని తోసివేసినట్లుగా కాకుండా అయిదు వేల సంవత్సరాలుగా ఏవిధమైన మార్పు లేకుండా అదే బాణీతో, అదే సాహిత్యంతో శ్రమజీవులు పాడుకుంటున్న పాట ప్రపంచంలోకెల్లా ఒకేఒక్కటి ఉంది. అదే ఈజిప్టులోని రైతులు ఏతాములాంటి సాధనంతో పొలాలకు నీరు పెట్టుకుంటూ పాడుకొనే పాట. పంట పొలాల్లో పనిచేసుకొనేవారు నాట్లు వేసేటప్పుడు, నీరు పెట్టేటప్పుడు, ఊడ్పులప్పుడు, పంట కోసేటప్పుడూ - ఇలా ప్రతి సందర్భంలోనూ పాటలు పాడుతూ శ్రమను లెక్కచేయకుండా పనులు చేస్తుంటారు. ఈజిప్టులో నైలు నదీ లోయలోని రైతులు 'షెడూఫ్' అనే శ్రవణపేయమైన ఓ పాట పాడుకుంటూ ఉంటారు. ఆ జానపద గీతం 50

శతాబ్దాలుగా అంటే 5000 సంవత్సరాలుగా ఈనాటికీ ఏ మార్పు లేకుండా నైలునదీ లోయలో వినపడుతూనే ఉంది. ఈజిప్షియన్ డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఆర్ట్స్‌వారు ఆ గీతాన్ని రికార్డుచేసి భద్రపరిచారు!

***(సౌజన్యం: 'మాయ'లోకం, ఈనాడు, ఆదివారం 1 డిసెంబరు 2002; మరియు ఆదివారం 15 డిసెంబరు 2002)***

భారతీయుల వేదాలు కూడా ఇటువంటివే కదా! క్రీ.పూ. 10వేల సంవత్సరాల నుండి మౌఖిక సంప్రదాయంలో స్వరసహితంగా బ్రాహ్మణుల చేత కాపడబడుతూ వచ్చాయి. మ్లేచ్ఛుల దాడుల్ని తట్టుకొని ఈ మహత్కార్యాన్ని నిర్వహించిన బ్రాహ్మణులకు భారత జాతి అంతా ఋణపడివుంది.

# POETRY AS PANACEA

**By MAYA JAYAPAL**

Most of us have a complex, an 'attitude' about poetry, may be fuelled by memories of trying to understand seemingly obscure poetic compositions or trying to memorise verses which made no sense during the formative educational years. They may have been verses read badly by teachers who could not comprehend them either, let alone appreciate them. This again leads us to the mistaken conclusion that only the knowledgeable, literate and erudite can appreciate poetry.

However, those who have 'discovered' poetry have also discovered a magic land, a land which has the ability to restore a sense of mystery and beauty to our daily grind. It is a marvellous form of meditation to read a verse slowly, to savour it with all one's senses, to allow it to recapture in your mind what has been evocatively set out by the poet. It can be a single emotion, an experience, described in words, which go deep into your inner self, and connect with the universe and all around you, to be viewed with compassion and empathy.

There have been times when I have felt deeply, but do not know exactly what I feel. I find that at such times, if I take down a book of poems, somewhere in it I am bound to discover what I feel, and I am cleansed, in harmony with myself.

There is a vast unbounded spectrum of poetry to suit every mood, every nuance. They range from the absurd such as the incomparable limericks of Edward Lear to the sublime and the metaphysical such as John Donne's 'Death Be Not Proud'. Poetry deals with such diverse themes such as love fulfilled, love thwarted, the joys of children and matrimony, of bread baking, the everyday spectacle of the host of golden daffodils, and the 'dappled things' described by Hopkins in 'Pied Beauty'.

Sometimes a single line can poignantly pierce the heart. When I brought my father, with whom I have a shared passion for words, home, after a critical time at the hospital, he was very depressed and quoted a line to express his feelings; "Home they brought the warrior dead." Poetry and daydreaming, for me, go together. When I go to Ooty, I sit on the veranda of the magnificently old world Ooty club, a book of poetry in my lap, reading at random and escaping to Keats "charmed magic casements, opening on the foam of perilous seas in fairy lands forlorn."

And often, reveries, which are induced by poetry, induce creativity. Poetry is a deep spiritual relationship between the poet and the reader. It can be the spiritual tool of prayer, meditation, solitude, harmony and beauty.

Poetry slows you down, reassigns priorities and possesses secrets, deep unfathomable secrets waiting to be revealed. There is poetry in everything. Outside the window of my father's hospital room is a tree whose wind-tossed branches are a symphony in balletic grace.

There is poetry in motion in the ocean waves, the formation of birds in flight; poetry in stillness in the sweet curve of a child's eyelashes when asleep, in my mother's clasped hands, in the folds of a sari as worn by a graceful woman. In fact poetry is everywhere, if you can recognise it....

*(Courtesy: Deccan Herald, Friday, September 6, 2002)*

* * *

# శతమానం భవతి...

ఈ క్రింది వృద్ధ కవులకు, పండితులకు, విమర్శకులకు, రచయితలకు, సాహిత్య పోషకులకు 'చైతన్య కవిత' మరియు 'శ్రీరస' జన్మదిన శుభాకాంక్షలు తెలియజేస్తున్నాయి:

1. శ్రీ ''పతాభి'' (శ్రీ తిక్కవరపు పట్టాభిరామరెడ్డి), బెంగుళూరు, 19-2-2003 నాటికి 84 వసంతాలు నిండాయి.

2. శ్రీ యార్లగడ్డ వెంకటసుబ్బారావు, నల్లూరు, రేపల్లె మండలం, గుంటూరు జిల్లా, 3-10-2002 నాటికి 82 శరత్తులు నిండాయి.

3. డా॥ నండూరి రామకృష్ణమాచార్య, సికింద్రాబాద్, 29-4-2003 నాటికి 82 వసంతాలు నిండాయి.

4. శ్రీ నిడమర్తి ఉమారాజేశ్వరరావు, బెంగుళూరు, 17-10-2002 నాటికి 79 శరత్తులు నిండాయి.

5. శ్రీ వై.వి. వెంకటేశ్వరరావు, బెంగుళూరు, 14-4-2003 నాటికి 79 వసంతాలు నిండాయి.

6. డా॥ ఆవంత్స సోమసుందర్, పిఠాపురం, తూర్పుగోదావరి జిల్లా, 18-11-2002 నాటికి 78 శరత్తులు నిండాయి.

7. శ్రీ సకలా నరసింహులుశ్రేష్ఠి, బెంగుళూరు, 11-4-2003 శ్రీరామ నవమి నాటికి 77 వసంతాలు నిండాయి.

8. శ్రీ మహమ్మద్ ఇస్మాయిల్, కాకినాడ, 15-6-2002 నాటికి 75 వసంతాలు నిండాయి.

9. శ్రీ కె.పి.రావు (కూచిమంచి పూర్ణచంద్రరావు), బెంగుళూరు, 11-9-2002 నాటికి 75 శరత్తులు నిండాయి.

10. డా॥ గుంటూరు శేషేంద్రశర్మ, హైదరాబాద్, 20-10-2002 నాటికి 75 శరత్తులు నిండాయి.

11. శ్రీ టి.వి.కె. సోమయాజులు, తణుకు, పశ్చిమ గోదావరి జిల్లా, 30-12-2002 నాటికి 72 వసంతాలు నిండాయి.

12. డా॥ సి. నారాయణరెడ్డి, హైదరాబాద్, 29-7-2002 నాటికి 71 వసంతాలు నిండాయి.

13. శ్రీ దుగ్గిరాల రామారావు, హైదరాబాద్, 16-4-2003 నాటికి 71 వసంతాలు నిండాయి.

14. ''దానచింతామణి'' శ్రీ డి.కె .ఆదికేశవులు, బెంగుళూరు, 21-9-2002 నాటికి 62 శరత్తులు నిండాయి.

15. శ్రీ బుల్లా సుబ్బారావు, ఐ.ఎ.ఎస్., బెంగుళూరు, 9-3-2003 నాటికి 58 వసంతాలు నిండాయి.

* * *

# అభినందన

కేంద్ర సాహిత్య అకడామీవారు తెలుగులో ఈ క్రింది వారికి 2002 సంవత్సరపు అవార్డులు ప్రకటించారు:-

ఆచార్య చేకూరి రామారావు (చేరా) - విమర్శ ('స్మృతి కిణాంకం')

శ్రీ దీవి సుబ్బారావు - అనువాదం (కన్నడం నుంచి తెలుగుకు) - ''మాటన్నది జ్యోతిర్లింగం''

శ్రీ చేరాగారినీ, శ్రీ సుబ్బారావుగారినీ 'చైతన్య కవిత' మరియు 'శ్రీరస' అభినందిస్తున్నాయి.

# 'ప్రగాఢ సంతాపం'

ఇటీవల స్వర్గస్థులయిన ఈ క్రింది కవులకు, పండితులకు, విమర్శకులకు, రచయితలకు, కళాకారులకు, రాజకీయవేత్తలకు, మిత్రులకు, బంధువులకు చైతన్య కవిత మరియు శ్రీరస తమ ప్రగాఢ సంతాపాన్ని తెలియజేస్తున్నాయి:

1. ప్రముఖ కన్నడ నటుడు, ''చోమన దుడి'' లో ప్రదర్శించిన అమోఘమైన నటనకు "All India Best Actor" బహుమతి పొందిన **శ్రీ ఎం. వి. వాసుదేవరావు**, 22-3-2002, బెంగుళూరు.

2. **శ్రీ బి.ఎన్. శాస్త్రి ( శ్రీ భిన్నూరి నరసింహ శాస్త్రి)**, ''మూసీ'' పత్రిక వ్యవస్థాపక సంపాదకులు, 4-4-2002, హైదరాబాద్.

3. **శ్రీ కొండపల్లి సీతారామయ్య**, ప్రముఖ విప్లవ కమ్యూనిస్టు పార్టీ నాయకుడు, 12-4-2002, విజయవాడ.

4. **శ్రీమతి కల్యాణ సుందరీ జగన్నాథ్**, ప్రసిద్ధ కథానికా రచయిత్రి, 19-7-2002, చెన్నై.

5. ప్రముఖ పండితుడు, కవి, వక్త, విద్యావేత్త, అష్టాదశపురాణాల అనువాదకుడు, ''ఆంధ్రవ్యాస'' బిరుదాంకితుడు అయిన **శ్రీ యేలూరిపాటి అనంత రామయ్య**, 23-7-2002 (వ్యాసపూర్ణిమ), హైదరాబాద్.

6. ప్రముఖ నాటక రచయిత **శ్రీ ఎన్. ఆర్. నంది**, 4-8-2002, హైదరాబాద్.

7. ప్రసిద్ధ మానసిక శాస్త్ర గ్రంథాల రచయిత **శ్రీ అట్లూరి వెంకటేశ్వరరావు**, 16-8-2002, హైదరాబాద్.

8. కథానికా రచయిత, నవలాకారుడు, హాస్యరచయిత, 'ప్రసన్న కథామూర్తి' అయిన **శ్రీ పోలాప్రగడ సత్యనారాయణమూర్తి**, 23-8-2002, హైదరాబాద్.

9. ప్రముఖ సంస్కృత పండితుడు, కవి, పరిశోధకుడు, విద్యావేత్త, తిరుపతిలోని సంస్కృత విద్యాపీఠం మాజీ వైస్‌ఛాన్సలర్ అయిన **ప్రొ॥ ఎస్. బి. రఘునాథాచార్య,** సెప్టెంబర్ 18, 2002, తిరుపతి.

10. ప్రజాకవి, 'పద్మవిభూషణ్' **డా॥ కాళోజీ నారాయణరావు,** 13-11-2002, హైదరాబాద్ (89 ఏండ్లు)

11. ప్రముఖ కవి, పండితుడు, విజయనగరం మహారాజా సంస్కృత కళాశాల మాజీ ప్రిన్స్‌పాల్, 'కవిసమ్రాట్' విశ్వనాథ **సత్యనారాయణగారి** ప్రియశిష్యుడు అయిన **శ్రీ పేరాల భరతశర్మ,** 13-12-2002, విజయవాడ.

12. ప్రసిద్ధ కవి, పండితుడు, వక్త, పరిశోధకుడు, ఉత్తమ ఉపాధ్యాయుడు, తంగిరాలవారి ప్రియశిష్యుడు, ''ఆ నలుగురికి'' కవితా స్రష్టికర్త, పెద్దాపురం మహారాణి కళాశాలలో తెలుగు రీడరు అయిన డా॥ **పంపన సూర్యనారాయణ, M.A., M.phil., Ph.D.,** జనవరి 2003.

13. తంగిరాలవారి బాల్యమిత్రుడు, స్నేహశీలి, తణుకు వాస్తవ్యుడు **శ్రీ గుబ్బల శ్రీరామమూర్తి,** జనవరి 2003.

14. తంగిరాలవారి బావమఱది **శ్రీ భళ్లమూడి రాధాకృష్ణమూర్తి** (బిహెచ్. ఆర్.కె. మూర్తి), పోలీసుశాఖ, రాజమండ్రి, 16-2-2003.

15. ప్రసిద్ధకవి, మానవతావాది శ్రీ బి.కె. గాండీవి, మదనపల్లె, ఏప్రిల్ 2003.

16. తంగిరాలవారి తోడల్లుడు శ్రీ లంక అనంత పద్మనాభ శాస్త్రి (ఎల్.ఎ.పి. శాస్త్రి), విద్యుచ్ఛక్తి శాఖ, నూజివీడు, 26-4-2003.

17. ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు, నిస్వార్థ ప్రజాసేవకుడు **శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య,** 29-4-2003, హైదరాబాద్.

## సంపాదకీయం - 3

# కాళోజీ జ్ఞాపకాలు

నేను ''నూనుగు మీసాల నూత్న యౌవనం''లో ఉన్నప్పుడు నాకు కాళోజీ కవిత్వాన్ని పరిచయం చేసిన మహానుభావుడు శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు. అది 1953వ సంవత్సరం. నేను భీమవరం కళాశాలలో ఇంటర్ మీడియేట్ చదువుతున్నాను. శ్రీ దిగుమర్తి సీతారామస్వామిగారు మా తెలుగు లెక్చరర్. శ్రీపాదవారు మా కాలేజికి వస్తే దిగుమర్తివారు ఆయన చేత ''ఆధునిక కవిత్వం'' అనే అంశాన్ని గురించి ఒక ఉపన్యాసం ఇప్పించారు. విశ్వనాథ, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, పఠాభి, కాళోజీ మొదలైన కవుల కవితల్ని ఉదాహరిస్తూ, వారిలోని గొప్పతనాన్నీ లోపాలనూ కూడా చెపుతూ ఎంతో అద్భుతంగా ప్రసంగించారు శ్రీపాదవారు. అప్పుడు ఆయన ఉదహరించిన కవిత్వ పంక్తులన్నీ నా మనస్సులో నాటుకు పోయాయి. ''ఏరాజు పంచెనో యిచట శౌర్యపు పాయసంబుల నాగుల చవితినాళ్ళ! - అన్నారు విశ్వనాథ. కాని నాగుల చవితికి పాయసం పంచిపెడతారా ఎక్కడైనా? చలిమిడి చిమ్మిలి పంచిపెడతారు కాని. విశ్వనాథ కవికాడు, నవలాకారుడు మాత్రమే. ఆయన ఏకవీర గొప్ప నవల'' - అని అందులోంచి కొన్ని పంక్తులు ఉదాహరించారు. శ్రీశ్రీని గురించి చెపుతూ ''మరో ప్రపంచం, మరో ప్రపంచం, మరో ప్రపంచం, పిలిచింది! పదండి ముందుకు, పదండి త్రోసుకు, పోదాం పోదాం పైపైకి'' - ఏమిటిది? నిద్దట్లోంచి లేచి కేకలు పెడతావేమిటి? ఇది కవిత్వంకాదు. ''దారిప్రక్క, చెట్టుక్రింద, ఆరిన కుంపటి విధాన, కూర్చున్నది ముసిల్దొకతె, మూలుగుతూ, ముసురుతున్న ఈగలతో వేగలేక'' - అదీ! అలా రా దారికి! ఇదీ కవిత్వం. ''మద్రాసు నగరమా! నీమీద బ్లాబాకు సిరాలా పడింది రాత్రి'' అన్న పఠాభి పంక్తుల్లోనూ, ''రాయి విసిరినా రాకెట్టు విసిరినా, కిట్టనివానిని కొట్టుటకే కద!'' అన్న కాళోజీ పంక్తుల్లోనూ కవిత్వం ఉందని చెప్పారు. తరువాత నేను కాళోజీగారి ''నాగొడవ'' చదివాను. పెద్దవాడినయ్యాక దగ్గరనుండి ఆయన వ్యక్తిత్వాన్ని పరిశీలించాను. నేను పరిశీలించిన చాలామంది కవుల్లో వారు వ్రాసే కవిత్వానికీ, వారు ప్రవర్తించే వ్యక్తిత్వానికీ ఏమీ సంబంధం లేకపోవడాన్ని గమనించి బాధపడ్డాను. కాని ఒక్క కాళోజీలో మాత్రమే కవిత్వమూ, వ్యక్తిత్వమూ రెండూ ఒక్కటిగా ఉండటాన్ని చూచి ఆశ్చర్యపోయాను. ఆయన మీద గౌరవాన్ని పెంచుకున్నాను. (మా పెద్దబ్బాయి ముద్దుపేరు ''కాళిదాసు''. నేను వాడిని ''కాళోజీ'' అని పిలిచేవాడిని. ఇప్పుడు ''మా కాళోజీ'' న్యూజిలాండ్‌లో ఉన్నాడు).

ఒకసారి ''చైతన్య కవిత'' ముఖపత్రంగా కాళోజీగారి ఫోటో వేయాలని నేనూ నా మిత్రుడు డా॥ ఆర్వీయస్. సుందరమూ కలిసి హైదరాబాద్‌లో కాళోజీగారున్న ఇంటికి వెళ్ళాము. ఒక చిన్న అరుగుమీద కూర్చుని ఒక ప్లేటులో జంతికలు (చక్కిలాలు) పెట్టుకొని

తింటున్నారు. మమ్మల్ని చూడగానే ''రండిరా అబ్బాయి! రండి'' అని ఆప్యాయంగా దగ్గరకు పిలిచి, తాను కూర్చున్న చాపమీదనే మమ్మల్నీ కూర్చోబెట్టుకొని, తాను తింటున్న జంతికల్ని మాకు కూడా పెట్టారు. వర్తమాన రాజకీయాల్ని గురించి కొన్ని మినీ కవితలు ఆశువుగా చెప్పారు. ''మీ ఫోటో కావాలి. స్టూడియోకి వెళ్ళి తీసుకుంటే బాగా వస్తుంది'' అని భయపడుతూ ఆయన్ని అడిగాము. అంత పెద్ద కవిని ఫోటో కోసం స్టూడియోకి రమ్మని పిలవడం మర్యాద కాదుకదా! కాని ఆయన ఏమి అనుకోలేదు. సంతోషంగా సరదాగా ''అలాగే! తప్పకుండా వెడదాం'' అని మాతో ఒక చిన్న స్టూడియోకి వచ్చి ఫోటో తీయించుకున్నారు. కాళోజీ అంతటి సింపిల్ మనిషి. గర్వం ఏ కోశానా ఉండేది కాదు. ఆ ఫోటో ఎంతో అందంగా వచ్చింది. అప్పుడు ఆయన మధ్యవయస్సులో మంచి ఠీవిగాఉన్నారు. మీసాలు గంభీరంగా ఉన్నాయి. చైతన్యకవిత ముఖచిత్రంగా వచ్చిన ఆ ఫోటోను చూచి జైల్లో ఉన్న కవిమిత్రులు శ్రీ పి. వరవరరావుగారు నాకు లేఖ వ్రాస్తూ ''చైతన్య కవిత మీది ఫోటోను చూచి కాళోజీని చూచినంతగా ఆనందించాను'' అని అన్నారు.

ఒకసారి హైదరాబాద్ ఆంధ్ర సారస్వత పరిషత్తులో ఒక సాహిత్య సభ జరిగింది. ఆ సభకు శేషేంద్రగారు కాళోజీగారు వచ్చారు. సభ అయిపోయింది. ఇక ఇంటికి వెళ్ళాలి. కాళోజీని చూచి శేషేంద్ర ''నా కారులో మిమ్మల్ని మీయింటి దగ్గర దింపుతాను రండి!'' అన్నారు. కాళోజీ ముందు సీటులో శేషేంద్ర ప్రక్కన కూర్చున్నారు. నేనూ మిత్రుడు సుందరమూ వెనుక సీట్లో కూర్చున్నాము. కొంతదూరం వెళ్లాక ఒక వీధిలో కాళోజీగారి యింటికి ఎటువైపు తిరగాలో తెలియక, శేషేంద్ర ''ఎటువైపు?'' అని కాళోజీని అడిగారు. ఆయన వెంటనే ''లెఫ్ట్! మనదెప్పుడూ లెఫ్టే కదా!'' అన్నారు. అందరూ నవ్వుకున్నాం.

1985లో ఏవో పరీక్షల పనిమీద నేను ఆంధ్ర విశ్వవిద్యాలయానికి వెళ్ళాను. అప్పుడు ప్రొ॥ యస్వీ. జోగారావుగారు తెలుగు శాఖాధిపతి. ఆయనకు కాళోజీ అంటే వల్లమాలిన ప్రేమ, భక్తి. ఏదో పనిమీద కాళోజీ విశాఖపట్టణం వచ్చారు. ఒక రోజు ఉదయం విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో కాళోజీ ఉపన్యాసం కావ్యపఠనం పెట్టారు. ఆ రోజు సాయంత్రం తన యింటికి రమ్మని జోగారావుగారు కాళోజీని ప్రాధేయపడ్డారు. ''అలాగే! తప్పకుండా వస్తాను!'' అన్నారు. ఆ సాయంత్రం నేనూ, సుందరం ఇతర మిత్రులూ ముందుగానే జోగారావుగారి యింటికెళ్ళి మేడపైన ఆయనతో కలిసి కూర్చొని, కాళోజీ రాకకోసం ఎదురు చూడసాగాం. ఒక అరగంట పోయాక కాళోజీ వచ్చి మేడమెట్లు ఎక్కి-డాబామీదికి వచ్చారు. జోగారావుగారు ఎదురుగా వెళ్ళి, పరమానందంతో ఆయనకు పాదాభివందనం చేస్తూ ''అన్నా! కాళన్నా! నువ్వు మహాత్ముడవు!'' అన్నారు. వెంటనే కాళోజీ: ''జేబులో పిస్తోలు లేదుకదా?'' అన్నారు. అందరం కలిసి పగలబడి నవ్వుకున్నాం.

తనపైన శిష్యులకు మిత్రులకు ఉన్న అభిమానాన్ని తలచుకొని ఒక్కొక్కప్పుడు కాళోజీ భోరున ఏడ్చేవారు. కాళోజీకి ఒకసారి జబ్బు చేసింది. ఆసుపత్రిలో చేర్పించారు. ఒక క్రైస్తవ శిష్యుడు ఆసుపత్రికి వచ్చి గురువుగారిని చూశాడు. ''నాన్నగారూ! మీ ఆరోగ్య, కోసం నేను ఇక్కడ క్రీస్తును ప్రార్థిస్తాను. అనుమతి ఇవ్వండి'' అన్నాడు. ''ఓ! దానికేమిరా? అలాగే చేసుకో!'' అన్నారు కాళోజీ. ఆ విషయాన్ని ఆంధ్ర విశ్వవిద్యాలయంలో చెపుతూ కాళోజీ వలవలా ఏడ్చారు.

నేను ఒక కాలంలో శేషేంద్రగారిని పొగడుతూ, శ్రీశ్రీగారిని తక్కువ చేసి మాట్లాడేవాడిని. నాలాగే మరికొందరు విమర్శకులు కూడా ప్రవర్తించేవారు. ఈ విషయం కాళోజీగారికి తెలిసింది. ఒకసారిహైదరాబాదులో కలిసినప్పుడు నాతో ఇలా అన్నారు: ''ఒరేయ్! శేషేంద్ర గొప్పకవే. వాడికి తలంటి నీళ్ళు పోయండి. సంతోషం. కాని ఇంకొకడి మీద ఒంటేలుకు పోస్తారెందుకురా?'' ఆ మాటతో నేను చాలా సిగ్గుపడిపోయి, నా తప్పు నేను తెలుసుకోగలిగాను.

కాళోజీ నారాయణరావుగారి అన్నగారు కాళోజీ రామేశ్వరరావుగారు. ఆయన ఉర్దూలో గొప్పకవి, పండితుడు. నారాయణరావుగారి కన్నా 6 సంవత్సరాలు పెద్ద. తమ్ముడంటే విపరీతమైన ప్రేమ. ఉమ్మడి కుటుంబం. అన్నదమ్ముల అనుబంధం చాలగొప్పది. నారాయణరావుగారు ఎప్పుడూ ఊళ్ళవెంబడి తిరుగుతూ ఉండేవాడు. తన సంసారాన్నీ తమ్ముని సంసారాన్నీ రామేశ్వరరావుగారే జాగ్రత్తగా పోషించేవారు. కాళోజీగారు తన ఆత్మకథను వ్రాసుకొంటూ ఒక గొప్ప వాక్యాన్ని వ్రాశారు. ''నా కన్నా మా అన్న ఆరేళ్ళు పెద్ద. నన్ను చిన్నప్పుడు ఎత్తుకొని పెంచాడు'' అని చిన్ననాటి అనుభూతులు చెపుతూ - ''చిన్నప్పుడు మా అన్న చంకెక్కాను. ఇంతవరకూ దిగలేదు!'' అన్నారు. ప్రముఖకవి కాటూరి వెంకటేశ్వరరావుగారి అన్నగారు కూడా రామేశ్వరరావుగారి వంటి అన్నగారే. కాటూరివారు ''గుడిగంటలు - పౌలస్త్యహృదయము'' అనే తన కావ్యాన్ని అన్నగారికి అంకితం చేస్తూ ఆయన తనను ఎంత వాత్సల్యంతో పెంచారో అద్భుతమైన పద్యాలలో చిత్రించారు.

కాళోజీ తన మాట వింటారనే ఉద్దేశంతో ఒక పెద్ద మనిషి ఆయన్ను కరీంనగర్‌కు తీసికొని వెళ్ళాడు. తన యింట్లో చక్కని భోజనం పెట్టాడు. ఆ ఆసామి ఉద్దేశాన్ని గ్రహించిన కాళోజీ ఇలా అన్నారు: ''ఎనభైయేళ్ళు తిండి పెట్టిన నా అన్నమాటే వినలేదు నేను. ఒక్కపూట రొట్టెపెట్టి నీ మాట వినమంటే ఎలా వింటాననుకున్నావ్?'' రామేశ్వరరావు - నారాయణరావు అనే ఈ అపూర్వ సహోదరులు 6 సంవత్సరాల తేడాతో పుట్టడమే కాదు, 6 సంవత్సరాల తేడాతోనే చనిపోయారు! కాళోజీ రామేశ్వరరావుగారు 1908లో జన్మించి, నవంబరు 11, 1996లో మరణించారు. ప్రజాకవి కాళోజీ నారాయణరావుగారు సెప్టెంబరు 9, 1914లో జన్మించి, నవంబరు 13, 2002 లో స్వర్గస్థులయ్యారు.

భారత మాజీ ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావుగారు కాళోజీగారు మంచి మిత్రులు. ఇద్దరూ కలిసి స్వాతంత్రోద్యమంలో పాల్గొన్నారు. జైలుమేట్స్ కూడా కాబోలు. కాళోజీ విశిష్ట వ్యక్తిత్వాన్ని గురించి శ్రీ పి.వి. ఇలా అన్నారు: ''రాజకీయాల్లో ఉన్నప్పుడు నేనెవరికీ భయపడలేదు. కానీ ఒక్క కాళోజీ అంటే మాత్రమే ఆ భావం ఉండేది. గతంలో నేను ప్రధానిగా ఉన్న సమయంలో వరంగల్‌లో ఒక సభలో పాల్గొనడానికి వెళ్ళినప్పుడు కాళోజీ ఒక పత్రికలో వచ్చిన వార్తను పట్టుకొని నా దగ్గరకు వచ్చారు. అప్పుడు భయపడాల్సి వచ్చింది''.

2002వ సంవత్సరంలో వచ్చిన విజయదశమి పండుగనాడు కాళోజీ వరంగల్‌లో తన యింట్లో కాలుజారి పడ్డారు. తుంటి ఎముక విరిగింది. హైదరాబాద్‌లో ''నిమ్స్''లో చేర్పించారు. కాలు బాగుపడింది. కాని ఉన్న ఒక్క ఊపిరితిత్తికీ నిమోనియా సోకింది. ఎంతవైద్యం చేసినా ఆ వ్యాధి తగ్గలేదు. చాలా బాధపడుతున్నారు. వరంగల్లు నుండి మిత్రులు శిష్యులు ఆయన్ని చూడటానికివెళ్ళారు. అప్పుడు ఆయన వారితో ఇలా అన్నారు: ''ఒరేయ్! బ్రతకడానికి చాలా కష్టపడాలి. కాని చచ్చిపోడానికి కూడా ఇంత కష్టపడాలిరా!''. ఈ వాక్యంలో దేశంలో సామాన్య మానవుని జీవనసమస్య, ఎవరూ తప్పించుకోలేని మృత్యురహస్యం (మరణబాధ), వేదాంతం చమత్కారం దాగి ఉన్నాయి.

కాళోజీ 89 సంవత్సరాలు బ్రతికిన పూర్ణపురుషుడు. తన కళ్ళను దానం చేశాడు. అంతేకాదు అన్నగారి అడుగుజాడల్లోనే తన శవాన్ని కూడా కాకతీయ మెడికల్‌కాలేజికి దానం చేశాడు. ఈ దానాలు చేయడానికి చాలా ధైర్యం కావాలి. కుటుంబసభ్యులు సహకరించాలి. శ్రీశ్రీగారు కూడా తన శవాన్ని ఆంధ్ర మెడికల్ కాలేజికి ఇవ్వాలనుకున్నారు. కాని భార్య పిల్లలు అంగీకరించక పోవడంవల్ల ఆ కోరిక నెరవేరలేదు.

కాళోజీ అభిమానులు, మిత్రులు, శిష్యులు అంతా కలిసి ఆయన బ్రతికి ఉండగానే ''కాళోజీ ఫౌండేషన్'' స్థాపించారు. ఆయన కవితలన్నీ చేర్చి ఒక సమగ్ర కావ్యంగా ''నాగొడవ'' పేరుతోనే ముద్రించారు. కాళోజీ చనిపోయిన తరువాత ఈ ఫౌండేషన్ వారు ''కాళోజీ యాదిలో'' అనే గ్రంథాన్ని ప్రచురించారు. 22-12-2002 నాడు ఆ గ్రంథావిష్కరణ సభ హైదరాబాద్‌లో జరిగింది. శ్రీ పి.వి. నరసింహరావుగారే దానిని ఆవిష్కరించారు. ఆ సందర్భంలో మాట్లాడుతూ శ్రీ పి.వి.గారు కాళోజీ అనుభవాలన్నింటినీ సేకరించి సంకలనంగా వేయమని ఫౌండేషన్ వారికి సలహా ఇచ్చారు: ''కాళోజీ లేరనేది అవాస్తవం. ఆయన నిత్యం ప్రజల చర్చల్లో, స్మృతిపథంలో, జ్ఞాపకాల ద్వారా దర్శనమిస్తునే ఉంటారు. సమగ్రమైన వ్యక్తిత్వం ఆయన సొంతం. ఆయన భావాలు కూడా ఎప్పటికప్పుడు మారుతూ ఉండేవి. చమత్కారంగా, ముక్కుసూటిగా మాట్లాడే గుణం అందరికీ అలవడదు. అలాంటి అపురూపమైన వ్యక్తిత్వాలు అరుదు. ఆయన్ను సంపూర్ణంగా ఆవిష్కరించేందుకు దోహదపడే సంకలనాలు తీసుకురావాలి. ఆయా సమావేశాల్లో కాళోజీ చేసిన ప్రసంగాలు, శాసనమండలి

సమావేశాల్లో చేసిన ప్రసంగాలు, ఇష్టాగోష్ఠిగా చెప్పిన విషయాలు, ఈ సంకలనాల్లో చేరిస్తే బాగుంటుంది''

లోక్‌నాయక్ శ్రీ జయప్రకాష్ నారాయణ్‌గారు చనిపోయినప్పుడు కాళోజీ ఒక అద్భుతమైన మినీకవితను ఆశువుగా చెప్పారు. ఇంత గొప్ప మినీ కవితను నా జీవితంలో నేను వినలేదు; కనలేదు;

**చావు నీది**
**పుటక నీది**
**బ్రతుకంతా దేశానిది!**

ఈ మినీకవిత జె.పి.గారికే కాదు కాళోజీగారికి కూడా వర్తిస్తుందేమో! ప్రొ। జయధీర్। తిరుమలరావుగారు చెప్పినట్టు ''దేశానిది'' అనే పదానికి బదులు ''ప్రజలది'' అంటే సరిగ్గా సరిపోతుంది!!

బెంగుళూరు -తంగిరాల
స్వభాను ఉగాది, 2-4-2003

* * *

# కాళోజీ కవితలు

## 1. నా గొడవ

నా గొడవనునది, కాళోజి అనునది
కాలమునకె కాదు మహాకాలునకును ఏనాడును
'జీ' అనని 'కలేజా' తో కాళోజీ అనునది
'నఖరా' లు లేనట్టిది, 'నాజుకు' ది కానట్టిది
నానాభావన నది నీనా భావన లేనిది
ఎద చించుక పారునది, ఎదలందున చేరునది
కనుకొలకుల చిలుకునది, కనురెప్పల తడుపునది
ఎడద ఊరి పారునది ఎడద చేరి ఊరునది
నా గొడవనునది కాళోజీ అనునది

అన్యాయాన్నెదిరిస్తే
నా గొడవకు సంతృప్తి

అన్యాయం అంతరిస్తే
నా గొడవకు ముక్తి ప్రాప్తి
అన్యాయన్నెదిరించినోడు
నాకు ఆరాధ్యుడు ....

## 2. స్వగతం

అతిథివోలె వుండి వుండి
అవని విడిచి వెళ్ళుతాను.
పల్లె పట్టణంబు లనక
పల్లేరై తిరిగినాను.
మురికిపేట నడుమవున్న
ఇరుకులలో యిరికినాను.
కూటిపేద తన కబళము
నోటికీయ గుడిచినాను.
పూల వాసనలు నిండిన
పాలరాతి మేడలలో
ఆయాసము కలిగించెడి
పాయసాలు మెక్కినాను.
వాయువుతో పోటీపడు
వాహనాలు ఎక్కినాను.
కంటకాల మధ్య నేను
కాలినడక నడిచినాను.
కాలు బైట పెట్టకుండ
కాలమెంతో గడిపినాను.
గుట్టలపై యెక్కి యెక్కి
గట్టుల దిగజారినాను.
లోయలలో దూకిదూకి
లోతులెన్నో చూచినాను.
నే ప్రాకని ఎత్తు లేదు

నే జారని లోతు లేదు.
మూలజేరి మునులవోలె
మూగనోము బట్టినాను.
ఈగవోలె దోమవోలె
వాగుచు తిరుగాడినాను.
అతిథివోలె వుండి వుండి
అవని విడిచి వెళ్ళుతాను!

*(కాళోజీ ఫౌండేషన్ వరంగల్లు/హైదరాబాదు వారు 2001 సెప్టెంబరు నెలలో ప్రచురించిన ''నా గొడవ - కాళోజీ కవితల సంపూర్ణ సంకలనం'' నుండి)*

* * *

## కాళన్నా ... కాళన్నా ...!

- టి. జితేందర్‌రావు

కాళన్నా! కాళన్నా!
కానరాని చోటికి కదిలెందుకు పోతివే
యిందర్నీ వదిలెందుకు పోతివే
కాళన్నా... కాళన్నా...!

చిత్తం చిత్తం అంటూ చేతులు నలుపుకుంటే
బాంచన్ బాంచన్ అంటూ బతిమిలాడుతుంటే
నీళ్ళు నములుకుంటూ తలల్ దించుకుంటే
చీదరించుకుంటివి – చెవులు పిండుతుంటివి
కాళన్నా... కాళన్నా...!

బ్రతుకంతా పోరుతప్ప
బ్రతుకు తెరువు తెలువదాయె
ముక్కుసూటి దారితప్ప
మాయమర్మ మెరుగవాయె

అడ్డదారి తొక్కెటోడ్ని, నడ్డి విరగగొడితివాయె
కాళన్నా... కాళన్నా...!

నేను కాదు, మేము కాదు
మనం అనాలంటివి
మనం మనం కొట్టుకుంటె మండి మండి పడితివి
ఎక్కి ఎక్కి ఏడ్సితివి
కాళన్నా... కాళన్నా...!

భజన చేసేటోళ్ళుంటే
బాక ఊదెటోళ్ళుంటే
తోక ముడిచెటోళ్ళుంటే
కాక పట్టెటోళ్ళుంటే
రోత రోత అంటివి
మారకుంటే వాతపెడుతుంటివి
కాళన్నా... కాళన్నా...!

నీతి తప్పిపోతే
నియ్యత్ లేకపోతే
రూలు విడిచిపెట్టి
కఱ్ఱ చేతపడితే
గుడ్లురిమి చూస్తివి - గువ్వ పగల గొడితివి
కాళన్నా... కాళన్నా...!

అన్నమెంత ముఖ్యమో
హక్కులంత ముఖ్యమంటివి
ఊపిరెంత ముఖ్యమో
ఉద్యమమంత ముఖ్యమంటివి
కాళన్నా... కాళన్నా...!

* * *

# ప్రజాకవి కాళోజీ

- వి.ఆర్. విద్యార్థి

కాళోజీ ఎవరని అడుగుతున్నారా?
అతడు మా నేతాజీ -
మా ప్రియతమ నాయకుడండీ!

అతడు మా చరిత్ర
మొద్దు నిద్దరలో పడి ఉన్న మా జాతిని
నిద్రలేపిన వైతాళికుడు
మా స్వాతంత్ర్యోద్యమ సారథి
నాటి కోటి రత్నాల వీణనుండి
నేటి కోట్ల రత్నాల వీణ పలికే
ప్రజా కవిత.
అతడి కలం
మా సమరపథంలో నడిచిన
ఏకైక శతఘ్ని!

అతడు మా విప్లవ కెరటాల హోరు
మా మండే గుండెల సెగ
ఇవ్వాళ మేమింతటి చైతన్యవంతులమంటే
కాళోజీ అనే ఒక మహాశక్తి
మా ప్రతి ఒక్కరినీ ఆవహించడం వల్లే.

అతడు
మా ఊపిరి
మా బాస
మా ధైర్యం
మా శౌర్యం
మా దుర్గం

మా మార్గం
మా గీతం
మా వేదం

అంతేగాదు
ఒక్క మాకేగాదు
మీ అందరికీ ఆత్మబంధువే
మీ అందరి కన్నీళ్ళూ అతడి కన్నీళ్ళే

అతడు ప్రజల మనిషి
ప్రజాకవి -
అంటే ప్రపంచకవి
నిప్పులు కురిసేవాడైనా
వెన్నెల కురిపింపజేసే వాడైనా
సూర్యుడొక్కడే మన భూగోళానికి
కంటకాలు గుచ్చేదైనా
కంటతడి పెట్టించేదైనా
''నా గొడవ'' ఒక్కటే మన సాహిత్యానికి

అందుకే
ఏనాడూ ఎవడికీ తలవంచక
ప్రజా హృదయవేదికపై స్థిరపడ్డ
కాలం నాలికపై నిలబడ్డ
కాళోజీకి మరణమెక్కడిది?
అన్యాయాన్నెదిరించే వాడ్ని ఆరాధిస్తూ
కలకాలం జనహృదయాశ్రమాల్లో
నివసిస్తూనే ఉంటాడు
ప్రశ్నిస్తూనే ఉంటాడు.

* * *

# హక్కుల ఝుండా

- పొట్లపల్లి శ్రీనివాసరావు

రోదనలో వేదనలో
రగులుకునే బోధనలో
మేధావుల శోధనలో

కనిపించే కాళన్నా - వినిపించేవ్ వెతలెన్నో
ఈ కాలపు వేమన్నా - ప్రజాకవి కాళన్నా!

మనిషి తనువు చిత్రమై
శాంతి వనపు ప్రాణమై
పౌర హక్కుల కేతనమై

నడిపించిన కాళన్నా - వినిపించేవ్ వెతలెన్నో
ఈ కాలపు వేమన్నా - ప్రజాకవి కాళన్నా!

నిరసన వేదికపై
ప్రశ్నించే స్వర భాస్వరం
అన్యాయపు పాలనపై
ధ్వజమెత్తే దీక్షా ధిక్కారం

ఊరూరా అగ్ని శిఖయై - వినిపించేవ్ వెతలెన్నో
ఈ కాలపు వేమన్నా - ప్రజాకవి కాళన్నా!

జనం తరపు వకాల్తా
దినం దినం తండ్లాట
తనువంతా మన గొడవ
ఉద్యమాల నా గొడవ

చిందించిన కన్నీళ్లై - వినిపించేవ్ వెతలెన్నో
ఈ కాలపు వేమన్నా - ప్రజాకవి కాళన్నా!

మన పాటల మన మాటల
పదే పదిగా మాట్లాడాలని
మనమంతా మనుషులమై
కల కాలం బ్రతకాలని

నినదిస్తూ కాళన్నా - వినిపించేవ్ వెతలెన్నో
ఈ కాలపు వేమన్నా - ప్రజాకవి కాళన్నా!

పలుకు బడుల తెలుగంతా
పదిలంగా ఉండాలని
వాడి వాడి వాడుకయే
తెలుగు వాడి వేడియని

కన్పించని కాళన్నా - వినిపించేవ్ వెతలెన్నో
ఈ కాలపు వేమన్నా - ప్రజాకవి కాళన్నా!

* * *

# 'ఆంధ్రవ్యాస' బ్రహ్మశ్రీ యేలూరిపాటి అనంతరామయ్యగారి అంతరంగం

'ఆంధ్రవ్యాస', 'కవికుల రత్నదీప', 'వైదికాగమాలంకార', 'భాషాప్రవీణ' బ్రహ్మశ్రీ యేలూరిపాటి అనంతరామయ్యగారు పశ్చిమ గోదావరి జిల్లా, కొవ్వూరు తాలుకా 'తోగుమ్మి' గ్రామంలో, సుబ్బయ్య, లక్ష్మీదేవమ్మ దంపతులకు 1935లో జన్మించారు. స్వగ్రామంలో ప్రాథమిక విద్యాభ్యాసం పిమ్మట కొవ్వూరు సంస్కృత పాఠశాలలో భాషాప్రవీణద్వారా సంస్కృతంలోనూ, తెలుగులోనూ పట్ట భద్రులయ్యారు. తెలుగుపండితునిగా ఉద్యోగం ప్రారంభించి, బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంనుంచి, సంస్కృతంలో ఎం. ఎ. పట్టాపొంది, రాజమండ్రి గవర్నమెంటు ట్రయినింగ్ కాలేజీలోనుంచి బి.ఇడి. పట్టాను కూడా సాధించారు. 11 సంవత్సరాలు ఉన్నత పాఠశాల తెలుగు పండితులుగాను, మూడు సంవత్సరాలు ఏలూరు కళాశాల సంస్కృత ఉపన్యాసకులుగాను, ఇరవైరెండు సంవత్సరాలు గుంటూరు సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్‌గాను పనిచేసి, ఉత్తమ

ఉపాధ్యాయునిగా పేరెన్నిక గన్నారు. పదవీ విరమణ అనంతరం శ్రీ అనంతరామయ్యగారు హైదారాబాద్ నగరంలో స్థిరపడి పలు సాహిత్య, సాంస్కృతిక కార్యక్రమాలకు ఆలంబనగా ఉంటూవచ్చారు. 'వార్త' 'ఆంధ్రభూమి'వంటి ప్రముఖ దినపత్రికలలో ఇప్పటికీ వస్తున్న వారి మహాభారతవ్యాఖ్యానాది సాహిత్యవ్యాసాలు పాఠకులను అలరిస్తున్నాయి. సాహిత్య ప్రక్రియలన్నిటిలోను అనేక గ్రంథాలు వెలువరించారు. ఇటీవలనే 'వివేక నందినీ వ్యాఖ్య' పేరిట ఎంతో హృద్యంగా వీరు వ్యాఖ్యానించిన సుమతిశతకాన్ని పావని సేవాసమితివారు ప్రచురించారు. హైదరాబాద్ దూరదర్శన్‌లో వీరు అతి సమర్థవంతంగా నిర్వహించిన 'పద్యాలతోరణం' సాహితీ ప్రియులను ఎంతో ఆకట్టుకుంది. వీరు 'ముముక్షువు', 'శ్రీశైలప్రభ' మాస పత్రికల సంపాదకవర్గంలో పనిచేసారు.

ఇటీవలనే ఏలూరు గుప్త ఫౌండేషన్ వారు సాహితీ సేవలో విశిష్ట సేవ చేసిన వ్యక్తులకు ఇచ్చే ప్రతిష్ఠాత్మక పురస్కారాన్ని శ్రీయేలూరిపాటి అనంతరామయ్య గారికిచ్చి రూ॥ 50 వేల నగదు, సన్మాన పత్రం, మెమెంటోతో సహా సత్కారించారు.

'సూర్యశక్తి' మాసపత్రిక కోసం శ్రీ అనంతరామయ్యగారితో ఇటీవల (వారి మరణానికి ముందు) ముచ్చటించడం జరిగింది.

**ప్రశ్న :** వ్యాస భగవానులు రచించిన అష్టాదశపురాణాలను తెలుగులోనికి అనువదించి 'ఆంధ్ర వ్యాసులు'గా ప్రసిద్ధి పొందారు గదా! అయితే వీటిని అనువదించాలన్న మీ సంకల్పానికి ప్రేరణ ఏమిటి?

**జవాబు :** వ్యాసులవారు రచించిన 18 పురాణాలు సంస్కృత వాఙ్మయంలో ఉన్నాయి. అవి వేదవేదాంగాది సర్వశాస్త్ర ప్రబోధకాలు. వాటిలో ఉన్నతమైన విలువలు ఎన్నో ఉన్నాయి. పురాణాలు పుక్కిటి పురాణాలనే అపవాదును తొలగించాలని, తెలుగు వాడుక భాషలో ఈ పురాణాలను అందిస్తే పురాణాల మూలాలగురించి అందరూ సులువుగా అవగాహన చేసుకుని, వాటిలోని సృజనాత్మక శక్తిని, భారతీయ సంస్కార జీవన సరళిని అర్థం చేసుకుని ఆచరించి మానవాళికి మహోపకృతిని చేయగలుగుతారు. అందుకే అష్టాదశ పురాణాల అనువాదం చేపట్టడం జరిగింది.

**ప్రశ్న :** ఇంతటి వైదుష్యం సముపార్జించడంలో తమకు ఎందరో మహానుభావులు గురువులుగా ఉండి ఉంటారు. వారి గురించి కొంచెం చెప్పండి?

**జవాబు :** పొడగట్లపల్లిలో చిలుకూరి కామశాస్త్రిగారి వద్ద సంస్కృత కావ్యాలు అధ్యయనం చేసాను. కళాప్రపూర్ణ కేశిరాజు వేంకట నృసింహ అప్పారావుగారు ప్రిన్సిపాల్‌గా

ఉన్న కొవ్వూరు సంస్కృత పాఠశాలలో వేదుల రామశాస్త్రిగారి వద్ద తెలుగు వ్యాకరణం, చిలుకూరి రామమూర్తి శాస్త్రిగారి వద్ద సంస్కృత వ్యాకరణం, ధూళిపాళ రామచంద్రశాస్త్రిగారి వద్ద సంస్కృత కావ్యనాటకాలు, కందుకూరి వీరబసవరాజు, ప్రయాగవెంకటరామశాస్త్రి గార్ల శిష్యరికంలో తెలుగు సాహిత్యం అధ్యయనం చేసాను. పుంభావ సరస్వతులు ఇటువంటి ఆచార్య శ్రేష్ఠులు గురువులుగా లభించడం నా పురాకృత పుణ్యం.

ప్రశ్న : ఉభయ భాషాప్రవీణులుగా ఉంటూ, అనేక ఉద్దండ పండితుల సాహచర్యంలో అనుభవం గడించిన మిమ్ము అలంకరించినగౌరవ పదవుల గురించి తెల్సుకోవాలని ఉంది?

జవాబు : చాలా ఉన్నాయనుకోండి. ముఖ్యంగా 12 సంవత్సరాలు నాగార్జున విశ్వవిద్యాలయపు డీన్ ఆఫ్ ఓరియంటల్ లాంగ్వేజెస్ గాను, సెనేట్ మెంబరుగాను, ఎకడమిక్ సెనెట్ మెంబరుగాను ఉన్నాను. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ మెంబరుగా ఆరు సంవత్సరాలపాటు సేవలనందించాను. అనేక సాహితీ సంస్థలకు, దేవస్థానాలకు గౌరవసభ్యుడుగా ఉంటున్నాను.

ప్రశ్న : మీరు అనేక గ్రంథాలను రచించి వెలువరించారు. మీ రచనా వ్యాసంగం గురించిన వివరాలు తెలుపండి?

జవాబు : దాదాపు 50 గ్రంథాలు రచించాను. 20 దాకా అచ్చయినాయి. కొన్ని ద్వితీయ ముద్రణలు కూడా వచ్చాయి. అష్టాదశ పురాణాలు తెనిగించడమే గాక, పద్యకావ్యాలు, గేయకావ్యాలు, ప్రసంగాలు, నాటికలు, కథలు, వ్యాసాలు ఇత్యాది ప్రక్రియలన్నిటిలోను రచనలు చేసాను. 'దామోదరీయం', 'గౌతమీ శాతకర్ణి', 'క్షమాభిక్ష' వంటి పద్యకావ్యాలు, 'గుంటూరు పాటల' వంటి జానపదగేయాలు, 'పంచవటి' వంటి అనువాద గేయకావ్యాలు, 'ఆకాశవాణి సూక్తి ముక్తావళి' వంటి సూక్ష్మాంశాలు, 'అభినవ భగీరథుడు' వంటి కథలు, కథానికలు, 'జంఘాల శాస్త్రి క్ష్మాలోక యాత్ర' వంటి హాస్య రచనలు (ఆంధ్ర పత్రికలో ధారావాహికంగా వచ్చి 1966లో పుస్తకంగా వెలుపడి, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో పాఠ్య పుస్తకంగా నిర్ణయింపబడింది) ఇలా చాలా ఉన్నాయి.

ప్రశ్న : మీ ప్రతిభకు గుర్తింపుగా లభించిన పురస్కారలేమైనా ఉన్నాయా?

జవాబు : ఓరియంటల్ కాలేజి ఉత్తమ ఉపాధ్యాయుని అవార్డు అందుకున్నాను.

ప్రశ్న : తమరు ప్రత్యక్ష వ్యాఖ్యాతలుగా కూడా ప్రసిద్ధులనుకుంటాను?

**జవాబు :** అవును, దూరదర్శన్, ఆకాశవాణి ద్వారా భద్రాచల సీతారామ కళ్యాణంపై గత 30 సంవత్సరాలుగా వ్యాఖ్యాతగా వ్యవహరిస్తున్నాను.

ప్రశ్న : దేవస్థాన కళ్యాణోత్సవాలకు, బ్రహ్మోత్సవాలకు వ్యాఖ్యానం అవసరమంటారా?

**జవాబు :** మంచి ప్రశ్న వేసారు. వేదఘోష మధ్య, భక్తజన పారవశ్యాల మధ్య కళ్యాణోత్సవాలు, మహోత్కృష్ట శిష్టాచార విశేషాలను సంధానంచేసి సుదూరాలనుంచి విచ్చేసిన జనవాహినికి, భక్తకోటికి, తమతమ గృహాలలో జ్ఞానార్థులైన మానవాళి మనోగతాన్ని పునీతం చేయగలిగే మహత్తర సాధనం ప్రత్యక్ష వ్యాఖ్యానం.

ప్రశ్న : శ్రీసీతారామ కళ్యాణోత్సవానికి తమరే తరచుగా వ్యాఖ్యాతగా వ్యవహరించడంలోని ఔచిత్యమేమిటి?

**జవాబు :** మీరు ఘటికులే! ఎంత సూటిగా వేశారు ఈ ప్రశ్న? నేనే కాదు, నాతోపాటు ప్రతిసారి ఒకరిద్దరు కూడా వ్యాఖ్యాతలుగా వ్యవహరిస్తున్నారు. అనాదిగా అనేక దేవస్థానాలలో పురాణ ప్రవచనాలు, వ్యాఖ్యానాలు చేసిన అనుభవం, ఆర్షవిజ్ఞాన గ్రంథాలతోను, దైవతత్వంతోను, భక్తాగ్రేసరులతోను నాకుగల పరిచయమే గాక దైవానుగ్రహ ప్రాప్తమైన వ్యాఖ్యాన సరళి - ఇవన్నీ నన్ను వ్యాఖ్యాతగా వ్యవహరించే అవకాశం కల్పిస్తున్నాయి.

ప్రశ్న : దూరదర్శన్‌లో 'పద్యాలతోరణం' - అంత్యాక్షరి తమ అధ్వర్యంలో జరుగుతున్నది కదా? దానిలోని విశిష్టతను కాస్త వివరించండి?

**జవాబు :** మేము విద్యార్థులుగా ఉన్నపుడే కట్టు శ్లోకాలు, తోక పద్యాలు, అంత్యాక్షరి అనే మూడు ప్రక్రియలలో పాలుపంచుకునే వాళ్ళం. పద్యాల అంత్యాక్షరి వలన సాహిత్య పరిజ్ఞానం పెరగగలదని విశ్వసిస్తాను. అందుకే దూరదర్శన్ ప్రయోక్తలు శ్రీ ఓలేటి పార్వతీశం, శ్రీ ఆర్. ఆర్. కె. శ్రీగార్లతో ఈ కార్యక్రమం రూపొందించి ప్రసారం చేయమని హైదరాబాదు వచ్చినప్పటి నుంచి చెపుతూ వచ్చాను. అయితే దూరదర్శన్‌లో రోజుకి 24 గంటలు ప్రసారాలు చేయగల అవకాశం రాగానే ఈ కార్యక్రమాన్ని ప్రారంభించారు. ఇందులో ఎందరో చూడకుండా పద్యాలు చదవగలుగుతున్నారు. ఈ ప్రక్రియను అందరికీ పరిచయం చేయడం కూడా జరుగుతోంది కదా!

ప్రశ్న : ఈ ప్రక్రియను చేపట్టడానికి మీకు ప్రేరణ ఎలా కలిగింది?

జవాబు : మీరు నన్ను పూర్వాశ్రమానికి తీసుకు వెడుతున్నారు. వాటిని గుర్తు చేసుకుని చెప్పాలి కదా! వినండి. ఎందరో మహోదయులు ముఖ్యంగా విశ్వనాథ సత్యనారాయణ, కాశీ కృష్ణమాచార్యులు, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, కాటూరి వెంకటేశ్వరరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, భమిడిపాటి కామేశ్వరరావు, మధునాపంతుల సత్యనారాయణ, గడియారం వేంకటశేషశాస్త్రి, చెరుకుపల్లి జమదగ్నిశర్మ, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి మొదలైన ప్రసిద్ధులను మా కొవ్వూరు కళాశాలలోను, రాజమహేంద్రవర సాహిత్య సభలలోను విద్యార్థిగా ఉండగానే చూచాను. విన్నాను. వీరిలో కొందరిలా కవిత్వం చెప్పాలనీ, కొందరిలా మాట్లాడాలని, పద్యాలు వ్రాయాలని అనిపించేది. ఆలమూరు పండిత సభలు పరిశీలించినపుడు పద్యాలు వ్రాయాలని సంకల్పం కలిగింది.

ప్రశ్న : దేవస్థానాలతో తమకున్న అనుబంధం ఎలాంటిది?

జవాబు : అనేక దేవాలయాల్లో వేదపండితుల సదస్సులలో ప్రసంగించాను. ఆ స్ఫూర్తితో అన్నవరం, సింహాచలం మున్నగు దేవస్థానాలవారు నాచేత ఆయా స్థలపురాణాలు తెలుగులో వ్రాయించి ప్రచురించారు. అనేక దేవాలయాల్లో కల్యాణాలు, వ్రతాలు నా ఆధ్వర్యంలో జరిగాయి. నా పర్యవేక్షణలో ఎన్నో దేవాలయాల్లో హరికథలు, నాటకాలు, పురాణ ప్రవచనాలు జరిగాయి. అన్నవరం వీరవేంకట సత్యనారాయణ స్వామి వారి దేవస్థానంలో పరమ పూజ్యులు భారత రాష్ట్రపతి శంకర దయాళ్ శర్మగారి అధ్యక్షతన నా సూచనల మేరకు ఉత్సవాలు జరిగాయి. శ్రీశైల దేవస్థానం పత్రిక శ్రీశైల ప్రభకు ఆచార్య దివాకర్ల వేంకటావధాని, జానుమద్ది హనుమచ్ఛాస్త్రి గార్లతోపాటు నేను కూడా గౌరవ సంపాదకునిగా పనిచేసాను. శ్రీశైల దేవస్థాన వైభవప్రాభవాలు ఇనుమడింప జేసేందుకు, నేను సమర్పించిన సూచనలనే పైడిపాటి లక్ష్మయ్యగారు అమలు పరిచారు. 'శ్రీశైలప్రభ' సర్క్యులేషన్ బాగా పెరిగింది.

ప్రశ్న : 'ఆంధ్రవ్యాస' బిరుదం ఎలా వచ్చింది? ఇంకా ఏవైనా బిరుదులు పొందారా?

జవాబు : నరసాపురం శ్రీవేంకటేశ్వర ధార్మికకేంద్రంవారి ఆధ్వర్యంలో 54 రోజులపాటు మహాభారతం ఉపన్యసించడంతో వారు 'ఆంధ్రవ్యాస' బిరుదు ప్రదానం చేసారు.

కృష్ణా జిల్లా పెద్దముత్తేవి శ్రీసీతారామ లక్ష్మణ యతీంద్రుల వారు 'కవికుల రత్న దీప' అన్న బిరుదు ప్రసాదించారు. న్యూఢిల్లీలో ఆంగ్లంలోను, తెలుగు సంస్కృతాలలోను వైదికాగమంపై ప్రసంగించగా, కుర్తాళం సిద్ధేశ్వర పీఠాధిపతి శ్రీశివచిదానంద స్వామివారి చేతుల మీదుగా 'వైదికాగమాలంకార' బిరుదును అందుకున్నాను.

ప్రశ్న : ప్రస్తుత కాలమాన పరిస్థితులలో పురాణాల ఆవశ్యకతను గురించి మీ అభిప్రాయం?

**జవాబు :** పురాణాల ఆవశ్యకత ఎంతో ఉంది. సర్వకాల విశ్వజనీనమై, సర్వదేశీయులకు ఉపయోగించే ఆధ్యాత్మిక, నైతిక, సామాజిక, ఆర్థిక, రాజకీయ, ధార్మిక విశేషాలన్నీ పురాణాల్లోనూ ఉన్నాయి. పురాణాలే తొలి చారిత్రక సంస్కృతి గ్రంథాలు. భారతీయ భాషలన్నిటిలోని అన్ని ప్రకియల గ్రంథాలకు పురాణ గ్రంథాలే మూలాలు.

ప్రశ్న : సరే! మన ఉత్కృష్ట గ్రంథాలన్నీ సంస్కృతంలోనే ఉన్నాయి కదా! అటువంటి సంస్కృత భాష జాతీయ భాషగా అమలుకు నోచుకోలేదు. దీనిపై తమ స్పందన ఏమిటి?

**జవాబు :** సంస్కృతభాష అంటే సంస్కరించబడిన భాష. అందుకే దీనిని దేవ భాష అని కూడా అన్నారు. దీని వలన చక్కని ఉచ్చారణ అబ్బుతుంది. అయితే కొన్ని మంత్రాల బీజాక్షరాలు ఉచ్చారణ సరిగా లేకపోతే అనర్థాలు జరుగుతాయన్న సాకుతో, అందరూ చదవలేరనే అపోహతో, ఈ భాష జాతీయభాషగా ఒకే ఒక ఓటుతో గుర్తింపునకు నోచుకోలేకపోయింది. ఇది నిజంగా దురదృష్టకరం. తత్ఫలితంగా భారతదేశం ఎవరికివారే యమునాతీరేగా మారింది. ఎవరికి వారే స్వయం ప్రతిపత్తి కోరుతున్నారు. అన్ని ప్రాంతీయ భాషలకు సంస్కృతమే మాతృక. సంస్కృతం వలననే ప్రాంతీయ భాషలు పరిపుష్టిగా ఉన్నాయి. భారతావనిలోని సమస్త ప్రజానీకం తారతమ్యం లేకుండా సంస్కృతాన్ని చదివే అవకాశం పోయింది. అన్ని శాస్త్రాలకు కావలసిన పారిభాషిక పదాలు సంస్కృతభాషలో ఉన్నాయి. సంస్కృతభాష జాతీయభాషగా ఉంటే, ఒక ప్రాంతాన్ని కాదని, మరో ప్రాంతం ఆధిక్యత పొందే అవకాశం ఉండేది కాదు. ప్రపంచ దేశాలలో భారత జాతీయ భాష ఒకటి ఉందని గౌరవ గుర్తింపు ఉండేది. భారతావనిని ప్రగతిపథంలో అగ్రరాజ్యాల సరసన నిలబెట్టగలిగేది. అటువంటి మహత్తరమైన అవకాశాన్ని కోల్పోయాము. దిద్దుకోలేని తప్పిదాన్ని

చేసాము. భారతీయతకు, జాతీయతకు తీరని నష్టం వాటిల్లింది. వాస్తవానికి ప్రాంతీయ భాషలకన్నా సంస్కృతభాష నేర్చుకోవడం సులభం

**ప్రశ్న** : మీరు ఆధ్వర్యం వహిస్తున్న సాహిత్యసంస్థ ఏదైనా ఉన్నదా?

**జవాబు** : ఇంకా అడగలేదేమా! అనుకుంటున్నాను. నేను 'అనంత సాహితి' సంస్థను స్థాపించాను. ఈ సంస్థ వ్యవస్థాపక కార్యదర్శిగా పురాణాల పరిశోధనకు, అనువాదాలకు, ప్రచురణలకు నా కృషిని కొనసాగిస్తున్నాను.

**ప్రశ్న** : నిజ జీవనంలో కూడా సనాతన ధర్మ నిరతితో మెలగుతున్న 'మన పవిత్ర వారసత్వం', 'బృహత్ జ్ఞానరత్నాకరం' వంటి గ్రంథాలను వెలువరించిన శ్రీపాణుగుపాటి కృష్ణమూర్తిగారి సంపాదకత్వంలో వెలువడుతున్న ఆధ్యాత్మిక, వైజ్ఞానిక సాంస్కృతిక మాస పత్రిక 'సూర్యశక్తి' పాఠకులకు తమ ఆశీఃపూర్వక సందేశాన్ని ప్రసాదించమని కోరుతున్నాను.

**జవాబు** : శ్రీకృష్ణమూర్తిగారి సంపాదకత్వంలో వెలుపడుతున్న 'సూర్యశక్తి' ద్వారా దైవంమీద విశ్వాసముంచి, తన అభిరుచిని పురస్కరించుకొని, తనకు ఏరంగంలో ఇష్టమూ, సామర్థ్యమూ ఉన్నాయో గమనించుకుని, లాభనష్టాలు, జయాపజయాలు, కీర్తి అపకీర్తులు దృష్టిలో పెట్టుకోకుండా, ఎల్లరికీ ఉపయోగించే ఏదో ఒక పనిని విధ్యుక్త ధర్మంగా భావించి చేయడమే ప్రతివారు చేయవలసిన పని. అమూల్యమైన కాలంలో ఒక నిమిషం కూడా వ్యర్థం చెయ్యకుండా కృషి చేసినవాడు అతి సామాన్యుడు అనుకున్నవాడు కూడా ఘనకార్యాలు సాధించగలుగుతాడు.

**పరిచయ కర్త:** మహోన్నత విలువలతో, ఋషితుల్యమైన జీవన విధానంతో, ఆంధ్రవ్యాస సార్థక నామధేయులై తమరు చేస్తున్న అమూల్య సాహితీసేవకు తెలుగుజాతి ఎంతో ఋణపడి ఉంటుంది. ధన్యవాదాలు. ఇంక సెలవు. నమస్కారం!

పరిచయ కర్త: 'ఆర్షకవి భూషణ' షడ్డపల్లి సత్యంనాయుడు

---

## కీ.శే. యేలూరిపాటి అనంతరామయ్యగారి రచనలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ విష్ణుపురాణం - 1వ సంపుటం | రూ. 70-00 |
| 2. | శ్రీ విష్ణుపురాణం - 2వ సంపుటం | 50-00 |

| | | |
|---|---|---|
| 3. | శ్రీ మార్కండేయ పురాణం - 1వ సంపుటం | రూ. 70-00 |
| 4. | శ్రీ మార్కండేయ పురాణం - 2వ సంపుటం | 50-00 |
| 5. | శ్రీ మార్కండేయ పురాణం - 3వ సంపుటం | 40-00 |
| 6. | శ్రీ బ్రహ్మవైవర్త పురాణం - ప్రకృతి ఖండం | 125-00 |
| 7. | చారుచర్య | 30-00 |
| 8. | శ్రీ మద్భాగవతం - 7వ స్కంధం | 20-00 |
| 9. | శ్రీ మద్భాగవతం - 10వ స్కంధం పూర్వార్థం | 50-00 |
| 10. | జైమిని భారతం - అశ్వమేధ పర్వం | 125-00 |
| 11. | ఆకాశవాణి మార్కండేయ పురాణం | 40-00 |
| 12. | నీలకంఠత్రిశతి | 20-00 |
| 13. | గజేంద్రమోక్షణం | 10-00 |
| 14. | శ్రీ స్కాంద సూత సంహిత - శివమాహాత్మ్య ఖండం | 35-00 |
| 15. | ఆకాశవాణి సూక్తిముక్తావళి | 45-00 |
| 16. | పరిణయ హరిచందనం | 10-00 |
| 17. | భారత శాకుంతలం | 20-00 |
| 18. | ఉమాపరిణయం | 10-00 |
| 19. | నలపాక దర్పణం | 150-00 |
| 20. | దత్తాత్రేయ వజ్రకవచం | 10-00 |
| 21. | సుమతి శతకం, వివేకనందినీ వ్యాఖ్యా సహితం | 50-00 |
| 22. | బ్రౌనుదొర ప్రచురించిన రెండు మంచి పుస్తకాలు | 40-00 |

* * *

# 'తోగుమ్మి' లంకలో ఒక దోసపండు

- తంగిరాల

అఖండ గౌతమికి అద్దరిని
రాజమహేంద్రవరం - ధవళేశ్వరం రెండు పట్టణాల జట్టు
ఇద్దరిని గోదావరి పడమటి గట్టు
'తోగుమ్మి' - 'వాడపల్లి' జంట పల్లెపట్టు
**1935**లో ఈ కవల పల్లెల్లో పుట్టిన
'లవ కుశులం' నువ్వూ నేనూ.

కొవ్వూరు 'ఆంధ్రగీర్వాణ విద్యాపీఠం' లో
'భాషాప్రవీణు'డైన మా అన్నయ్య 'సోమయాజి'కి
నువ్వుకూడా నాలాగే ప్రియమైన తమ్ముడివి.
పవిత్ర 'గోవుపాదాల రేవు' లో
అఖండ గౌతమీ మాతను పూజించి
సంస్కృతాంధ్రాలను ప్రత్యక్షం చేసుకున్న రసఋషివి!
తెలుగు పద్యాన్ని హృద్యంగా పాడగలవు
సాహిత్యోపన్యాసంతో శ్రోతల్ని
మంత్రముగ్ధుల్ని చేయగలవు.

అత్తాకోడళ్ళ అంచుల -
తెల్లని పొందూరు ఖద్దరు పంచె
తెల్లని ఖద్దరు లాల్చీ
భుజంమీద జరీకండువా
నిండైన విగ్రహం
పచ్చదబ్బపండు శరీరం
ముఖంలో బ్రహ్మతేజస్సు
కళ్ళల్లో జ్ఞానకాంతి
పెదవులపై నిత్యం విరబూసే
చెలిమి చిరునవ్వుల మల్లెపువ్వులు!

నిన్ను కన్నెత్తి చూస్తుంటే -
వేసవి వైశాఖంలో
పెండ్లి పందిరి కొత్త తాటాకుల వింత వాసనలో
మిద్దె గదిలో గడ్డిపరుపుల కావులో నక్కిన
బనగానపల్లె మామిడి పండ్ల
ఆరముగ్గిన పరిమళాల ఆనందం!

ప్రాచీన అర్వాచీన సమ్యక్ సమ్మేళనంగానే
నీ సాహిత్య జైత్రయాత్ర కొనసాగింది.
'కొవ్వూరు' లో 'అల్లూరి బాపినీడు' గారి ఆస్థాన కవివి
'తణుకు' లో ముళ్ళపూడి తిమ్మరాజుగారి నర్మసచివుడివి
'అత్తిలి' లో తెలుగు పండితుడుగా ఉంటూనే
తణుకు వచ్చి 'తిలక్' ని పలుకరించేవాడివి
మొట్టమొదట ముద్రితమైన తిలక్ పుస్తకాలకు
పీఠికలు వ్రాసిన విమర్శకుడివి నీవే కదా!
'కాటన్ దొరగాథల' రత్నాల్ని వెలికి తీసిన ఘనత నీది
ఉపన్యాసకుడుగా - తెలుగుతల్లి ఉపాసకుడుగా
ఆమెను 'వెంకటగిరి' జరీఅంచు చీరలతో సింగారించావు
'గుంటూరు పాటల' బొండు మల్లెలతో పూజించావు
'గిడుగు పిడుగు' వాదాన్ని వ్యాసమహర్షికి వినిపించావు
శిష్టవ్యావహారికానికి జనప్రియత్వం కల్పించావు
దూరదర్శినీ దుర్భిణితో
ఆంధ్రావని దశదిశల్లో
పద్యాల పసిడి తోరణాలు కట్టావు
చదువుల తల్లికి కప్పురపు నివాళులు పట్టావు!

అఖండ గౌతమీ ద్వీప విశాల సైకతాల్లో
ఆదికవి వాగనుశాసనుడూ
బ్రాహ్మీదత్త వరప్రసాదుడు శ్రీనాథుడూ
పెట్టిపోషించిన సాహిత్య సంప్రదాయపు దోసపాదుల్లో
ఘుమఘుమలాడిన ఒక పండువు నీవు!

పాండిత్య శక్తితో, కవిత్వరక్తితో
వక్తృత్వ వైభవంతో, దేశికత్వ ధిషణతో
అరవచ్చిన ఆ లంక దోసపండు సువాసనలు
'తోగుమ్మి' నుండి 'గుంటూరు' మీదుగా
'భాగ్యనగరం' బజారు వరకూ వ్యాపిస్తే -
సమవర్తి వచ్చి బేరమాడి
చటుక్కున పట్టుకు పోయాడు!
వ్యాసపూర్ణిమ రాత్రి శుభ్రజ్యోత్స్నలో
'ఆంధ్రవ్యాసుని' ఐక్యం!
అష్టాదశ పురాణ గద్య గురువు
పంచభూతాలలో మమైక్యం!!

*(పశ్చిమ గోదావరి జిల్లాలో కొవ్వూరు తాలుకాలో గోదావరీ తీరంలో కొవ్వూరుకు మూడుమైళ్ళ దిగువునగల ఒక కుగ్రామం ''తోగుమ్మి''. ఇది కీ.శే. యేలూరిపాటి అనంతరామయ్యగారి స్వగ్రామం. దీనికి ఒక మైలు దిగువున ఉన్న ''పెదవాడపల్లి'' మా అమ్మమ్మగారి ఊరు. నేను కూడా 1935లోనే అక్కడ పుట్టాను.)*

* * *

# మాదాసు పిచ్చయ్యగారి కన్నీటి నివాళి

## 1. శ్రద్ధాంజలి

మనిషి తెలుపు లోన మనసు తెలుపు
మాట తెలుపు లోన మానవత్వము తెలుపు
నిండైన విగ్రహం నీతి తప్పని నడత
శుద్ధ ఖద్దరు బట్ట సూటి మాట -

మంచి తలపుకు మంచిమాటకు
మంచి చేతకు మంచి రూపం
కొత్తపాతల మేలు కలయిక
కొత్తమాటకు కొత్తపాటకు కొత్తరూపం -

పిలకలేని ప్రాచీనుడు, సూటులేని ఆధునికుడు
చాదస్తంలేని పండితుడు, హేతువెరిగిన వేదాంతి
తేనే తీపి పలుకు తేటైన భావాలు
ఆధునికుడు ముందు ఆపైన వైదీకి -

పద్యాల దొక పంట, వచనాల దొక నడక
మాటల దొక వరస, పాటల దొక బాణి
జానపదుల పాట జానుతెనుగు పాట
గుంటూరు పాటలను గుచ్చి కూర్చిన శిల్పి -

అభిన పానుగంటి ఆంధ్ర వ్యాసుడు
అష్టాదశ పురాణ అనువాద దీక్షితుడు
సూక్తిముక్తావళి సూత్రధారుడు
భద్రాద్రి సీతమ్మ కల్యాణ వ్యాఖ్యాత
మాన్యుడు మా ఏలూరి పాటి -

వ్యాసపూర్ణిమనాడు వ్యాసుని పిలుపున
''ఆంధ్రవ్యాసుండు'' అరిగె వ్యాసుని కడకు
మానవ పురాణమున్ వినిపింప -

''ఆర్షవిజ్ఞాన భారతి'' ఆర్షవిజ్ఞానమ్ము
అమరులకుజెప్ప అరిగె నమరపురికి -
''పురాణ పరమేష్ఠి'' పురాణములను
బ్రహ్మకు వినిపింప బ్రహ్మలోకము జేరె -

''వైదికాగమాలంకార'' వైకుంఠ పౌరులకు
వైదికములు నేర్ప వైకుంఠమునకు జేరె -
భువన విజయ రామకృష్ణ పాత్రధారి
ఇంద్రుని పిలుపున ఇంద్రసభకు వెళ్ళె -

అమెరికనుల నలరించిన ''కవికుల రత్నదీపుడు''
అవధాన సభలకు అధ్యక్షత వహియింప అరిగె నమరపురికి
ఒక తార రాలెను సాహితీ గగనాన
శూన్యమాయెను ఆంధ్ర సాహితీ జగతి !

*(''ఆవలితీరం'' పత్రిక ఆగస్టు 2002 సౌజన్యంతో)*

## 2. స్మృతిగీతం

జీవమున్నదెల్ల చావవలసినదే
చావు జగతిగుండ పోవుత్రోవ
మరణమందె గలదు మన శాశ్వతత్వమ్ము
తెరువులేదు ఇదియు తెలియకున్న - 1

చావుభయములేని జీవుండు ముక్తుండు
చావుకంటె భయము చావు తలపు
చావు మరచెనేని జీవి సుఖము నొందు
బాధలేని పోక బ్రతుకు వరము - 2

ఎందరెందరోను ఏగినారు ఎటకో
ఏగ నుండె ముందు ఎందరోను
ఎందరేగినాను ఎందరేగుచునున్న
ఎ౧ంగ నిచ్చగింప రెవరు కూడ - 3

పుట్టినట్టిదెల్ల గిట్టక మానదు
గిట్టినట్టిదెల్ల పుట్టితీరు
రెండు తప్పిపోవు రీతియే యోగమ్ము
విశ్వయోగి మాట వెలుగు బాట - 4

కాలనాగు వచ్చి కాటందబోయినా
నోరు పెగిలిరాదు నూకలున్న
కాలుజారిపోవు కాలమ్ము తీరగా
తప్పదెక్కడున్న ముప్పు వున్న 5

దున్నె పొలము నితడు చిన్నతనము నందు
ఎదిగి చదువులందు ఎంతొ ఎత్తు
సాగు చేసినాడు సాహితీ క్షేత్రమ్మొ
మాన్య మిత్రతముడు మా 'అనంతు' - 6

ప్రాప్త ముండి యుండ ప్రాణంబు లెటుబోవు?
పెట్టిన దిటయున్న గిట్టునెట్లు?
గింజగింజపైన గీయబడునుపేరు
దైవఘటన ఎట్లు తప్పగలదు? 7

* * *

# విషాద వీణాగానం - నడకుర్తి రత్నకవి జీవనయానం

## -కొలకలూరి (నడకుర్తి) స్వరూపరాణి

"Heard melodies are sweet but those unheard are sweeter-"
ఆంగ్లకవి కీట్సు ప్రకారం వ్యక్త రాగాలకంటె అవ్యక్తాలు మధురతరాలు.

మరి మాధుర్యానికి ప్రేరణ వేదన ఐతేనో...? స్మృతి మధురమే. కానీ అది వాస్తవం తాలూకు అభావానికి నమూనా అని స్పష్టమైతేనో! మనిషి మరణిస్తే అమరుడయ్యాడంటారు. అలా అనుకోకపోతే జీవించి యున్న వాళ్ళకు జీవించటం కష్టమే. అందుకే స్మృతుల్నీ స్వప్నాల్నీ ఆశ్రయించడం.

కుటుంబ బాధ్యతలతో సతమతమై వెళ్ళిపోయిన వ్యక్తికి అవతల నరకం ఉండదని ఛలోక్తి. దాన్ని యిక్కడే చూసుంటాడు కాబట్టి. దానికి తోడు క్షణం కుదురుగా నిలవనివ్వని సృజనాత్మక కవిత్వ తపస్సుతో సమాజ శ్రేయస్సు తన జీవితపు నాణేనికి రెండో పార్శ్వంగా దీక్షవహించిన కవి మాటా...? చెప్ప నవసరమే లేదు. సార్థక జీవనం గడిపి తుల్యప్రాజ్ఞ ద్వితీయాద్వితీయుడై దివ్యలోకాలకు వేంచేస్తూ అపార జాతీయతా పారంపర్య పారావారాన్ని సమాజానికి మిగిల్చిన ఒక విద్వత్కవి వర్యుని సంస్మరించడం ఒకానొక సారస్వత బాధ్యత. ఈ సంస్మరణ ఆలంబన విభావ ప్రియం భావుకులైన కవి గోవాడ గ్రామ వాస్తవ్యులు ''బాలకవి'', ''కవి భూషణ'' కీర్తిశేషులు నడకుర్తి వెంకటరత్నంగారు

(1915-1989). వీరి ధర్మ పత్ని: మేనరికం; రత్న కవితావిక్రేత, ప్రేమ వివాహ (1940) లబ్ధ, ఉపాధ్యాయిని ఇంటూరి మరియాంబ (1923 - 1973).

కలశోదధిలా విస్తారంగా ఉప్పొంగుతున్న కావ్యాంశాలను కలశంలా యిరుకైన పరిమిత వ్యాసంలో ఇమిడ్చే ప్రయత్నంలో ఎంత కుదించి ఐనా రత్నకవి పద్యాలను యథాతథంగా పాఠకమహాశయుల యెదుట పెట్టాలని నా ఆశయం. ఈ పనికి ముందు ఈ వ్యాసకర్త్రి యక్షగాన ప్రక్రియలో రచించిన రత్న కవిత్వ వైశిష్ట్యం జీవిత చరిత్ర (అముద్రిత) గ్రంథంనుండి ఒక పద్యాన్ని ఉత్సాహం కొద్దీ యిక్కడ నివేదిస్తాను.

అల నన్నయ్యకు లేదు తిక్కనకు లే దా భోగ మస్మాదృశన్
సలిపెన్ రత్నకవిత్వ సూర్యకర భాస్వచ్చంద్ర దీపన్- అనా
విల జన్యాత్కర సార సంగ్రహ వచోవిద్యాస్వరూపన్ విని
ర్మల వంశోద్ధరణాప్తి నవ్యకవిరాడ్రత్నాఖ్యకున్నట్లుగన్

ఇరవైయ్యో శతాబ్ది ప్రారంభంలో సాగిన భావకవిత్వోద్యమ ఉద్ధృతి సాహిత్య విదులకు తెలియంది కాదు. ఏతద్వీచికలు రత్న కవినీ ఊపివేయక మానలేదు. అందుకు ఉదాహరణగా 1939 లో 'మాతృసేవ' అనే పత్రికలో ప్రచురితమైన ''వాపోక'' అనే ఖండికను గుర్తించవచ్చును. భావకవులు ఆమోదించిన గీతపద్య ఛందస్సులో అనుభూతి ప్రధానమైన అనంత వేదన:

లేదు పక్ష విపక్ష విభేద మింత
అతడు సర్వ సమానుడంచంద్రు కల్ల
నీవు పక్షపాతివి సుమా నిశ్చయముగ
దగ్ధమౌ హృది నీ వైపు దలచుకొనిన. 1

''కరుణకును నీదు హృదయమ్ము పురిటిగీము''
ఎన్ని మార్లు ప్రార్థించితో ఎరుక రాదు
ఇట్టులని నిన్ను లాభమేమీ మదీయ
ప్రార్థనము నిష్ఫలమ్మయి పరిణమించె. 2

ఆ జగచ్చక్షు వుదయించు నంతలోన
కలువ ముకుళించు సంపెంగ కడకుబోవ
నొల్ల దళిరాజ మహిమ మేనోటితోడ
కోరి సమవర్తి నని చెప్పుకొనెదవయ్య? 3

అత్తపత్తి దళమ్ముకై యలమటింప
సాగె హృత్సరోరుహదళ సముదయంబు
ఆత్మనియమమా పరమౌఢ్యమా త్వదీయ
మైన మాయావిలాసమా మాయదారి!

సర్వ సౌఖ్య సంధాయక స్వర్గ చిత్ర
రచన మొనరించి నట్టి కరమ్ము తోడ
కడు భయంకర నరకరాక్షసి సృజింప
సాహసించితె కలగల్పు చక్రవర్తి! 5

పాఠకుల రసగ్రహణ సామర్థ్యాన్ని విశ్వసిస్తున్నా వ్యాసం విస్తరిస్తుందన్న భయం వేధిస్తున్నా సరే. ''మాయావిలాసమా మాయదారి'' అనే పదబంధాల్లో కవి లక్షించిన మానవుడందుకోలేని సృష్టికర్త అగమ్యగోచరత్వాన్ని; అజ్ఞాత సూత్రధారికి ''కలగల్పు చక్రవర్తి'' అనే నిర్వచనాన్ని యిచ్చిన కవి కాల్పనికతా సౌకుమార్యాన్ని ఉల్లేఖించకుండా ఉండలేను.

రత్నంగారి సన్మాన సంచిక ''కౌముది'' (1982) లోని ఒకటి రెండు పద్యాలు పలుకు స్వచ్ఛతకుదాహరణగా:-

సీ|| కొనగోట కొండనెత్తిన ధురంధరత త్రి
జగదఘ నిర్ముక్త చాతురిమము
పాల్ద్రావి పూతన ప్రాణంబులన్ గొంట
భువన సంరక్షణాద్భుత కృతంబు
మ్రాకుల ఛేదించి మనుజరూపం బిచ్చు
పని మహోద్భుత శక్తి కనుక్రమణిక
నోర్విచ్చి భువన సందోహమ్ము జూపుట
తిరమైన దైవీయ వర పదంబు

తే.గీ. వెన్న దిన్నయ్య కన్నయ్య వేణువూది
సకల జీవుల నానంద జలధి దేల్చి
నట్టి వేణుగోపాలు డత్యంత ప్రీతి
మమ్ము సర్వాభ్యుదయముల మనుచుగాత! 1

సీ॥ ఎట్టి చిరుతజీవికేని హాని ఘటిల్ల
వాపోవునట్టి కృపామనస్వి
అగ్ని గాలిని నీట నా యా పనులకయి
ప్రావీణ్యమొప్ప నేర్పరము ప్రభుడు
మనసార నొకసారి తను గూర్చి ప్రార్థింప
ఘోర పాప తరుల గూల్చు ఘనుడు
అణువునం బ్రహ్మాండమగుచు బ్రహ్మాండమం
దణువౌచు నెసగు మాయాస్వరూపి

తే.గీ. పాంచ భౌతికాఖండ ప్రపంచమందు
జనన మరణాత్మకానంద శమన యుగళి
చిత్రముగ నుటంకించిన చిత్స్వరూపి
వేణుగోపాలదేవుడై వెలసె నౌర
వాసికెక్కిన గోవాడ వర పురాన. 2

ఆధ్యాత్మిక భావవిశ్లేషణల్ని బట్టి రత్నకవి శాఖను, అభిమతాన్ని నిర్ణయించడం కష్టం. ఆయన పరిజ్ఞానం అలాంటిది. ''స్పర్శవేది'' అనేఖండికనుండి ఒక పద్యం:

సీ॥ ఒక పిచ్చితీగ నీ యుత్తమాంగము నెక్కి
నంత కిరీటమై యవని నిల్చె
ఒక కొరడాతోడ వికలురు నిన్గొట్ట
దానికిం గీరితి దాపురించె
ఒక రెల్లుదంటు నోటికి దాకినంతనే
అదియు విఖ్యాతమై పృథివి నిల్చె
ఒక యినుపబల్లెంబు ఉదరాన గ్రుమ్మిన
వాడు వార్తలలోని వ్యక్తి యయ్యె

తే.గీ॥ ఎంత పేరు వానికి లభియించె క్రీస్తు
తాకినంతన నిన్ను లోకైకనాథ!
పరశువు ముఖంబు చందన తరువు నరికి
అయత సౌగంధికంబయి అలరినటుల.

రత్నకవి లోకోత్తర దర్శనకు, అభివ్యక్తీకరణ వైచిత్రికి పై పద్యమొక మచ్చుతునుక.

ఊళ్ళో కవి అంటూ ఉన్నాడంటే అనుబంధంగా కవిత్వబాధిత సంఘసభ్యులు కూడా కొందరుండే ఉంటారని రుజువు లక్కరలేకుండా చెప్పెయ్యొచ్చు. దీనికి రత్నకవి మినహాయింపులేదు. ఆ ప్రస్తావనకుముందు అభిమానసంఘ సభ్యులు అనదగినవాళ్ళను గూర్చి ముచ్చటించుకొందాము. కవి అన్నాక వీళ్ళూ ఉంటారు కదా! అలాంటి అభిమానుల్లో వర్ధమానుడు తాళ్ళూరి లాబాన్‌బాబు ఒకరు. ప్రస్తుతం హైదరాబాద్‌లో జాతీయస్థాయి బ్యాంకు NABARDలో అసిస్టెంటు జనరల్ మేనేజరుగా ఉన్నారు. 1999లో వెలువడ్డ ''భారత స్వాతంత్ర్య సమరంలో గోవాడ'' అనే సంచికలో వీరిదొక ఆర్టికిల్ ఉంది. దాని శీర్షిక ''వాడువారని వాడ గోవాడ వాడ''. ఈ పద్యపాదం బాలకోటీశ్వర తారావళి (1936) లోని రత్నకవిగారి సీస పద్యంలో ఉంది.

సీ॥ గోవాడయన్నను గోపురంబని కదా
గోపురంబన్న వాణీపురంబు
శ్రీభాష్యపురమని చెప్ప నీ హేతువు
చేతనే యే విపశ్చిద్వరుండొ
తొల్లి యీ పురి దగ్గుమిల్లి పా డిచటనే
కవి దగ్గుమిల్లి దుగ్గన వసించె
శ్రీనాథకవి యశస్వికి బావమఱది యీ
దగ్గుమిల్లి కులుండు దుగ్గనకవి.

తే.గీ. ఆదినుండి విద్యోద్ధనంబన్న యశము
గాంచె గోవాడపురము నా కాణయాచి
ఇడుమ లెన్నేని చుట్టుముట్టినను సుంత
వాడువారని వాడ గోవాడ వాడ!

ఈ వ్యాసకర్త గోవాడ హైస్కూల్లో చదువుతున్నప్పుడు హిందీమాస్టరు, అదే హైస్కూల్లో రైటరు రత్నకవిగార్కి సహోద్యోగిగా ఉండేవారు. ఇప్పటికీ తటస్థపడితే నాతో ఇలా అంటుంటారు: ''మీ నాన్నగారిని గూర్చి జస్టిస్ పున్నయ్యగారు ఘనంగా ప్రస్తావిస్తుంటారమ్మాయ్! (వీరు ప్రస్తుతం స్పీకరు పదవీ భూషణ భూషితగౌ॥ ప్రతిభాభారతి గారున్నారే వారినాన్న). విజయనగరం మహారాజా కళాశాలలో వారు ఉభయులూ సహాధ్యాయులట. కాలేజీ సాంస్కృతిక సాహిత్య కార్యకలాపాల్లో రత్నకవి ప్రముఖపాత్ర నిర్వహిస్తుండేవారట''.

నిజానికి హిందీ మాస్టారికీ మానాన్నగారు ఐదో తరగతిలో తెలుగు చెప్పిన గురువుగారట. మళ్ళీ వీరి పిల్లలకు మా అమ్మ మరియాంబ ఎలిమెంటరీ స్కూలులో గురువు. ఈ గురుపారంపర్యాన్ని గూర్చి నేను నా వచనకవితలో-

''అక్షరాల విత్తనాల సేద్యపు వ్యవసాయక్షేత్రాన
గురుపీఠాన్ని గుత్తకు తీసుకున్న కుటుంబంలో
పాఠాల తీగలను పందిరికి అల్లే అర్ధాంగి భాగస్వామ్యంతో
ఉద్యోగ జీవితం అర్ధనారీశ్వర యోగమౌతుంది (రత్నకవికి)
కాలం యవనికమీద ఒకతరం విద్యాభివృద్ధి గ్రావుచిత్రం
జ్ఞానతృష్ణ గ్రామమై చాపుకున్న నాలుక.
ఆమె బీజాక్షరం లిఖించిన కాళిక''- అని వ్రాసుకున్నాను

ఆమధ్య ఒంగోలు 'అక్షర సాహితీ సమితి' కి చెందిన ఎమ్. వి.యస్. శాస్త్రిగారు నిర్వహించిన రాష్ట్రస్థాయి వచన కవితల పోటీల్లో నాకు బహుమతి తెచ్చిపెట్టిన ''హైస్కూల్ రైటరు'' అనే కవితకు ఇతివృత్తం రత్నకవిగారే.

''చాలీ చాలని జీతం ఇచ్చి సతాయించే
జీవితం ఆఫీసరుక్రింద
చిత్తం! అనే భటుడి వేషం కట్టుతున్నా
కూర్చున్న కుర్చీ దగ్గరకు
ఫైళ్ళు మోసుకొచ్చే బంట్రోతులతో
రాజులా భ్రమకల్పించే
రైటరుద్యోగి'' - ఇవి ఆ కవితలోని కొన్ని పంక్తులు.

రత్నకవిపై మరొకరి అభిమాన తరంగం స్రగ్ధరావృత్తం:

పాయాత్త్వాం రత్నమాఖ్యం నిఖిల భువన సంరక్షకో దేవదేవః
ఆరోగ్యైశ్వర్యయుక్తం నిరత సుకవితా నిర్మితా బద్ధ దీక్షం ।
పాండిత్య స్ఫోరకం భావ గుణ హిత మలంకారయుక్తం త్వదీయం
విశ్వస్త్యైక ప్రశస్తం భవతు సుజనతానంద సంధాయి కావ్యం ॥

- విద్యాలంకార డా॥ నాగలింగం వేంకటేశ్వరశాస్త్రిగారు మరియు శైథిల్య పూరణ: పండిత ఉప్పల కోటయ్యగారు (గోవాడ).

1989లో రత్నకవి త్రైమాసిక సంస్మరణ సభ ఏర్పరచి నేను వ్రాసిన పద్యం:

**తే.గీ॥ కాళిదాసుపై తత్తుల్య కవి లభించె**
**నాంధ్రమున నడకుర్తి వంశార్ణవ శశి**
**రత్న మయ్యెడ నొరులకు రాక గణన**
**కనియు పే రనామిక సార్థకత వహించె.**

దీనికి సంస్కృతీకరణ: సహృదయ సాహితీ సహోదరులు శ్రీమల్లాది సుబ్బరాయ మహోదయులు ఇలా చేశారు:

**ఆంధ్ర భాషా మహాంభోధా లబ్ధో రత్నో మహాద్యుతిః**
**నడకుర్తి వంశ వారాశా వేంకటరత్న మభూత్కవిః ।**
**తత్తుల్య స్థ్సితిం లబ్ధుం కోపీహాస్తి నకించనం**
**తస్మాదనామికా తత్వం భజంతేచ కవీశ్వరైః ॥**

వ్యాసంలో అనుకొన్నట్లు కవిత్వ బాధిత సంఘసభ్యుల్లో ఒకరైన డాక్టరు కొడాలి పాపారావు M.B.B.S. (చెరుకుపల్లి) గారు రత్నకవి చివరి క్షణాల్లో ఆర్ద్ర చిత్తంతో వైద్యసేవలందించారు. తాను వేసిన సూదులకు బదులుగా పద్య సూదులు కవిగారిచేత పొడిపించుకొని కొంకర్లు పోయిన స్వచ్ఛంద బాధితుడు.

**రత్నంగారి కవిత్వ గురువు:** 1920 నుండి ఏడెనిమిదేళ్ళపాటు తురిమెళ్ళ హైస్కూల్‌లో రత్నంగారి ఉన్నత విద్యాభ్యాసం జరిగింది. అక్కడ తెలుగు పండిట్ శ్రీ ప్రతాప రామకోటయ్యగారు ఛందస్సును పాఠ్యాంశంగా బోధించారు. అనంతరం విజయనగరం మహరాజా వారి ఆంగ్ల కళాశాలలో ఎఫ్.ఎ. చదువుతున్నప్పుడు బుర్రాశేషగిరిరావుగారు శ్రీ రత్నానికి సాహిత్య సన్నిహితులుగా ఉన్నారు. ఈ ఉభయుల పేర్లను రత్నంగారు సందర్భానుసారంగా అత్యంత భక్తి ప్రపత్తులతో ప్రస్తావించడం మేం విన్నాం. ఐతే బాల్యంలోనే రత్నంగారు వ్రాసిన పద్యాలు ఎన్నోపై విద్యాంసుల గురుత్వాన్ని నిరాకరిస్తున్నాయి. ''బాలకవి నోరుదెరచిన పద్యమగును'' అన్నారు. బాల్యంలోనే పదేళ్ళకే కవిత్వం వ్రాశారన్నమాట.

రత్నంగారు స్వయంగా వ్రాతపూర్వకంగా ''తిరుపతి వేంకటేశ కవిధీరులు నా యభిమాన పాత్రులౌ గురువులు ....'' అని వ్రాసిపెట్టుకున్నారు. ఈ జంటకవుల అవధాన సాహసోపేతమైన ఉదంతాలు, సాహిత్య పర్యటనలు రత్నంగారు సరస సంభాషణల్లో దొర్లించేవారు. శ్రవణానందం నుండి ''నుదుటి సిందూర నామంబు నూరుకోట్లు, నీకు వెలజెప్ప శక్యమే నీలవేణి'' అనే ముగింపుగల సీసపద్యంలోని సంఖ్యామానం ఫణితి చమత్కారం చెప్పి చెప్పి శ్రోతలతో పాటు రసాస్వాదనకు రత్నకవి లోనయేవారు. వారి శైలిపట్ల ఏకలవ్య శిష్యరికం అనదగ్గ ఆరాధన ఉండొచ్చు. అంతమాత్రాన వారు ఉపాసనా

గురువులనడానికి రుజువుల్లేవు. ''గురువులు'' అనే పదం ప్రాసస్థానంలో సాధారణమైన బిగింపులో అమర్చినట్లుగా తెలుస్తుంది.

కాగా, రత్నకవిగారి మిత్రుడు. తుమ్మల వెంకటరత్నం తెలుగు పండిట్‌గోవాడలోనే ఉంటుండగా ''గురువు యెవ''రని అడిగాను. పైన పేర్కొన్నపేర్లన్నీ కొట్టిపారేస్తూ ఆయన: "Self! Self!" అనేసి ఊరుకొన్నారు. నేను మరికొంత తరచి తరచి రాబట్టజూస్తూ: ''ఎలా..? వారి పూర్వీకుల్లోగానీ అలాంటి సాహిత్య వాతావరణం యేదీలేదేమో కదా... వారికి .... స్ఫూర్తి..'' అంటూ నసిగాను. ఆయన మళ్ళీ ఉచ్చైస్వరంతో "Self! Self!" అంటూ ఆమ్రేడితంలో ఆక్రోశించి ఆంగ్లంలో అభివ్యక్తీకరణ వాహికయ్యై ఊరుకొన్నారు. ఆయన వ్రాసిన ప్రతిపద్యానికి ప్రథమశ్రోత తానే అని తెల్పారు. నేను గ్రహించిన విషయమే నిజమైంది. రత్నకవికి - కవిత్వగురువు ఆయనలోని సృజనాత్మకతయే. రత్నకవే కోట్ చేసి చెప్తురదేవారు: ''సకారాంధకారస్తు ఋకారస్తన్నిరోధకృత్ అంధకార వినాశిత్వా ద్గుర రిత్యభిధీయతే.'' అని. మనసులో ''తళుక్!'' మని స్ఫూర్తిగా నడిపించడం అనేది ఎవరివల్ల జరిగిందో ఆ స్ఫూర్తే ఆయన సృజనాత్మకత. 1929లో కాబోలు బాపూజీ కావూరు వినయాశ్రమానికి వచ్చినప్పుడు రత్నం పద్యాలు వ్రాసి గాంధీ యెదుటపడ్డారు. ఆయన ''అచ్ఛా'' అన్నారు. అప్పుడు నాన్నకు 14 సంవత్సరాలు.

**రత్నకవి కావ్యాలు : (ఎ) ముద్రితాలు:**

1. **బాలకోటేశ్వర తారావళి**
2. **ధ్యానాంజలి**
3. **మహోదయం**
4. **శివకేశవయుద్ధం** (నాటకం)
5. **కౌముది**
6. **రక్తాక్షి**

**(బి) అముద్రితాలు:**

7. **జయవిజయం** (నాటకం ప్రదర్శితం; ముద్రిత నాటకాలు కూడా ప్రదర్శనలైనవే)
8. **సమర సీమ** (రెండవ ప్రపంచయుద్ధం సందర్భంలో వ్రాసిన దేశభక్తి కావ్యం)
9. **మెహరున్నీసా** (చారిత్రక కావ్యం)
10. **వీరవిశ్వాసి పీటరు** (తోహర ఛందస్సు)

11. మహర్షి యోహాను -
12. ఆదాము శాపవిమోచనం యక్షగాన ప్రక్రియ (హరి) కథాగానం.
13. ప్రాణంతీసిన దానం (సాంఘిక నాటకం)
14. కుటుంబంలో కుంభకోణం (సాంఘిక నాటకం)
15. అమ్మలాంటి అక్కయ్య (సాంఘిక నాటకం) వగైరా.

**మరణం:** శ్రీ గుంటి కోటేశ్వరరావుగారు రత్నకవి అంతిమదర్శనంలో అత్తరు సీసా తెచ్చి రత్నకవి శరీరంపై చిలకరించి శ్రద్ధాంజలి ఘటించారు. ఆ అత్తరుకంటే ఆయన విడిచిన కన్నీరు మరింత పరిమళించింది. రత్నకవి ఉచ్ఛస్థితిని తలచుకొని : ''వైభవ దేవేంద్రుడై జీవించిన రత్నకవి చరమదశలో అపర శ్రీనాథుడై కడగండ్లు అనుభవించార'' ని ఏడుపులో పలవించి దుఃఖపడ్డారు. అలాగే విశ్వ హిందూ పరిషత్తు వారు రత్నకవిని సత్కరించిన నాటి పరామర్శలు చేశారు.

ఏది యేమైతేనేం చరమదశలో రత్నకవి బిడ్డల నిరాదరణకు గురియై ఒంటరితనంలో దుర్మరణం పాలయ్యారు. వారి దీనావస్థను ప్రతిబింబించే పద్యం ఒకటి వారి 'కన్నయ్య కన్నీటి పాట' అనే ఖండికనుండి ఇస్తున్నాను -

కం॥ భార్యావిధురాఘాతము
కార్య పరాఙ్ముఖుని జేయ కార్యోన్ముఖులే
కార్య మొనర్ప సమర్థులు
ధైర్యోత్సాహములు జారి తంకవ మొదవన్.
(తంకవము = శూన్యము)

ఇవన్నీ బాధాస్మృతులు. పశ్చాత్తాపాగ్నికీలలు.

ఉద్యోగాలనీ ఊళ్ళేలటమనీ యేవో సాకులతో దూరస్థులై పోయి, తల్లిదండ్రులలో అపురూపంగా అరుదుగా ఉండే ప్రత్యేక కళాసృజన సంపత్తులకు అండగా నిల్వలేకపోవడం బిడ్డల బాధ్యతారాహిత్యమనక తప్పదు. మౌఢ్య జీమూతాలు తొలగించుకొని వివేక భానూదయరేఖలై వచ్చే వేళకు ఎవరి సహాయాలూ అవసరంలేని స్థితిలోకి వారు వెళ్ళిపోవడం వీరి ముఖాన పేడకల్లాపి జల్లినట్టు కాకపోదు. కవి గారున్నప్పుడు ప్రసంగ వశాన రసనకొసల రవళింపజేసిన ఆర్యోక్తి జ్ఞప్తి జేసుకుంటూ ఈ వ్యాసాన్ని ముగిస్తున్నాను.

చితా చింతా సమే చింతా బిందుమాత్రే విశిష్యతి
చితా దహతి నిర్జీవం చింతాదహతి జీవినః

# శ్రీ గోవాడ బాలకోటీశ్వర తారావళి

— గోవాడ ఎస్.వి. రత్నకవి

సీ॥ శివుడంచు కొందరు సేవించెదరు నిన్ను
హరియంచు కొందరు స్మరణసేతు
రహహ వాగీశుడంచందురు కొందరు
నవనిజ భర్తవంచంద్రు కొంద
రల్లా యటంచును మహ్మదీయులు కొల్తు
క్రైస్తవుల్ 'క్రీస్తని' ప్రస్తుతింత్రు
గోవిందుడందురు కొందరు కొందరు
శాక్యబుద్ధుడని భజనమొనర్తు

గీ॥ రెవ్వరేరీతి నుతియింప నేమి నిన్ను
స్తుతియొనర్చెద నిన్నె విశ్రుత గుణాఢ్య
పూష సంకాశ! గోవాడపుర నివేశ!
బాలకోటీశ! పరమేశ! భవవినాశ!! 1

సీ॥ పంక విధ్వంసియౌ ఝుంకారిణీదేవి
శీర్షాగ్ర భాగాన జెలగుచుండ
నునుపారు నీదు నెన్నుదుట కుంకుమబొట్టు
వలె గాకకన్ను చెల్వారుచుండ
కడు విశాలంపు వక్షస్థలమ్మున నుగ్ర
ఫణిహారముల్ మహాప్రమదమొసగ
వామభాగమున బార్వతి సర్వమంగళ
చెలువుమీరగ నధిష్ఠించియుండ

భక్తజన దర్శనీయమై పరగునీదు
మూర్తి గొండాడెదన్ జగన్మోహనాంగ
పూష సంకాశ! గోవాడపుర నివేశ!
బాలకోటీశ! పరమేశ! భవవినాశ!! 2

సీ॥ అల గజేంద్రుని యార్తి నాలించి రక్షించి
నట్టి విష్ణుడ వీవటంచు నమ్మి
ప్రహ్లాదు బ్రోవ స్తంభమున జన్మించిన
అల నృసింహుడ వీవటంచు నమ్మి
గోవర్ధనంబెత్తి గోపాలురంబ్రోచి
నట్టి కృష్ణుడ వీవటంచు నమ్మి
ఇనజున కభయంబు నిచ్చి పాలించిన
యవనిజభర్త వీవనుచు నమ్మి

గీ॥ వందనంబిత్తు నీకు శర్వా! దయాబ్ధి!
ఎటుల పాలించెదో నన్ను నింకమీద
పూష సంకాశ! గోవాడపుర నివేశ!
బాలకోటీశ! పరమేశ! భవవినాశ!! 3

సీ॥ నిన్ను నే నామిత్రునిగ జేసికొన్నచో
శత్రువుండడుగదా జగతినింక
నా కంచు నమ్మి నీ నామస్మరణ సేయ
నిచ్చగించితి దయానిర్మలాత్మ
నా కలుషం బెంచబోక నీదు శరణ్య
మొసగవే ప్రీతి నమోఘచరిత
భవసాగర ప్లవంబా! జటాజూట! నే
నతిభక్తి ధ్యానింతునయ్య నీదు

గీ॥ ప్రాపు జూపుమ అఘజైత్ర! ఫాలనేత్ర!
ధవళకాయ! గిరీశ! భేదమ్ముతేల
పూష సంకాశ! గోవాడపుర నివేశ!
బాలకోటీశ! పరమేశ! భవవినాశ!! 4

సీ॥ నెలదారి! నీ నామమెలమిన్ స్మరించిన
బాపముల్వేన వేల్వాయునంచు
కలకంఠ నీదు సంస్మరణ జేసిన భవ
రోగము వసుధ నిర్మూలమంచు

అంబరకేశ! నిన్నతిప్రీతి జపియింప
బరసౌఖ్యముల నందవచ్చునంచు
అలికాక్ష! నిన్నెపు డలయక వినుతించి
పాపార్ణవము దాటవచ్చునంచు

గీ॥ దెల్పు విబుధు లింకేల సందేహమంచు
నిన్ను జేరితి బ్రోవుమా నీలకంఠ!
పూష సంకాశ! గోవాడపుర నివేశ!
బాలకోటీశ! పరమేశ! భవవినాశ!! 5

సీ॥ క్షితిలోన వేయేండ్లు బ్రతికె నీతండంచు
మరణంబు దయచేత మరువబోదు
ధనధాన్య సంపత్తి దనరు నీతండంచు
నెంచి మృత్యువు విసర్జించబోదు
చదురబ్ధి వలయిత జగదీశు డితడంచు
మరణాధి దేవత కరుణగనదు
స్వర్ణఖచిత హర్మ్యవాసి ఇతండంచు
మృత్యువు ప్రేమజూపించబోదు

గీ॥ నేడొ యెల్లియొ చావు వినిశ్చయమ్ము
ప్రోవుమిప్పుడె మమ్ముల భావజారి!
పూష సంకాశ! గోవాడపుర నివేశ!
బాలకోటీశ! పరమేశ! భవవినాశ!! 6

సీ॥ చేసితి బాపముల్ చేసితి భాగవ
తాపచారమ్ము లత్యధికముగను
సాహసమ్మున గూట సాక్ష్యముల్ పలికితి
బల్కి తబద్ధముల్ బహుళముగను
పర దైవతముల సేవలు చేసి చెడినట్టి
చెనటులతో బొత్తు జేసియుంటి
బరదారలన్గోరు పతితుల నేస్తము
చేసినాడను కృపాసింధు! నాకు

గీ॥ బుద్ధివచ్చె నికటు సేయబోను తండ్రి!
అంజలి ఘటింతు నీకె మృత్యుంజయుండ!
పూష సంకాశ! గోవాడపుర నివేశ!
బాలకోటీశ! పరమేశ! భవవినాశ!! 7

సీ॥ ఈతవచ్చునటంచు నెంచి యీ విశ్వసా
గరము నీదుటకయి కడగినాడ
అతుల దుఃఖాకరంబని నేరనైతిని
నడిమి భాగము జేరినాడ ఈశ!
కడు భయంకర తరంగ పరంపరలచేత
నటునిటు నూగుచున్నాను తండ్రి!
వేడితి బలువుర వేసారి కడకు నిన్
జేరి సాయముసేయ జీరుచుంటి

గీ॥ నీవె నా రక్షకుడ వంచు నెంచినాడ
దేలిచినను ముంచినను నీదే భరమ్ము
పూష సంకాశ! గోవాడపుర నివేశ!
బాలకోటీశ! పరమేశ! భవవినాశ!! 8

సీ॥ వసియించుటకు నీకు వాసంబు లేమిచే
వెండికొండను వాసముండె దీవు
ధరియింప నీకు వస్త్రములు లభింపమి
నేనికతోలు పైనూనెదీవు
చందనాదులు మేనలందగా గతిలేక
బూడిద బూయుచున్నాడవీవు.
కుడువ నోగిరము లేకుంటచే దింటివా
హ్లాదమ్ముతో హలాహలము నీవు

గీ॥ ఇట్టి గతిలేనివాడ వీవెట్టు నన్ను
బోషణము చేసెదోయి ప్రపూతచరిత
పూష సంకాశ! గోవాడపుర నివేశ!
బాలకోటీశ! పరమేశ! భవవినాశ!! 9

సీ॥ కడకు బిచ్చంబెత్తగా బాత్రదొరకమి
పునుక దాల్చిన పెద్ద ఘనుడవీవు
తినుట కన్నములేక ధనదుని యాశించి
మిత్రునివలె సదా మెలిగెదీవు
లలివిహారమ్ము సల్పగ వనమ్ములేక
మసనాన మట్టాడు మందుడీవు
పెనుజక్కిలేక నింపెసలారగా గిత్త
మీద నెక్కాడి మేటి జోదువీవు

గీ॥ ఇట్టి నిప్పచ్చరమ్మున నెసగు నిన్ను
నాశ్రయించుట పొరపాటు అలికనేత్ర!
పూష సంకాశ! గోవాడపుర నివేశ!
బాలకోటీశ! పరమేశ! భవవినాశ!! 10

సీ॥ కలదొక చింత నీ పొలతి తత్తడి నీదు
నాత్మజు జీల్చి చెండాడునంచు
గలదింక నొక చింత లలి నీ నగల్ నీదు
కొమరు వాహనము మ్రింగునను భీతి
ఇంకను గలదొక్క శంక నీ తేజిని
గిరిక హుమాయి మేగెడపునంచు
జివరకుం గలదొక్క చింత నీ సూనుని
జక్కి నీ నగలను జంపునంచు

గీ॥ జింతలన్నియు గుమిసూడి చేసె నీదు
తనువు సగము; నీ మగతనంబును సగంబు
ఇట్టివాడవు నన్నెట్టులేలగలవొ
పూష సంకాశ! గోవాడపుర నివేశ!
బాలకోటీశ! పరమేశ! భవవినాశ!! 11

* * *

# ధ్యానాంజలి

-బాలకవి ఎన్.వి. రత్నన్‌దాసు

ఉత్సర్జనము

శ్రీలజెన్నారు నేది విశేషముగను
ఏది విరహితాద్యంతమై యెసగునేది
నిరతిగా పురుషుల గావ బరిధవిల్లు
నట్టి పరతత్త్వమున కిత్తు నంకితమ్ము. 1

శ్రీమత్స్వర్గ సువర్ణ వర్ణ విలసత్సింహాసనాసీనుడై
శ్రీమద్భాను శతప్రకాశసముడై చిద్రూపుడై భక్తులన్
ప్రేమార్ద్రామల దృక్పరంపరలతో వీక్షించి పాలించు మా
శ్రీమేరీసుతు పాదకంజయుగళిన్ సేవింతు మోక్షార్థినై. 2

అరుదుగ నారు వాసరము లందొగి సర్వ చరాచరాళి సుం
దరతర తార పూష హిమధాముల ప్రీతి సృజించి సర్వదా
వరగుణ మండనుండవయి వర్ధిలుచుండెడి క్రీస్తుదేవ త్వ
చ్చరణ సరోరుహద్వయము సన్నుతి సేతు నభీష్టసిద్ధికై. 3

విలసిత మోక్షవైభవము వీడి వసుంధర సంభవించి పా
పుల గరుణార్ద్ర చేతమున బ్రోవగ కల్వరి భూధరమ్ము పై
సిలువను బ్రాణమీడిన విశేషకృపార్ద్రమనఃప్రసూన నిన్
కొలిచెద సర్వకాలము లకుంఠిత భక్తిని నిష్టసిద్ధికై. 4

తిరమౌబత్తి నిమేషకాలము నినున్ డెందాన జింతింప నీ
కరుణార్ద్రామల దృగ్వితానము శరత్కాలేందుబింబాస్యమున్
వరస్వర్ణద్యుతి మించు దేహలతికా వర్చస్సులున్ సత్కృపా
శరధీ! కన్నుల కట్టినట్లగుగదా సత్యస్వరూపీ! గుణో
త్కర! మేరమ్మకుమార! రత్నవర! స్వర్గాహ్లాద సంధాయకా! 5

* * *

# ఆగ్రహపర్జి

డా॥ ఆవంత్స సోమసుందర్

చెలియలి కట్టను దాటదు సాధారణంగా సముద్రం
నిర్బంధాల ఇనుపగోడల్ని అసాధారణంగా కూలుస్తుంది దరిద్రం
గునపాలు పట్టిన మొరటు చేతుల కెవరు చెప్పారో
బుల్లెట్లు పూస్తాయి! ఆయుధాలు కాస్తాయి!

నిరాశలో కూరుకుపోయిన నేటి వీరహస్తాలు
తరంగాలై గర్జించే దినం వస్తుంది!
ఇది నిజం! ఎంతకాలమో దాగదు నిజం!
సత్యం పున్నమి వెన్నెలలాగా కడలకు వ్యాపిస్తుంది!

ఇంత విశాలమైన బందిఖానా నిర్మించి
సంతసిస్తున్నాడేం వీడు?
గొంగళీల దాగిన అంటుపేల మాదిరిగా
విప్లవాల్ని మూసి పెడతాడేం వీడు?
గణాధిపా! సైరించరు సైరించరు సైరికులు!
పత్తి మిత్తికి దారి చూపదు!
కొత్త వత్తులు పేని చీకట్లు కాలుస్తుంది!

శ్రామికులు సైరనులై గర్జిస్తేనే చాలు
గుభిల్లుమంటాయి కోటల గుండెలు!
ఇది నిజం! ఎంతకాలమో దాగదు నిజం!
ఇంకెంతో దూరంలో లేదు-
ఎవడడ్డినా విరుగుతుంది నడ్డి!

ప్రణాళికతో పోటీగా పెంపొందిన దారిద్ర్య రేఖ
ఎలా కాగలదు దాటరాని లక్ష్మణరేఖ?
అన్నిటినీ చీల్చే దివ్యకాంతి చొచ్చుకు వచ్చే ముహూర్తం!
ఇంకెంతో దూరంలో ఉండదు! ఇదే రాగల నిజం!

అప్పుడీ దేశం పదుచుతనాలకు తొలగుతుంది వైధవ్యం!
దిద్దుకుంటాయి ఉదయాలు అరుణరేఖలను.

*(డా॥ ఆవంత్స సోమసుందర్‌గారు ఇటీవల ప్రచురించిన 'ఆమ్రపక్షి' కావ్యంలోని 18వ ఖండిక)*

* * *

# స్వాగత గీతిక

-డా॥ అమళ్ళదిన్నె వేంకటరమణప్రసాద్

ఓయి మానవుడా! హ్రాది నుబుకునట్టి
పూర్వులార్యుల మతతత్త్వబోధసుధల
నాచికొనుము; స్వధర్మము నణచు పనుల
చేకొనకుమయ్య మెచ్చదు చిత్రభాను. 1

దేవుని పేరు చెప్పుకొని ద్వేషము పుట్టు మతప్రసంగముల్
కావవు; సర్వరక్షకుని కారుణికత్వమరందమందుకో
బోవవు; ఆర్షధర్మపరిపూర్ణవచస్సుల ముక్తిమార్గమున్
భావన సేయలేవు; భవపాపవిశంకట మంతరించునే? 2

మతములు సర్వమానవ సమస్యల పెంచగరాదు; భావి జీ
విత పథ సంస్కృతుల్ దొరగి వీథుల రచ్చల పారరాదు, సం
తతము కులాభిమాన వితతస్థితి ఘూర్ణిత చిత్తసంగతిన్
వెతల మునుంగరాదు పదవీగరిమాతిశయంబు పెంపునన్. 3

మత మౌఢ్యమును రేపి మాటున దాగెడి
చెడుగు నడంపవే చిత్రభాను!
పరహిత తత్త్వంబు భారత దేశాన
స్థిరచిత్తమున నిల్పు చిత్రభాను!
ఒకరిపాడ మరొకనికి గిట్టనట్టి కు
త్సితమతి ద్రుంచవే చిత్రభాను!
అన్యమతస్థుల నాదరించెడి దివ్య
మైత్రిని పెంచవే చిత్రభాను!

ఓట్ల కొరకు తమ మతంబు నూరడించి
హృదయమందు లేని అపేక్ష నితరమతము
లందునం జూపెడి కుహనా లౌక్యగుణము
చీల్చవే రాజకీయాల చిత్రభాను! 4

అదిగోచూడుము చిత్రభాను మతతత్త్వాలోచనామగ్నయై
ఎదలోనుజ్జ్వల యుక్తవర్తనము దీపించన్ హితోపేత వా
క్సుధలన్ బంచుచు నెల్లవారలకు దిక్సూచిన్ ప్రసాదించుచున్
కదిలెన్ భారతధాత్రిపైకి మతరక్షాదీక్షకర్తవ్యయై. 5

టెలివిజన్ యాంకర్ల ''టెల్గు'' మాటలు తెచ్చు
చేటును మాన్పవే చిత్రభాను!
టెన్తుక్లాస్ ఇంటరు టీనేజి ప్రేమతో
సినామాలు దింపకే చిత్రభాను!
బబులుగమ్ గుట్కాలు పాన్‌పరాగ్ నమిలెడి
చెడుగు నడంచవే చిత్రభాను!
బాగోగులెంచక బాలకార్మికులతో
చేయించకే పని చిత్రభాను!

చిన్నపిల్లలు యువకులు కన్నియ లొక
ట గుమిగూడి ఆడెడి ఎకస్ట్రాల డాన్సు
పిచ్చిపాట లంత్యాక్షరీ వీరవిద్య
చీల్చి చెండాడ రావమ్మ చిత్రభాను! 6

## ఫలశ్రుతి

మతములకు మధ్య మమతల జతగ రమ్మ!
స్వాగతము చిత్రభాను! సుస్వాగతమ్మ !!

(నన్నయ భట్టారక పీఠం, తణుకువారు నిర్వహించిన
పద్యకవితల పోటీలో ప్రథమ బహుమతి పొందినది)

* * *

# జీవుని వేదన

- జి.వి.సుబ్బారావు

ఇదిరా! రామ! కబంధ ముక్తిపథ-మిందేమో విచిత్రమ్ముగా
వ్యథలే దోచెను తొల్తదొల్త! కవితావ్యాసంగ మీరీతిగా
మొదలై వేదనలందు, నాయెదను నిర్మోహోత్థ భావాబ్ధియై
సుదతీమానసగాథ-విన్పెడి- రసస్రోతస్వినీధారగా! 1

పూర్వజన్మ కృతము-పుణ్య సంస్కారమ్ము
లాటపట్టులయ్యె-నా కబంధు
నకు-విముక్తినొంద! నాకేమిగలదు?-క
విత్వతపము దప్ప-వెల్గులంద. 2

కరముల్ దున్మి-కబంధు చిత్తమున మీ కారుణ్య ధారాధునుల్
ఝురులై బొంగియు-ముక్తినొందగను-ఝంఝా మారుతప్రాయమై
వరసంస్కార చితాగ్నికీల-జ్వలియింపన్ దప్పదయ్యెన్ ప్రభూ!
మఱి, నాదైన మహో కబంధత-విడన్-మార్గమ్ము నీవేమురా! 3

మొండెము నాయహమ్ము, కరముల్-మమకారము, స్వార్థచింతనల్
నిండును కుక్షి-కామ రమణీయ పశూత్సవ వాంఛలందు! నా
గుండెలలోన చీకటులు! కూకటివ్రేళ్ళతో నీ కబంధునిః
ఖండన సేసి-రమ్యరసకావ్యతపమ్ముల వెల్గ బ్రోవవే! 4

స్ప్రష్టదివ్రాలె! కాలయముప్రోలికి లాగెడి ఇంద్రియాశ్వముల్
సద్దుమణంగె-కర్మపరిసర్పిత జీవన హేలలందునః!
బుద్ధియు సంచలించు! ధ్వనిపూర్య కవిత్వతపమ్ము-ప్రాతిభా
విద్ధ-రసప్రపంచముగ వెల్గగ-స్వామి! విముక్తి నీయవే! 5

నీడలు సాగె సంజలను-నిష్ఠుర జీవన మార్గమందు! పూ
బోడి విషాదగాథ-రసముల్ జిలికించు కవిత్వ గీతిగా

బాడెద నన్ను-నాతపము పండునొ నీ కథగాగ? నా జరా
పీడిత కంఠనిస్వనము ప్రీతియొనర్చునె సాహితీభువిన్? 6

శబరిని గాను,-నీ ప్రణయసంగతవాక్సుధ గ్రోలి దేలగన్?
అబలను గాను-నీ మధురహాసవికాసము దేలిపోవగన్!
ప్రబలిన మోహపాశములు, ప్రాక్తనజన్మల వాసనాధునుల్-
గుబులుకొనన్ దపించు-కవికుంజరుడన్! కృపతోడ బ్రోవవే! 7

ఏబది నిండినంత, యెద లేచెను వాంఛ -భవత్కథాసుధన్
ప్రాభవమొప్ప-రమ్యరసరాజ్యముగా, కవితాతపమ్ముగా
నే బలికింతునంచు-రమణీహృదయాంతరశోకవీణలన్!
ఏబది యర్వదయ్యె-కథలిట్టు లరణ్యములోన నిల్చెరా! 8

నీ యన్వేషణ సాగినట్లె-కవితానిర్దిష్టమార్గమ్ములో
నా యన్వేషణ సాగనిమ్ము! తపమానందానుసంధాయిగా,
శ్రేయోదాయకమౌ భవత్కథ-రసశ్రీరమ్యకావ్యాబ్ధిగా
శ్రీయోషామణి వేదనాధునిగ-నే-జిత్రింపగా బ్రోవుమా! 9

బంధములెల్ల గ్రమ్మగ-కబంధుడనైతిని రామచంద్ర! రా
గాంధుడ నౌచు, యింద్రియవిహారఝరిన్ వినిమగ్నునైతి! న
న్నుం దయజూడవే! రసమనోజ్ఞకవిత్వతపమ్ము పండి- కి
ష్కింధకు జేరునట్లు-పలికింపవె-సీతకథన్-కృపానిధీ! 10

నాదు వేదన-భావనా నదము లగుచు
జానకీ మనశ్శోక రసస్రవంతి
గలియు! రామకథాసుధ-కావ్యతపము
గా సృజింతు-భక్తిరస జగత్ప్రభావ! 11

ప్రతిభ యొక్కటి-భావనా ప్రాభవమున
కావ్య తపముగ, వేదనా గాంగఝరిగ,

వఱదలయ్యెడి నీ కృప-ధ్వని మనోజ్ఞ
రసజగత్తుగ సృజియింతు రామకథను 12

కాలమిది- ద్రిప్పనేర-వెన్కకును- ప్రభువ!
కాలమిది రాదు-కళ్ళెమ్ముగట్టి నడుప
కాలవశుడను-తపముగా కవిత వెలిగి-
రసజగత్తును సృష్టింప- రామ! బ్రోవు 13

శ్రీచక్రార్చన సేయలేను! కవితాశ్రీచక్ర యోగార్చనా
రోచిఃపుంజము-ప్రాతిభాత్తరసధారో దార భావాఢ్యమై-
శ్రీచాంద్రీమృదుకీర్తి-జానకి-వచః శ్రీరమ్య కావ్యమ్మునై-
వాచామానసకర్మ శుద్ధిగ- కవిత్వారాధనన్ జేసెదన్! 14

కుండలినీ ప్రసార వినిగూఢ పథమ్మున, చక్రవీథులన్
నిండుగ యోగమార్గమున- నిల్పగలేను! సహస్రపత్రముల్
బండు యశస్వినీ హృదయ బంధుర భావన నందలేను! నీ
యండతొ నా కవిత్వ తపమందెడి-రామకథల్-రఘూత్తమా! 15

యాతాయాత కవిత్వవాహినుల, సాయంసంధ్యలో- ప్రాతిభా
నీతమ్మైన రసార్ద్రనిర్ఝరులుగా, నీ రమ్య గాథాబ్ధిగా-
శ్రీతత్త్వప్రతిపాద్య కావ్యముగ-నే సృష్టింతురా! నూత్నమౌ
మాతామానస శోకగాథలివి! రామా! సామవేదప్రియా! 16

శ్రీపతీ! ''వినా దైన్యేన జీవన''-మ్మ
నుగ్రహింపవె! నీ కృపా నూత్న మధువు-
నా కవిత్వ తపము జిల్కి-నాదు రామ
గాథ-ప్రాతిభాత్తరసార్ద్రకథగ దీర్పు! 17

(ఇవి నా అముద్రిత 'శ్రీ సీతామనోరామాయణం' పద్య కావ్యంలో
అరణ్యకాండం, సీతాన్వేషణ ఖండాంతంలోని పద్యాలు)

* * *

సంస్కృత కవిత

# శివాద్వైతం

-ఇంద్రకంటి పినాకపాణి

హరారవింద పూజితః స్మరేణతస్య కింఫలం
కిరాతపాద తాడనే కరోషితస్య కింఫలమ్।
శిరోదురంత భారకృత్ ఝురీతి భాతి కారణం
చిరాత్తదేవ తిర్యగా చరన్న సీశ శంకర॥

సరి ద్రుద్దాపం దుఃఖం శిరసి భరితం పార రహితం
గలే పాశీభూతం దశనకుశలం కర్మ భుజగమ్।
శిరోధీర్దాహీచేత్యహమితి విషం జన్మ సహజం
శివోఽహం వాక్యేఽహం త్వభవమ భవప్రత్యయుతః॥

అహం భావబ్రహ్మే విసృజతి గురుం మానసజగత్
ప్రలోభాదివ్యాఘ్రం ప్రణయవిహగం ప్రీతికలితమ్।
విధేశ్శీర్షం మత్వా హరతు కృపయా పంచమమిదం
అహం బ్రహ్మేస్మిత్వం కలయతు విభో! సత్య సుగతిమ్॥

సంయాంతి శంకర జనాశ్చ మనోరుజాత్వాం
మత్వా మహాభిషజ మోషధినాథ ధృత్వాత్।
వ్యాధిం విహాయ జనఘాతుక వైద్యవత్త్వం
తేషాం మనః పటలమేవ లయా కరోషి॥

* * *

# స్వప్న శకలాలే నాకు ఆనవాలు

-డా॥ పెన్నా శివరామకృష్ణ

కాంక్షలన్నీ వీడ్కోలు చెప్పినవేళ నువ్వొచ్చావు
నా గుండెసవ్వడిలో నీ పదధ్వనిని విని

నలువైపులా వెర్రిగా వెదుకుతున్నవేళ
చెదిరిన గోవులను చేరబిలిచే వేణుగానంలా వచ్చావు

నిట్టూర్పుగాడ్పుల్లో ప్రాణజ్యోతి రెక్కలుకొట్టుకుంటున్నవేళ
రజనీగంధంలా నువ్వొచ్చావు
అరచేతుల్లో కాంతిలేని అగ్నిజ్వాలను మోసుకుతిరుగుతున్నవేళ
ఏమీ ఆశించని అతిథిలా వచ్చావు
గులకరాయిని ప్రవాహంలోకి విసిరినట్లు
విసుగుతో హృదయాన్ని విసిరికొట్టినవేళ
ఖండించటమే తప్ప జోడించటం తెలియని
జ్ఞానఖడ్గాన్ని శిలువలా మోసుకుతిరుగుతున్నవేళ వచ్చావు
హంపీసప్తస్వరమండపంలో, నీ సమక్షంలో
ఏస్తంభాన్ని మీటినా నీ పేరే ధ్వనించగా
నేనూ ఒకస్తంభాన్నైన వైనాన్ని గుర్తుచేస్తూ నువ్వొచ్చావు.

ముంగిట అంతిమ సహచరితో పరిహాసమాడుతూ
వయనమవుతున్నవేళ వచ్చావు
నిన్న నా చుట్టూ నిరీక్షణానిశీథి ఒక లోహకుడ్యం
నేడు కారుణ్యకాంతిపంజరం
నీ రాక నా కోసమేనా?
నీవు వీథిలో వెళుతుంటే నాకోసమేనని భ్రమించానా!

నీ క్రీడాసామగ్రిలో గ్రహరాశి ఒక అక్షపటం
నీ దరహాసం మౌన నిఘంటువు

నా ద్వారానికి ఒక స్వప్నపుష్పాన్ని అలంకరించి వెళుతున్నావు
వేసంగి గాడ్పులనుండి, శైశిర కరవాలాలనుండి
రక్షించుకుంటాను
చిరుకానుకలను సిద్ధంచేసుకొంటాను

నీవు తిరిగివచ్చేవరకు ఈ కుటీరం ఇలాగే ఉంటుందా?
స్వప్న శకలాలే నాకు ఆనవాలు.

# పెన్నానది

- ఈతకోట సుబ్బారావు

నాకు-
అమ్మా నాన్నలకు
తాత ముత్తాతలందరికీ
ఈమె తల్లి
మూకుమ్మడిగా కన్నతల్లి.

కన్నడ నందికొండల గర్భాన
చిగురించి
పులకరించి
రెండు రాష్ట్రాల నేలల
సంస్కృతి మాల అల్లి
మా మధ్య జీవనది అయింది కల్పవల్లి.

మా పుట్టుక ఆ ఒడిలో
బ్రతుకంతా ఆమె బడిలో
చావైనా ఆమె సన్నిధిలోనే!!
నీ వెక్కడినుంచి వస్తేనేం
నీరాక
మాకొక కల్పతరువు
మాకెప్పటికీ కామధేనువు.

నీ తాకిడితో పండిన వరి
మొలగొలకులు అయ్యాయి మరి
'నెల్లూరుబియ్యం'గా దేశప్రసిద్ధి.

మరో రాళ్ళుతిప్పగా
అందులో కప్పలుగా కాక
చైతన్యవంతులుగా

నాగరకతకు ప్రతిరూపంగా
ఉద్యమాలకు పుట్టినిల్లుగా
ఆదర్శవంతులుగా మలిచావు.

పాడిపంటలకు
సిరిసంపదలకు
ధ్రువతారలా నిలిపావు.

సుదూర తీరంలో
ఉగ్గుపాలు తాగినా
దాటుకుంటూ మూడు సంస్కృతులను
అధిగమించావు విభిన్న దృక్పథాలను.

అనంతపురం జిల్లాలో-
వేటకొడవళ్ళ సంస్కృతిని,
కడప జిల్లాలో-
మరింత ఆధునికతతో కూడిన
బాంబుల వలయాన్ని ఛేదించుకుంటూ
విస్తీర్ణంలో
పారుదల్లో
అగ్రతాంబూలంతో
సంస్కృతి సమారాధనలో
నెల్లూరు జిల్లాకు
నీ స్వేదంతో
నీ బిందువులతో
నవనాగరకతను
నాజూకును రంగరించి పోశావు.

సాహితీ పిపాసువుల సమాదరణలో
యశశ్చంద్రికలఛాయ నింపావు.

తెలుగు నుడికారానికి
ఇంపుసొంపులను సమకూర్చిన
మహాకవి తిక్కన-
మహాభారత పర్వాలను చెక్కింది
నీ అలల మధ్యనే!
సాహితీ సామ్రాజ్యంలో
సార్వభౌమాధికారంగల శ్రీనాథుడు.
గుడ్లూరు శంభుదాసుడైన ఎఱ్ఱన,
ముగ్ధమనోహరంగా
రామకథ నాలపించిన మొల్ల,
జక్కన,
పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు
మారన,
గోపీనాథము వెంకటకవులు
పౌరుషాగ్నికి మారుపేరైన ఖడ్గతిక్కన
నీ చల్లతో
నీ చలువతో
వెలుగొందిన నక్షత్రాలు.

ఈ ఆధునికయుగంలో కూడా
ఉద్దండ పండితులు
వేదం వేంకటరాయశాస్త్రి
ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బారావు
కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మ
కవికోకిల దువ్వూరి రామిరెడ్డి
దీపాల పిచ్చయ్యశాస్త్రి
ఎందరికో-
మహానుభావులెందరికో
మాతృస్తన్యమిచ్చావు.
బెజవాడ, బంగోరె

మరుపూరు కోదండరామిరెడ్డిల
సాహితీ సౌరభాలను వెలికితీసింది
వెలుగుచూడటానికి కారణం
నీ జలపాతం కాదా!
సాక్షాత్తూ-
ఆ పరమశివుడి త్రిశూలం మొన తగిలి
ఉదయించి
పినాకినీ నామధేయంగల నీవు
కొండకోనలతో ఎన్కౌంటరు జరుపుకుంటూ
విస్ఫోటనంలా పెల్లుబుకుతున్న
నీలో ఎందుకమ్మా ఈ మార్పు?
ఎందుకు తల్లీ ఆగ్రహం?

పరవళ్ళతో-
ఉగ్రరూపం దాల్చే నీవు
ఒట్టిపోయి
ఉత్తిచేతులు చూపితే ఎలా?
ఆ ప్రవాహం ఏదీ?
ఆ పరవళ్ళు ఏవీ?
ఆ రోజుల్లో-
విజయనగర సామ్రాజ్యానికి
రక్షణకవచంలా నిలిచావు.

సబర్మతీనదీతీరం తర్వాత
గాంధీతాత
స్వయంగా వచ్చి, మెచ్చి
స్వాతంత్ర్య సమరశంఖం
పూరిస్తూ
నీ నదీతీరాన నిర్మించిందే
పల్లెపాడు గాంధీఆశ్రయం.

ఆ తావునే రూపుదిద్దుకుంది
ఆంగ్లేయుల వ్యతిరేక యుద్ధం.

నీ శివతాండవానికి
నెల్లూరు నేలమట్టం అని
కొందరు భయభ్రాంతులు సృష్టించినా
నిన్ను-
నమ్ముకొని
ప్రశాంతంగా నిద్రిస్తున్నారు కదా!

ఈ పరీవాహకాన పుట్టిన ప్రతిబిడ్డా
చివరకు-
ఇసుక రేణువై
నీలోనే నిద్రిస్తున్నారు.
అందుకే-
ఒక్కో కథ చెబుతుంది
ఇక్కడి ఒక్కొక్క రేణువు.

ఒక్కో చరిత్రనూ వినిపిస్తుంది
ఒక్కొక్క ఇసుక తిన్నెల సానువు.

మా-
శ్వాసనిశ్వాసల్లో నీవే అయి
అణువణువున నీవే నడిపిస్తూ
లక్షలాది బీడుభూముల్ని
మాగాణి పొలాలుగా చేస్తూ
శతాబ్దాలనుండి
సస్యశ్యామలం చేస్తున్నా నీవు
ఎందుకమ్మా వహించావు మౌనం?
ఎందుకీ అగ్ని కినుక గానం?

ఎందుకు తల్లీ-
ఎండిపోయిన మానువైనావు?

వెన్నెముక లేని
ఎముకల గూడువైనావు?
సువాసన లేని
గంధపుమానువైనావు?
నీ పరవళ్ళు ఏవీ?
నీ ప్రవాహం ఏదీ?
ఎప్పుడో-
చిన్నప్పటినుంచి
కలగానే ఉంది
అదీ కాలం చేసిన కల అయింది.

ఆ హొయలు సోయగాలు ఏవి?
ఆ తుళ్ళింతలు ఉరుకులు పరుగులేవి?
నీ ప్రవాహంలో-
పున్నమిచంద్రుణ్ణి చూడాలి.

నీ పరవళ్ళలో-
సూర్యనమస్కారం చేసుకోవాలి
నిండు ముత్తైదువులా
నిన్ను చూసుకోవాలని ఉంది.

ఎప్పుడో గతించిన
అమ్మమ్మలు, నానమ్మలను
నీలో చూచుకోవాలని ఉంది!

* * *

వచనాల గీతాల తాత్త్విక కావ్యం

# శ్రీ గీతా

డా॥ మిరియాల రామకృష్ణ

ఒకటి

అర్జునుణ్ణి అడుగుదాం
అతడి చిరునామా
అమరేంద్రుని దగ్గర లేదట
అతడి ప్రొఫైలు.

అసురవైరి వద్ద
అన్వేషిద్దాం;
అతడి రికార్డు...
ఆనందం గురించి.

రథం పరుగెడుతోంది
రణ స్థలంలో.
అక్కడే రావాలా
అనవసరంగా దుఃఖం?

నిర్వేదం ముంచుకొస్తే,
నీ శత్రువానందిస్తాడు.
దుఃఖం పొంగిపొర్లితే
దుష్టుడు విజృంభిస్తాడు.

దయనీయ స్థితిలో
ధైర్యం వైద్యంలాంటిది
తిమిరం కమ్ముకుంటే
దీపంలాంటిది గొప్పమాట.

ఆత్మ విశ్వాసాన్ని
అరణ్యంతో పోల్చను
తగలబడిపోతున్న
తరులతలెన్నో చూశాను

ఆప్త వచనం
అద్భుత వర్షం లాంటిది.
మబ్బులు కూడా విదేశాలు
మరోమారు చూసి వస్తాయి.

కాలం ఊయల్లాంటిది
కదులుతూ ఉంటుంది...
ఋతువులోంచి
ఋతువులోకి నిరంతరం.

ఎండలు చల్లారుతూంటే
ఎంతగానో చూస్తాం..
వానలు కురుస్తాయని
వరసగా పొలాల్లో.

జీవితం యుద్ధంలాంటిదే
భావాలనేకం
భేరీల్లా మ్రోగుతూంటాయి.
భీరుత్వం పనికిరాదు.

తరంగిణిగా మారుతుంది
తడబాటులేని వర్షం.
పరిసరాల్ని ముంచేస్తుందని
పారిపోవడం ప్రజ్ఞకాదు.

భయ రాహిత్యం కోసం
పఠించండి సాహిత్యం
విషాదయోగం చదవడం
వివేకం పుణికి పుచ్చుకోడానికే.

విపత్తు నుంచి తప్పించడానికి
విద్యా వైద్యాలు రెండూ
ముందుకొస్తూనే ఉంటాయి.
అందుకోగలగాలంతే

శస్త్రచికిత్స చేసేవాళ్ళు
శతాధికంగా కావాలి
ప్రకటన జారీచేశాం
పత్రికలన్నింటిలోనూ.

లయగ్రాహి వృత్తాలు
బయోడేటాలు
అనుష్టుప్పులు చాలు
అవసరం తీరేందుకు.

కథని కాస్త ముందుకు
కదిలించండి
రంగులేస్తూ కూచోక
రసప్రాధాన్య మివ్వండి.

గతమంటూ కొంత
గతించినప్పుడే
అనుభవం కదలివచ్చి
అద్భుత కావ్యమవుతుంది.

ఒకదాని తర్వాత
ఒకటిగా వచ్చే ఊహ
జ్ఞానంగా మారి
గానంగా ప్రవహిస్తుంది.

విశ్లేషించుకోవడం
విజ్ఞుడి స్వభావం
ఎవరో చెప్పడం
ఎంతవరకూ సాధ్యం?

కారణం లేనప్పుడు
కార్యం జరగదు
కార్యం జరిగాకా
కారణం తెలుస్తుంది.

చిక్కని మీగడకు
చిక్కని పాలుండాలి
పాలకోసం గోవులు
పరమాత్ముడా గోవులకోసం.

మనం త్రికాలవేదులం కాము
మనకి కొంతగతం ఉంది.
గతంలో కొంత అనుభవం
గ్రంథమేదైనా అదే.

రాజ్యం పొంది
రమ్యంగా సుఖించాలని
లోభం పెంచుకుంటాం
లోలోపల మనం

సొంత మనుష్యుల్ని కూడా
సుంత కనికరం లేకుండా
లేపేయాలంటుంది
కోపం వచ్చికూచుని

"అహో బత మహత్పాపం
కర్తుం వ్యవసితా వయం
యద్రాజ్య సుఖలోభేన
హంతు స్వజన ముద్యతాః"

రెండు

అరవిందాల్ని కూడా
అవమానించే కళ్ళు
అభిమానిస్తున్నాయి
ఆలోచనా పరంపరల్ని.

అనుకోవచ్చు మనం
అక్షి యుగళంలో
ప్రజ్ఞా రేఖలు
ప్రారంభమవుతాయని

పెద్ద పెద్ద కళ్ళుంటే మాత్రం
పెద్ద మనిషి అని
ప్రతీ ప్రతిమనీ
ప్రమాణీకరించలేం

చూపుల గద్దలు
చూడబడుతూనే ఉంటారు
దృశ్యవేదికల మీద
దోషాల నుచ్చరిస్తూ.

సమాజాన్ని చూస్తున్నాం
సముద్రంలాగా ఉంటుంది.
ప్రభంజనాల్ని దానిమీదికి
పంపిస్తున్న వాళ్లెవరు?

కష్టాల ప్రారంభాలకు
కారణాలెక్కడున్నాయి;
ఎవరికి మనం పెత్తనమిచ్చి
ఇరుక్కున్నామో చూసుకోండి.

గతకాలం మొదట్లోనే
గందర గోళాలున్నాయి
నాందీ ప్రస్తావనల్లోనే
నరుడు గాయపడ్డం ఉంది.

కళ్ళులేని వాడికి కూడా
కాలం యొక్క రూపం
సరాసరి వర్ణించి చూపే
సంజయు డొక డుంటాడు.

అరవిందాల్లాంటి కళ్లకు
అధికారం స్వతస్సిద్ధం.
నయనాలు పెద్దవి అని
నాయకుల మంటారు కొందరు.

కళ్ళు పెద్దవే కావచ్చు
గవాక్షాలు లేని లోగిళ్ళ
వాకిళ్ళలో ద్వేషాలు
వాసనలు కొడుతున్నాయి.

మరిచిపోలేదు మనం
మన గాథలు పాతవి.
మరిచిపోతూ ఉంటాం
మహాభారతం మోసుకోవడం

ఆకాశానికి కెగిరేటంత
అసురశక్తి ఉంది మనకు.
అవకాశాలు వెదుక్కునే
అమృతయుక్తి ఉందా మనలో?

ఆచరించడానికి కాస్త శక్తి
అనుభవించడానికి కొంత రసం
ఉన్నాయి చాలు కదా అన్నాం మనం
ఉండాల్సింది యుక్తి అన్నాడతను.

కాస్త నలుపు కాస్త ఎరుపు
కావాలనుకున్నాం మనం
అవి శక్తికీ రక్తికీ చాలట
అసలు కావాల్సింది తెలుపేనట.

కోల్పోవడం వల్ల నష్టం లేదు
కొన్ని కోరికలనైనా
వాంఛలు పెరిగిన కొద్దీ
వమనంగా వచ్చేది దుఃఖమే

అదృష్టమే నీకు ప్రాప్తిస్తే
అధర్మం మీద అతికోపం
యుక్తి లేని కోపం వల్ల
శక్తి అంతా దగ్ధమవుతుంది.

కంటి చివర విషాదం
కన్నీరై నిన్నే తడుపుతుంది
వీక్షణాంతాలకు
వివేచన కవచమౌతుంది.

పాపాయిల మయినట్లుగానే
పడుచువాళ్ల మయ్యాం
పడుచువాళ్ల మయినట్లుగానే
పరమవృద్ధులం కాబోతున్నాం

కొన్ని సంఘటనలు చూస్తూంటే
కొన్ని జన్మల క్రింద
ఉన్నా మేమో అనిపిస్తుంది
ఉన్నాయేమో మరిన్ని దశలు?

కౌగలించుకోవాలనిపిస్తుంది
ఆగి కొందరిని చూస్తే
ఏమి జ్ఞాపకాలొచ్చాయో
ఈ యింద్రియాలకు పాపం?

రూపాయి కూడా లేనప్పుడు
రోగం ముంచుకొస్తే
నాకు నేనే వైద్యుణ్ణి
నా ధైర్యం నా ఔషధం

సమ దుఃఖ సుఖుడని
సమాస మొకటి ఉంది
మరచిపోతే ఎలా దాన్ని?
మాటలేరావు వేదికమీద!

అబ్బబ్బా గ్రీష్మమనుకున్న
ఆ నోటి మాటలే
ఊహూహూ హేమంతమనే
ఊహలుగా మారుతాయి.

అంతటా ఉన్న జీవశక్తిని
ఆఖరు చేసే వాడున్నాడా?
ఆ భయమే అక్కర్లేదు...
అణ్వస్త్రాలెన్ని తయారైనా.

ఏ సన్మానం చేసినా
ఇంచుక నూలు పోగివ్వండి.
కొత్తచొక్కా తొడుక్కుని
కొత్తజన్మ నెత్తుతూంటాను.

నేను వచ్చి డెబ్భైయేళ్లు
ఔనులే నువ్వొచ్చి ఇరవయ్యేళ్లే
ఆయుర్దాయం సంగతెవరికి తెలుసు?
అవగాహన ఒకటే గీటురాయి.

ఎవరి స్వభావాన్ని వారు
అవగాహన చేసుకుంటే
అంతకు మించిన జ్ఞానం
ఆ శివుడికైనా ఉండదు.

''సుఖదుఃఖే సమే కృత్వా
లాభాలాభౌ జయాజయౌ
తతో యుద్ధాయ యుజ్యస్వ
నైవం పాప మవాప్స్యసి.''

ఆయన వద్ద డబ్బు చేరింది;
ఆలోచించడం మానేశాడు
అది అతని బుద్ధి తప్పే కానీ
ఐశ్వర్యంవలన దోషం కాదు.

నేను నా బుద్ధికి
నియమాలు విధించుకుంటాను
నా ఐశ్వర్యం
నానార్థ నిఘంటువులాంటిది.

గొప్ప కవిత్వం రాయాలని
కోరిక నాకు కొండంతుంది
గొప్పది కాక పోవచ్చు
ఎప్పటికీ రాస్తూనే ఉంటాను.

నువ్వు సమర్థుడివి అంటే
పువ్వులు పూయగలను నేను.

చేతకానివాడివనే విమర్శ
చేతకానివాడే చేస్తే పోనీలే.

ఆత్మన్యేవ ఆత్మనాతుష్టుడు
అవుతున్నాడు స్థితప్రజ్ఞుడు.
సమకాలంలో ఎవడున్నాడా అని
శ్రమపడి నే నన్వేషిస్తున్నాను.

నన్నభినందించండి లేదా
నన్నభిశంసించండి
ఇన్నాళ్లకు చెబుతున్నాను
ఏదైనా నా కిష్టమే

వీతరాగ భయక్రోధుడికోసం
వీథివీథులా వెదుకుతున్నాను
మహానుభావుల మనుకునే వారంతా
గ్రహాగ్రహాలకు గురయ్యేఉన్నారు.

కూర్మావతారాలకోసం
కోరికగా వెదుకుతున్నాను
మంథర గిరి కింద ఉండే
మహత్తు మాకు లేదన్నారంతా

''సంగాత్ సంజాయతే కామః
కామాత్ క్రోధోఽభిజాయతే...
స్మృతిభ్రంశాత్ బుద్ధినాశో
బుద్ధి నాశాత్ ప్రణశ్యతి.''

విజ్ఞాన మెంతుందో
వినయమంత ఉందతనికి
మనస్సు ప్రశాంతంగా ఉంది.
మహాత్ముడవుతున్నాడతను.

భావించి, భావించి అందరినీ
పలుకరిస్తాడతను
పరవశులైపోయి అంతా
ప్రవహిస్తా రతని ముందు.

పాటచ్చరమేనట
ప్రతి ఇంద్రియమూ
ప్రజ్ఞ అంటే ఎలాంటిది?
బంగారు దుఖాణం మరి.

వాసన తగిలితే
మూసుకోవేం ముక్కుని
కాస్త నిగ్రహించుకోగల్గితే
కాగలం ప్రజ్ఞావంతులం.

అందరూ గుళ్ళులో ఉంటారు;
అతను చదువుకుంటాడు
అందరూ పరుగెడుతూంటారు
అతను హాయిగా నిద్రిస్తాడు.

## మూడు

ఆ వేణు వూదుతూ నిలబడ్డ
ఆ విగ్రహం ఆ గుళ్ళో ఉంది.
శిలకాదది శిల్పం.
శేముషి, కృషి శిల్పిదే.

శిలను శిల్పం చేయాలనే
కల వచ్చిందతనికి.
ఎంత చిన్నవీ చేతులు
ఏమయినా చేయగలవు.

జ్ఞానం ఆచరణలో
మౌనం వహించదు.
ధ్యానం తరువాతనే
గానం మొదలవుతుంది.

నెమలి పింఛం
నిమిరి చూడండి.
మీరు మీరు కాకుండా
మీలో మార్పొస్తుంది.

బ్రహ్మావిద్య అంటే అదేం
రహస్యమైంది కాదు.
మనసులోని ఒక భావనకు
మహాకృతి కల్పించడమే.

ఏమీ చేయకుండా కూచోడం
ఏమి చేయలేనితనానికి
తీసుకెళ్ళి కూచోపెడితే
మోసుకోడం కష్టం శరీరాన్ని.

అన్నం తినకూడదని
అనుకున్నాడతను
ఆకలి రావడం మానేస్తుందా?
ఆఖరి కెవరిది విజయం?

(సశేషం)

* * *

# ఇంద్రకంటి పినాకపాణి కవితలు

## 1 పిక్నిక్

అనుకున్నాం కదా అని
నలుగురు వాహక మిత్రులతో పాటు
నా దేహమూ బయలుదేరుతుంది
అంతశ్శూన్యం
కారు పరిమాణంలోకి కుదించుకుపోయి
కనరాని కారడవుల్లోకి దూసుకు పోతుంది.
ప్రక్కనున్న చైతన్యం
ప్రకృతి అందాలకు పరవశించి
అరే బాస్ - అలా చూడు
అని అత్యుత్సహించి
మనస్సమాధి నుండి
మనం లేవక మునుపే
ప్చ్! **Next time better luck**
అని పెదవి విరుస్తుంది
ఉన్నట్టుండి మొదలైన
రాక్సంగీతపు రణగొణ ధ్వనికి
ఉలిక్కిపడి లేచిన మనస్సు
అనెస్తీషియా ఇచ్చిన ఆమ్నీషియా పేషంటులా
మళ్ళీ తమస్సు తాబేటి చిప్పలోకి ముడుచుకు పోతుంది
బాసూ - ఎక్కడున్నావు నీవని
భుజాలు కుదిపే అరుపుకు
చింతాకాంతారంలో
సంతోష కాంతతో షికారు కొడుతున్నానన్నది
సిగ్గులేని సమాధాన మౌతుంది

## 2. ఒసామా బిన్ లాడెన్

ఓ ఓ ఓ ఒసామా!
విషము మారణ వ్యూహాల్లో అసమా!!
ఏమిటి నీ తత్త్వం?
ఏమిటి నీ పైత్యం?
WTO పై నీ వీరంగంలో
కుప్పలు పడ్డ పీనుగులు చూచి
అల్లా హర్షిస్తాడా?
లేక
ఆఫ్ఘనిస్థాన్‌లో
స్వేచ్ఛాపవనాలకు పులకించి
విద్యాలయాల చెట్ల గుబుర్లలోకి
తిరిగి చేరుతున్న
పులుగుల్లాంటి పిల్లలను
చూచి దీవెనలు వర్షిస్తాడా?

ఓ ఓ ఓ ఒసామా!
మానవరూపంలో ఉన్న యముని పసరమా!!
ఏమిటి నీ ఫిలాసఫీ?
ఏమిటి నీ సైకాలజీ?
నీ మాటల మూటలకు
మైమరచి
ఇంతమంది యువకులు
నీ వెంట ఉన్నారనుకున్నావా?
వారిని నీ వెంట నడిపిస్తున్నది
నీ తుపాకులు, వారి దారిద్ర్యమే కాని
నీ మత ప్రవచనాలు కాదు!
ఓ ఓ ఓ ఒసామా!

యావత్ప్రపంచం పాలిటి
పిశాచమా!!
ఏమిటి నీ ధైర్యం?
ఏమిటి నీ ధౌర్త్యం?
యువకులకు
పవిత్రయుద్ధపు పురెక్కించి
నీవు
తోరాబోరా కలుగుల్లోకి
తోక ముడుస్తావా!
నీది పవిత్రయుద్ధం!
ముందుండి దారి చూపలేనప్పుడు
దానికంటే
అపవిత్ర శాంతి మంచిది!!

* * * * *

జగములు గజగజలాడెన్
అగణిత మానవ సమూహమసువులు వీడెన్
పగతో నరబాంబులు కడు
పొగరుగ సంధించినావుపో బిన్ లాడెన్!

ఎవరికి ఏమిటి వూడెన్
చివరికి సింహము ముందు చిట్టెలు కోడెన్
భువనములు తిరుగుచున్ ఇటు
లవస్థపాలైతి కూలె లాడెన్ నీ 'డెన్'!

జగములు కువకువలాడెన్
మగధీర మహమ్మదీయ స్మశ్రువు లూడెన్
మగువల బ్యూటీపార్ల
ర్ల గౌరవము తిరిగి హెచ్చె రాక్షస లాడెన్!

*(శ్రీరస కవితా గోష్ఠి, బెంగుళూరు, 26-1-2002)*

## 3. కవికులాలు

గుజరాత్ గాయం
వాసన తగిలీ తగలగానే
కవికులాలు
ముక్కులు నూరుతూ వచ్చి వాలాయి
'అంగవ్రాతమునన్ సుశిక్షకులలా'
గాయం మాన్పబోయి
మరింత పెద్దది చేసినట్లున్నాయి

గుజరాత్ గాయం
మంటలు రేగీ రేగగానే
కవికులాలు
రెక్కలు కట్టుక వచ్చి వాలాయి
పక్ష వింజామరలతో
అగ్నిని ఆర్పబోయి
ఇంకా ఎగదోసినట్లున్నాయి!

* * *

# డా॥ మామిళ్ళపల్లి రమాదేవి కవితలు

## 1. తడిసిన చినుకు

వానచినుకుతో తడిసిన 'మట్టి' పరిమళం
ప్రకృతి హావభావ సంపదని
వెలుగుపూలు విరజిమ్మే వసంతమై
చిలికింది పులకింత సంతకం పుడమిపై.

## 2. జాబిలి

తనువంతా కోరికల కొలను చేసి
అందులో నెలవంకలా నిన్నుంచి

రేయి - హాయిలా నిన్నందుకోనా?
వెన్నెల సోనలా నిన్నల్లుకోనా?

## 3. Welcome

అణువణువును ఆలయం చేసి
దైవమై రమ్మని వేడినా
రా, రాలేనంటున్న ఆప్తబంధువా!
ఈ స్నేహ సేతువుపై ఓర్పే ఓదార్పుగా
అలసి సొలసిన అంతరంగానికి
మధుమాసపు మంచి ఘడియల్లో
మనోవేదనే మంగళ వాద్యమై
ఉచితానుచిత ఆలోచనలు
శుభ శకునాలై ఎదురు రానీ!
కాలమే జోలపాటై
హాయిగా నను నిదురపోనీ!!

*(''హితైషి'' అనే కలంపేరుతో ఇటీవల వెలువడిన*
*'ఇంద్ర ధనుస్సు' అనే కవితా సంపుటినుండి)*

* * *

# స్వభాను ఉగాది

## 1. ఉగాది శుభాభివందనములు

మ్రోడు వారిన తరువుల పూల నింపి
జగతి కంతయు శోభను సంతరించి
నవకమును పుక్కిలించెను నవ యుగాది
స్వాగతింపగ రండు 'స్వభాను' నిపుడు!

డా॥ కోడూరు ప్రభాకరరెడ్డి
ప్రొద్దుటూరు

## 2. ఉగాది ఆశీస్సు

పాడి తప్పని మీకు మీ బంధు తతికి
సర్వశుభముల నిడుగాత! సకల యశము
ఆయురారోగ్య భోగభాగ్యముల నిచ్చి
పరగఁబోచు 'స్వభాను' సంవత్సరంబు!
మఱువకుడు మిత్రసత్తమున్ మదిని నెపుడు!

– పెద్ది సత్యనారాయణ, బెంగుళూరు

## 3. సాహిత్య పచ్చడి

ది
ఉగాది ఆఫ్ దిస్ ఇయర్
సుఖ్‌సే వంచిత్ కరేగీ
కించిదపి నుక్సాన్ బ్రింగేగీ
తుమ్‌కో నెవ్వర్ మైడియర్
యువర్స్
ఇయరింగ్లీ అండ్ ఇయరింగ్లీ!
(Earingly and Yearingly/Hearingly)
ఏవం శతసహస్ర శుభాకాంక్షీ!

–పిశుపాటి ఉమామహేశ్వరం, హైదరాబాద్

## 4. ఆత్మీయత

అక్షర స్పర్శ
ఆత్మీయ స్నేహం
హద్దులులేని
అవని అనంతం
''స్వభావ'' అమృతం
పచ్చదైన, పరమాన్నమైన

పచ్చని తోరణమైన
మంగళవాద్యమైన
కోకిల రాగమైన
స్వాగతానికి నీ స్పర్శకి
తన్మయత్వమే!!

– నమిలికొండ బాలకిషన్‌రావు, వరంగల్లు

* * *

అనువాద కవిత:

# సద్దాం హుస్సేన్ యుద్ధకవిత

## నీ కత్తి దూయి ...

నీ కత్తిదూయి ... నిర్భీతిగా, నిస్సంకోచంగా ...
నీ కత్తిదూయి ... సైతాను కళ్ళు మిరుమిట్లు గొలిపేలా ...
నీ కత్తి దూయి ... కణకణలాడుతున్నాడు శత్రువు
కాకలు తీరిన వీరుడు మాత్రమే అతన్ని జయించగలడు.
గుణ్డాలను పూన్చి, శత్రువుపై సంధించు
వాళ్ళ సరంభంలోనూ మన ఆశలు సజీవం
రాత్రి అగ్నిలో మెరుపులు మెరవనీ ...
అప్పుడే ... అప్పుడే
సత్యం ఆవిష్కృతమవుతుంది.
అన్యాయం ఓడిపోతుంది.
చీకట్లు ముసురుకుంటున్న వేళ మెరుపులా మెరువు
కాగడాలు మసకబారిన చోట, ఆరిపోతున్న చోట
నీ కరవాల కాంతి వెదచల్లు ... అగ్నికీలలను ఎగదోయి ...
నీచమైన ప్రక్కవాద్యగాళ్ళ భయోత్పాతంలో
నీ కత్తి దూసి మెరిపించు ...
దీక్షాకంకణుడైన మనిషి తప్ప మరే విజేత లేడు.
ప్రతిస్తంభం మీదా జెండా ఎగరేయి!

దేవుణ్ణి ప్రార్థించు ...
గాయం మానుతుంది ...!

-అనుసృజన: ఎ.ఎస్.

(-ఆంధ్రజ్యోతి దినపత్రిక, యుద్ధకాండ, శనివారం 22, మార్చి 2003 సౌజన్యంతో...)

* * *

*English Poetry:*

# *SONGS OF LAMENTATIONS*

*How lonely sits the city that*
*once was full of people!*
*How like a widow she has*
*become, she that was*
*Great among the nations!*
*She that was a princess*
*Among the provinces has*
*become a vassal*
*The young and the old are lying*
*On the ground in the streets;*
*my young women*
*And my young men*
*have fallen by the sword;*
*In the day of your anger*
*you have killed them,*
*Slaughtering without mercy.*
*In its palaces, where the festivities*
*of the land took place,*
*the people lay in heaps ....*

*(These are the verses from the 'Songs of Lamentations', which were recited on days of fasting and mourning about 2100 B.C. in the Fertile Crescent, the land astride Tigris and Euphrates, today called Iraq). - (Courtesy: Deccan Herald, April 20, 2003)*

అనుబంధం

# అభినందన మందార హారం

## ప్రసిద్ధ పారిశ్రామికవేత్త, శ్రీనివాసాట్రస్టు అధినేత 'దాన చింతామణి'

# శ్రీ దళవాయి కృష్ణస్వామి ఆదికేశవులుగారికి

## షష్టిపూర్తి అభినందన పద్యావళి

(గత సంచిక తరువాయి)

---

బెంగుళూరులోని ప్రముఖ పారిశ్రామికవేత్త, సాహిత్య రసికుడు, మహాభక్తుడు, దాన రాధేయుడు, శ్రీ దళవాయి కృష్ణస్వామి ఆదికేశవులుగారి షష్టిపూర్తి మహోత్సవ శుభసమయమున సమర్పించిన -

# ఆశీరభినందన పద్యకుసుమోపహారము

-'అవధాన కళాభారతి' - 'ఆశుకవి చక్రవర్తి'
శ్రీ బులుసు వేంకటరామమూర్తి, రాజమండ్రి

ఉ. శ్రీ 'దళవాయి' వంశము విశిష్ట యశంబును గాంచు రీతి సం
పాదన చేసి నావు బహుభంగుల కీర్తిని దానధర్మముల్
సాదర మొప్ప సల్పితివి జాతికి చక్కని జీవగఱ్ఱవై
నీదగు షష్టిపూర్తి గణనీయత నందుత బెంగుళూరునన్! 1

మ. అవలోకింపగ సర్వదేవతలు నీ కాశీస్సు లందించి స
త్కవులున్, పండితులున్, హితావళి శుభాకాంక్షల్ సమర్పింప సం
స్తవనీయా! 'దళవాయి' వంశ భవ 'కృష్ణస్వామి శ్రీ ఆదికే
శవ' వర్ధిల్లుము నూఱు వర్షములు విజ్ఞానుల్ ప్రశంసింపగన్! 2

సీ. స్తవనీయులైన 'కృష్ణస్వామి – రుక్మిణీ'
వర దంపతుల నోము పంట వగుచు
'లలితమ్మ'యును 'నాదిలక్ష్మి'యు 'జయచంద్ర'
'రాణీ' 'విజయలక్ష్మి' రహిని 'నిర్మ
లాంబ'యు 'బదరి నారాయణుం'డాదిగా
గల సోదరీ సోదరులు చెలంగ
'శ్రీ మునివెంకటస్వామి' – 'చెంగమ్మ'ల
జ్యేష్ఠకుమారి విశిష్టయైన

తే. అమల సుయశస్వి 'సత్యప్రభాం'బ కరము
బట్టి నీదు యదృష్టము పండురీతి
అరయ 'తేజేశ్వరి'యు – 'కల్పజమ్మ' – 'శ్రీని
వాసు'లను సంతతిం గాంచి వాసికెక్కు
'ఆదికేశవ'! నీకు దీర్ఘాయు రస్తు!! 3

సీ. సాహిత్య రసికతన్ సంగీత ప్రియుడవై
లలిత కళాపోషణలను సలిపి
పరికింపగా మహాభక్తుండ వైనట్టి
సౌజన్యశీలి విశాల హృదయ
ఎన్నగా నీ చేతి కెముక లేదనిపించు
దానరాధేయ విద్వద్విధేయ
సహనంబునన్ గర్వరహితుండ వైనట్టి
సంతోషిత స్వాంత శాంతమూర్తి

తే. హాస్యరసలోల! చతురోక్తులందు మిగుల
నిత్య మనురక్తి కలిగిన సత్యశీల!
సరగు 'దళవాయి' వంశ భూషణ! పవిత్ర!
ఆదికేశవ! నీ కృషి కంజలింతు!! 4

సీ. శ్రీనివాసాట్రస్టు చెల్వొందగా నిల్పి
ధర్మకార్యముల సంధాన పరచి

కోట్ల రూపాయల కురిపించి భక్తితో
శృంగేరి, తిరుపతి, చెలగ కంచి
గణనీయమగు తిరుత్తణి, పుట్టపర్తిని
బెంగుళూరున భక్తి రంగరించి
ఘనమైన సత్రాల, కళ్యాణ మండపా
లుచిత భోజనశాల లుత్సుకతను

తే. వడిగ తిరుమల నీటి యెద్దడిని మాపి
మాన్యతను బొంది చిత్తూరు మండలమున
స్థాపన మొనర్చినాడవు సత్యసాయి
నీటిపథకమ్ము ప్రేమతో నిరుపమముగ
ఆదికేశవ! నీ చర్య లద్భుతములు! 5

ఉ. నీకును, నీదు సంతతికి నీ ప్రియమిత్ర విశిష్ట బాంధవా
నీకము కిమ్మహోత్సవము నిర్వహణంబొనరించు వారికిన్
శ్రీకరుడౌ పరాత్పరు డశేష కృపామతి భోగ వైభవా
నీకము లిచ్చుగాక అవనీ స్థలిలో మనునంత కాలమున్! 6

* * *

## శుభాకాంక్షా శతపత్రము

-'సౌజన్య శిరోమణి' శ్రీ కొంపెల్ల రామకృష్ణమూర్తి, ఎం.ఏ.

మ. తన మార్గమ్మొక సద్గుణ ప్రకర సౌందర్యమ్ముటుల్ సాగ, జీ
వన 'సత్యప్రభ' నిత్యవైభవ మహాభాగ్యమ్ము లందింప నె
మ్మనమం దెప్పుడు దైవభక్తియు కళామాధుర్యముల్ నిండగా
జనవంద్యుండగు 'నాదికేశవు' ని సౌజన్యమ్ము భాసించెడిన్. 1

సీ. ధనమున్నవారికి దానధర్మధ్యాస
సన్నగిల్లుచునున్న సమయమందు
వ్యాపార దక్షులు స్వార్థము విడనాడు
కార్యముల్ చేయని కాలమందు

భోగము కలవారు త్యాగము నెరుగక
దర్పము నేర్చెడి తరుణమందు
యాంత్రిక జీవన తంత్రజ్ఞులై జనుల్
సరసత మరచిన క్షణమునందు

తే. సజ్జనుం డెట్టి మార్గాన సాగవలెనొ
సర్వసంపద లెన్నడు సార్థకములొ
చాటుచున్నట్టి 'ఆదికేశవు'ని కీర్తి
ఎల్ల కాలములందు వర్ధిల్లుగాక! 2

చ. తెలుగుల వైభవమ్ము నలుదిక్కులఁ జాటిన రాజ్యమందు పూ
ర్వులు 'దళవాయి' పీఠములలో ప్రకటించిరి ధర్మవీరమున్
సలలిత మానసమ్మునఁ బ్రశస్త దయాగుణ ముల్లసిల్ల ని
స్తులమగు దానవీరమును చూపును 'కేశవు' డిప్డు నిష్ఠతో. 3

సీ. సాహిత్యమం దెట్టి సద్భావ మున్నదో
గణియింప 'చైతన్యకవిత' సాక్షి
ధార్మి కాలోచనా ధార యెట్టిదో చెప్ప
'శ్రీనివాసాట్రస్టు' శ్రేష్ఠ సాక్షి
జనసేవలోన నాసక్తి యేపాటిదో
చెప్ప సాయీశ్వర సేవ సాక్షి
స్థిరమైన కీర్తి నార్జించు తీరెట్టిదో
దర్శింప 'అన్న సత్రవులు' సాక్షి

తే. ధర్మశీలియు, సుగుణ రత్నాకరుండు
'ఆదికేశవు' సర్వదేవాళి మెచ్చి
ఆయురారోగ్య భవ్య భాగ్యముల నిచ్చి
పరమ కారుణ్య ఫణితిఁ గాపాడు గాక! 4

* * *

# కీర్తనీయాత్మసౌందర్య! కేశవార్య!

–'సహృదయ శిఖామణి' డా॥ రామడుగు వేంకటేశ్వరశర్మ,
ఎం.ఏ., పిహెచ్.డి., గుంటూరు

సీ. సుకుమార నిర్మల సుందర బాల్యంబు
స్వాదు సుస్థిరమౌ పునాదిగాగ
రెపరెపలాడుచు రేగెడి కౌమార
మాధారపుం గంబమై చెలంగ
పడిలేచు కెరటాలవలె నొప్పు యౌవనం
బలఘు సింహద్వారమై వెలుంగ
భవసార రుచివైభవంపు ప్రౌఢ వయస్సు
అనఘ శిల్పారామమై యెసంగ

తే. అడరు జీవిత దేవాలయమున కిపుడు
కీర్తి గోపుర శిఖర విస్ఫూర్తి యగుచు
పుడమి నెసలారునది షష్టిపూర్తి గాదె
నాణ్యమైనట్టి యెట్టి మానవునకైన
శిష్టగతి నొసంగుత! నీకు ఇష్టపూర్తి!
కీర్తనీయాత్మసౌందర్య! 'కేశవార్య'! 1

తే. 'విజయ నగరమ్మె' నీదు జీవిక సతమ్ము
ధన్య భవదీయ హృదియె 'చైతన్య కవిత'
నిత్య 'సత్యప్రభ' సరస్సు నీ యశస్సు
కేవలుండవె? నీ 'వాదికేశవార్య'! 2

సి. ధర్మకార్యైక తత్పరుడ వంటకు 'శ్రీని
వాసా'ఖ్య మౌ ట్రస్టు పరమ సాక్షి
ఆలయోద్ధరణ కార్యాసక్తు డనుటకు
'వేణు గోపాలుండు' విమల సాక్షి
మహి నీరపథక నిర్మాత వంటకు 'సాయి'
పేరున్న చిత్తూరు సార సాక్షి

ధనసార్థక మొనర్చు ఘనుడ వంటకు 'తిరు
త్తణి కంచి సత్రాలె ధన్య సాక్షి

తే. బాసలను, సాహితిని నీదు ధ్యాస తెలుప।
నవ 'విజయ లిపి', 'చైతన్య కవిత' సాక్షి
'ధాన రాధేయ!' నీ సువర్తనల నెన్న
సాక్షులున్నారు పద్యంబు చాలదింక 3

సీ. సంగీత సాహిత్య సరసజ్ఞతాసక్తి
గుణ సత్య కనుగీటి కూడియాడ
సౌజన్యశీలైక సద్భక్తి గుణ రుక్మి -
ణియె నిన్ను లోఁగొని నీటు చూప
అహమెరుంగని దాన మహిత సద్గుణ మిత్రఁ -
విందె నీ యెడద కానంద మిడగ
ఆరోగ్య కర రూప హాస భాసుర గుణ
లక్షణ శృంగార వీక్షణ మిడ
సతత సంతోష జాంబవతౌ సుత హసింప
చతుర భాషా సుదంత విశ్రాంతి నొసగ

తే. లీల లోకజ్ఞతనెడి కాళింది నెఱప
భవ్య సత్క్రియాచరణమన్ భద్ర పొగడ
నవ్యజీవన బృందావనాన నీవు
'విజయమొం'దు 'కృష్ణస్వామి'వే! నిజమ్మ!
షష్టిపూర్తి పెండ్లి కొడుక! శిష్టగతిని! 4

సీ. కాఫితోటకు తీరికయె లేని నీ వెప్డు
కంచి సేవించుట ఘనత గాదె।
సుగరు పరిశ్రమఁ జొక్కాడి నీవు శృంగేరి
కేగుట వింత తీరు గాదె!
బిరనిండస్త్రీల నలరించు నీ వల
వెంకన్నఁగనుట మేల్ విధము గాదె!

పాలము పనులలోన మునిగి తేలెడి నీవు
సాయిఁజూచుట చిత్ర సరణిగాదె!

తే. రియలు ఎస్టేటు క్లీయరెన్సు ప్రియుడవీవు
అల తిరుత్తణి కరుగుట అరుదు గాదె!
ఏత దుత్తమ సంస్కారి కిష్టపూర్తి!
ఆయురారోగ్య భోగభాగ్యంబు లెలమి
పైని దేవత లాచార్యవర్యు లిడుత।
ప్రథిత షష్టిపూర్త్యుత్సవ ప్రభల వేళ
కీర్తనీయాత్మసౌందర్య! 'కేశవార్య'!! 5

* * *

# రత్నప్రభ

– 'కవితా గౌతమి' డా॥ కావూరి పాపయ్యశాస్త్రి, ఎం.ఏ.; పిహెచ్.డి.

ఆ. 'రత్నగర్భ' యనగ రాణ కెక్కిన యట్టి
భరతమాత కీర్తి పరిఢవిల్ల
పుట్టె రత్న మొకటి పొలుపుగ 'దళవాయి'
వంశమందు రత్నప్రభలు నిండ. 1

ఆ. తండ్రి 'కృష్ణస్వామి' తల్లి 'రుక్మిణి'దేవి
పుత్ర రత్నముగని పొంగిపోవ
'ఆదికేశవాఖ్య'మౌ రత్నకాంతుల
బెంగుళూరు పురము రంగులీనె. 2

చ. పలుకుల తేనెలొల్కు మృదుభాషి, రసజ్ఞుడు, సత్యసంధుడున్
కళలకు ఱేడు, అర్థిజన కల్పకుజమ్ము, మనీషి రత్నమై
వెలుగు వివేకవంతుడు, ప్రవీణుడు విద్యల, రాజనీతిలో
నలఘు డతండు సాటియగు నాతనికెవ్వడు సద్గుణంబులన్? 3

సీ. సత్యసాయీశుని జలపథకమ్మును
పారించినట్టి భగీరథుడయి
రంతిదేవుడు, శిబి, రఘు, కర్ణ దాతల
తలపించునట్టి వదాన్యుడునయి
తిరుపతి శృంగేరి దివ్యధామములందు
ధర్మసత్రముల సంస్థాపకుడయి
శిథిల దేవాలయ జీర్ణోద్ధరణలతో
భక్తాగ్రగణ్యుడై పరిఢవిల్లి

తే. హోయసల వంశ కాలంపు హొయలు మీరు
'వేణుగోపాల హిమకరు' వేడ్కగొలిచి
అమల యశమును గడియించె 'నాదికేశ
వుండు', 'దళవాయి' వంశచంద్రుండు సతము. 4

ఉ. శ్రీ 'దళవాయి' వంశ సరసీరుహ భాస్కరుడై వెలుంగుచున్
శ్రీ దయితాంఘ్రి దివ్య సరసీరుహ బంభరుడై చెలంగుచున్
వేద పథానువర్తియయి విజ్ఞులు మెచ్చగ దానధర్మ మ
ర్యాదల 'నాదికేశవుడు' ఖ్యాతి గడించె నఖండ తేజుడై! 5

* * *

## అభినందన

–'బహు భాషావేత్త' ఆచార్య కె. సర్వోత్తమరావు ఎం. ఏ., పిహెచ్.డి.

సీ. పరితోష మొప్పంగ పదియు నెన్మిది సార్లు
అయ్యప్ప కొలిచిన అనఘుఁ డీవు
సంతసం బొనరంగ సత్యసాయిని జూడ
పుట్టపర్తికి నేగు పుణ్యుఁ డీవు
విమల వర్తనముతో వేంకటేశునిఁ గాంచ
తిరుమల చనునట్టి పరముఁ డీవు
మనసులో నిలిచిన మాన్యుల దర్శింప
కంచికి వెళ్ళెడి ఘనుఁడ వీవు

తే. చేరి కొలుతువు భక్తి శృంగేరి యతుల
మెచ్చి నుతియింతువయ్య తిరుచ్చిసామి
భేద భావంబు లేనట్టి ప్రీతి నీది
'ఆదికేశవా'! మనసార నభినుతింతు! 1

సీ. కడుపేద లెల్లరు కడుపార భుజియింప
ఉచిత భోజనశాల లుర్వి నిలిపి
ఊరివా రెల్లరు నుత్సాహమును బెంచ
కల్యాణ మండపా ల్గరిమ నిలిపి
యాత్రికు లెల్లరు యాతన ల్పడకుండ
పెదపెద్ద సత్రాల పేర్మి నిలిపి
ఆడువా రెల్లరు నానంద మొందగా
నీటిపథక మెల్ల నియతి నిలిపి

తే. సాంఘికంబైన సేవలో సతము వెలసి
చెలిమి ఆబాల వృద్ధుల జిహ్వ నిలిచి
ధన్యుఁడైతివి 'దళవాయి' తరములందు
'ఆదికేశవా!' మనసార నభినుతింతు!! 2

సీ. తెలుఁగు కన్నడిగులు కలిసి జీవింపఁగా
'విజయలిపి'ని కూర్చి వెలిఁగి తీవు
పెక్కు కోరికలతో పేదలు యాచింప
'దాన రాధేయుడై' తనరి తీవు
గాయకు ల్మెచ్చంగ కవులెల్ల కీర్తింప
సత్కళావిదుఁడవై సాగి తీవు
పరిచితులకు నెల్ల మరచి పోరానట్టి
పలుకుల విందును పంచి తీవు

తే. 'బలిజ' కుల భూషణుండవై పరగి తీవు
ప్రీతి 'సత్యప్రభ'ను గూడి పెరిగి తీవు
శ్రీనివాసుని కృపతోడ చెలఁగి తీవు
'ఆదికేశవా!' మనసార నభినుతింతు!! 3

తే. ఆయు రారోగ్య భాగ్యంబు లనువు పడగ
జగతి కీర్తిప్రతిష్ఠలు నెగడు చుండ
గణ్య 'దళవాయి' వంశంబు ధన్యమొంద
ఏడుకొండల దేవుని వేడికొందు! 4

* * *

# ఇష్టపూర్త ప్రణేతకు షష్టిపూర్తి!

-'కవి రత్న' శ్రీ అత్తిలి వేంకటరమణ, నూజివీడు

సీ. 'దళవాయి' వంశ నందనవనీ మందార
మనగ శౌర్యౌదార్య ఘనత మెఱసి,
'బలిజా'న్వవాయ సంభవ నవ్య రాధేయుఁ
డనుటలో సహజోక్తి యందగించి,
'మునిసామినాయుడు' ముత్తాత; తాతయై
'నారాయణస్వామి నాయు' డెసఁగి
పితరులౌ పుణ్యదంపతులు 'కృష్ణస్వామి
నాయుఁడు'న్ - 'రుక్మిణి' - శ్రీయుతులయి

తే. మంగళాక్షత లిడి గోత్రమాన్యుఁజేయ,
అభ్యుదయము, నిశ్శ్రేయస మందుకొనెడు
ఆదికేశవులకు, సంపదాఢ్యునకును,
ఇష్టపూర్త ప్రదాతకు షష్టిపూర్తి ! 1

తే. 'కిచ్చకాయల' సత్కుల క్షీరవార్ధి
జాత, గృహలక్ష్మియై సర్వసద్గుణయుత
ముగ్గురు బిడ్డల తల్లి సమ్మోద ధాత్రి
'సత్యప్రభ' గూడి, 'ఆదికేశవులు' మించు. 2

తే. రెండు చేతుల నార్జించి, నిండు మనము -
తో నఖండ మహాకార్య ధూర్వహుడయి,
నాల్గు చేతుల వెచ్చించి వెల్గుజిల్గు -
లన్ గడించెను సత్యధర్మ ప్రతిష్ఠ! 3



శృంగేరి శంకరాచార్య జగద్గురు శ్రీ శ్రీ శ్రీ భారతీతీర్థస్వామివారు
శ్రీమతి సత్యప్రభ - శ్రీ డి.కె. ఆదికేశవులు దంపతులను ఆశీర్వదించుట



షష్టిపూర్తి పెండ్లికొడుకు శ్రీ డి.కె. ఆదికేశవులుగారు
శ్రీమతి సత్యప్రభగారి మెడలో మంగళసూత్రం కట్టుట



షష్టిపూర్తి దంపతులకు శృంగేరి సంస్థాన వేదపండితుల ఆశీస్సులు



పుష్పకిరీటధారి, నవ్వుల వెన్నెలరాయడు,

'దాన చింతామణి', షష్టిపూర్తి పెండ్లికొడుకు

శ్రీ దళవాయి కృష్ణస్వామి ఆదికేశవులుగారు

చ. నవకవితాభిలాష యెదనాటిన రాజమహేంద్ర ముఖ్యులౌ
నవని పతుల్ మహేంద్ర గరిమాంచిత భావను లాత్మబంధువుల్
తవిలి హృదంతరంబున సతంబు వసింపగ, 'ఆదికేశవుల్'
ప్రవణత సాహితీ కృషికి లక్ష లొసంగుట యేమి వింతయో! 4

సీ. శబరి గిరీశు అష్టాదశ పర్యాయ
దీక్ష సేవించిన దివ్య చరిత,
ఏడుకొండలవాడి మాడువులందున
దప్పి తీర్చిన యట్టి ధన్య చరిత,
శృంగగిరీశ కాంచీ శంకరాద్వైత
భక్తి పేర్చినయట్టి భవ్య చరిత,
సర్వ శుభంబుల సంతరింపగ జేసి
నిజచరిత్రమె జగ్గు నిగ్గు లిడగ

తే. 'ఆదికేశవుల్ నాయు' డవ్యాహతుడగు
స్వామి శ్రీసత్యసాయిబాబా మనోజ్ఞ
నయన కరుణా రసాంచి తానంద సింధు
సేక నిత్యత, వంశ సుశ్రీలొసంగి!! 5

* * *

# శ్రీ దళవాయి కృష్ణస్వామి ఆదికేశవులుగారికి అక్షరాభినందనము

– 'కవితా గోష్ఠని' శ్రీ సుశర్మ, ఎం.ఏ.; ఎం.ఇడి., తణుకు

ఉ. ఐనవి షష్టివత్సరము లార్యులు మెచ్చ – మరెన్నొ వర్షముల్
బూనుచు 'దానకర్ణు' నిగ పూర్ణమనోరథ సిద్ధినొంది – స
న్మాన పరంపరా విభవమాన్యునిగా శతవర్ష శోభతో
రాణ నెసంగి వర్ధిలుడు రామకృషన్ 'దళవాయి' వంశజా! 1

తే. ప్రభవ మందిరి వీరుల వంశమందు!
పాల సంద్రాన చంద్రుని పగిది మీరు
సరస సాహితీ పోషక చక్రవర్తి!
తెలుగు కర్ణాట ప్రజలకు దీప్తివీవు. 2

క. అరువది వత్సరములు కడు
మురిపముతో గడిపి తీవు - పుడమి దొరవలెన్;
అరువదిలో నిరువది వలె
పరమానందమ్ము తోడ వరలుడు మీరల్! 3

సీ. ధర్మమూర్తి వనుచు - ధరణిలో వెలుగంగ
'శ్రీనివాసా ట్రస్టు' - జీవ సాక్షి
దానప్రభు వనుచు - ధరణిలో వెలుగంగ
'సత్రమ్ము లన్నియు' - సర్వ సాక్షి
అపర భగీరథు డంచును - వెలుగంగ
'నీటిపథకములౌ' - మేటిసాక్షి
సాహితీ ప్రియుడని - సర్వదా వెలుగంగ
'విజయలిపి' యొకడు - పెద్ద సాక్షి

తే. ఇన్ని సాక్షి కార్యములకు - ఇంతి 'సత్య
ప్రభ' యు తోడునీడయు గాదె - ప్రథిత మూర్తి!
'ఆదికేశవా'! లలితకళాభిమాని!
నిండు నూరేండ్లు వర్ధిల్లి నెగడుమయ్యా! 4

తే. కలియుగంబున ధర్మంబు నిలుప నెంచి
అవతరించిన పరమాత్మ యనగ నొప్పు
'సత్యసాయి' సతమ్ము మీ దంపతులకు
శాంతి సౌఖ్యాల నిచ్చుచు - సాకు గాత! 5

* * *

# ఆంధ్ర యశోవివర్ధనుడు

-'నల్లగొండ కవితా శిఖరం', 'మహాకవి' శ్రీగింజల నరసింహారెడ్డి

తే. నీటి యెద్దడి పీడపై ధాటి నెరపె
తిరుమలను నీటి లారీల తీరు తోడ,
సాహసించె చిత్తూర్ సత్యసాయి నీటి
పథకమున కయి ''నవ దళవాయి'' ఇతడు! 1

క. 'దళవాయి' వంశలత రా
గిల కృష్ణస్వామి 'ఆదికేశవ' సుమనో
జ్జ్వల తారుణిమము తోచెను
జలధికి చంద్రుని విధముగ జనహితమతిగా! 2

శా. దాతృప్రౌఢిమ దాల్చి ఈతడు శుభాధ్వమ్మందునన్ సాగగా
చూతమ్ముల్ పికగీతముల్ స్తుత సుమ స్తోమ ప్రభా సౌరభ
వ్రాతమ్ముల్ మలయానిలమ్ములటు సత్రా అన్నదాన స్థలుల్
ఖ్యాతాల్ సాహితి దోహదాలు వివిధాల్ కల్గెన్ మనస్శ్రోత్రమై! 3

తే. కన్నడము తెలుగు కవల గతిని నిల్చె
నెన్నొరీతుల నాకృతి వన్నియలను
అని గ్రహించి 'విజయలిపి' నందజేసె
రెంటి కదిగ నీ 'క్రాంతి' హృల్లేఖనుండు. 4

క. జీర్ణాలయోద్ధరణ కృషి
పూర్ణుడు, భక్తి ప్రపంచ పులకిత మతి, ఆ
కర్ణిత కళా విపంచి
స్వర్ణద్యుతి మధుర రావ చరితు డితండై! 5

ఆ. ఆంధ్ర కన్నడముల యం దనూదితముగా
చూడ జేసె 'తమిళనాడులో శి

వాలయాలు' అనెడు నట్టి గ్రంథమ్మును
సంస్కృతి ప్రభావ సంస్కృతికయి. 6

మ. హిమవద్వాణి స్ఫురించె మోహనముగా నీ వేణుగోపాల వం
శ ముఖ వ్యాప్తము నూతనమ్మయి కృపా సంపన్నమై నేడు - ఈ
అమల స్వాంతుడు 'ఆదికేశవులు' దివ్యధ్భక్తి జీర్ణాలయ
మ్ము మహాశ్రద్ధ నొనర్చ సోద్ధరణమున్ మోదమ్ముగా స్వామికిన్! 7

శా. పారిశ్రామికవేత్త, సత్కృషిచయప్రౌఢుండు, స్వీయార్జితో
దారంబౌ ధనరాశి లోకహితకృత్ కార్యాలకై చల్లు ఓ
ధీరమ్యాగ్రణి మేఘు డాత్త ఘనతా దివ్యత్వ శంపాన్వితా
కారుం, డాంధ్ర యశోవివర్ధనుడు ఈ కారుణ్య గంధుండహో!! 8

* * *

# దళవాయి దానకర్ణుడు

– 'వీరగాథల సవరాల జిమ్మడు' ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు

ప్రశస్తి

సీ. ఎవ్వాడు 'రుక్మిణీ' – 'కృష్ణమ నాయక'
పున్నెంపు పంటయౌ ముద్దుబిడ్డ,
ఎవ్వాడు 'సత్యప్రభే'శ్వరి మానస
సరసిలో విహరించు జాతిహంస,
ఎవ్వాడు 'కల్ప' – 'తేజేశ్వరి' – 'శ్రీనివాస్'
ఘనులను గన్న బంగారు తండ్రి,
ఎవ్వాడు శ్రీ వేంకటేశ్వర స్వామికి
అంకితమైన భక్తాగ్రగణ్యు,

తే. డతడు శృంగేరి, కంచి పీఠాధిపతులు,
సాయిబాబాకు భక్తుడు, సన్నిహితుడు,
కీర్తికెక్కిన 'దళవాయి కృష్ణసామి
ఆదికేశవు' లాతడు త్యాగమూర్తి!

చరిత్ర

మంజరీ ద్విపద

పరమ పావనమైన భరత ఖండాన
అతిసుందరంబైన ఆంధ్ర దేశాన
శ్రీలు పొంగెడి గడ్డ చిత్తూరు సీమ
పంచ వర్ణాలతో భాసిల్లు సీమ
బంగారు సీమలో 'బలిజ' కులాన
'అక్షింతల' యనెడి అనఘ గోత్రాన
అవతరించెను మాదు 'ఆదికేశవులు'!
వీరుల వంశాన శూర కులాన
'మునుసామి నాయుండు' ముత్తాత కాగ
'నారాయణ స్వామి నాయుడు' తాత
ఆతని యిల్లాలు అతి పూజనీయ
'నాంచార' దేవియు నాయన అమ్మ
ఈ దంపతుల నోము ఇలను ఫలించి
తండ్రి 'కృష్ణస్వామి' ధరను జన్మించె.
'దళవాయి' సంద్రాన తళుకు చంద్రుండు
సరసుండు ఆ 'కృష్ణస్వామి నాయుండు'
పరగంగ 'రుక్మిణి'న్ బరిణయంబాడ
ప్రద్యుమ్నుడై పుట్టి భాగ్యముల్ వడసె
అత్యున్నతడు 'డి.కె. ఆదికేశవులు'!

* *

అక్కయ్య 'లలితమ్మ'; అనుగు చెల్లెండ్రు!
'ఆదిలక్ష్మి' యు, 'రాణి', ఆ 'విజయలక్ష్మి'
'నిర్మల' నలుగురు ధర్మశీలురును;
తమ్ముడు 'జయచంద్ర', తరువాత 'బదరి
నారాయణుండు'ను చిన్నారి తమ్ముండు
అక్కలు చెల్లెండ్రు ఐదుగురు గాగ

ముద్దుల తమ్ములు ఇద్దరు గాగ
దోస తోటను బోలు దొడ్డ వంశాన
అవతరించిన యట్టి 'ఆదికేశవులు' -
కవి పండితుల పాలి కల్పవృక్షంబు
తనర నర్థుల దన్పు దాన కర్ణుండు
పాడుబడ్డ గుడులపాలి దేవుండు
శ్రీనివాసుని గొల్చు శిష్టభక్తుండు
కంచి, శృంగేరీల నంచిత భక్తి
చిరకాలమున నుండి సేవించు ఘనుడు
సత్యసాయుని పాద స్వచ్ఛ పద్మముల
నిత్యంబు విహరించు నీటైన తేటి
సత్రాలు నిర్మించె క్షేత్రాలలోన
పీఠాధిపతులకు ప్రియమైన వాడు
ఇలనేలు నేతల తలలోని నాల్క
సకల సద్గుణకీర్తి సౌజన్యమూర్తి
'దాన చింతామణి' దారిద్ర్య తరణి
వేదనాద భవులు 'ఆదికేశవులు'!

* *

చిత్తూరు జిల్లాన చెలగెడి ఊరు
రాయల భవనాల రాజిల్లు ఊరు
అలరు సంపదలతో ఆ 'పుంగనూరు'
పుంగనూరున నున్న రంగైన పేట
'కోనేటి పాల్యా'న కొమరారువారు
'బలిజ' వంశజులైన బహుదొడ్డవారు
రంజిల్లు కీర్తితో 'రావిల్లు'వారు
'పొగడ పువ్వుల' గోత్ర భూషితుల్ వారు
'హనుమప్ప' మూలము ఆ వంశమునకు
'వేంకటస్వామి' - 'హోవే కృష్ణప్ప' - 'ముని

వేంకట స్వామప్ప' - వెరసి నాలుగు త-
రములు జరిగినవి విమల యశమున
ఐదవ తరమున అలరారు కొమ్మ
'చెంగమ్మ' కన్నుల బంగారుబొమ్మ
'ముని వేంకట స్వామి' ముద్దు కూతురగు
'సత్యప్రభా' దేవి సద్గుణంబులకు
అబ్బుర పడినట్టి 'ఆది కేశవులు'
మెచ్చి పెండ్లాడగా హెచ్చె సత్కీర్తి
వంశాభివృద్ధియు వరుసతో వచ్చె
'తేజేశ్వరీ' దేవి - దివ్య 'కల్పజ' యు
'శ్రీనివాసు'ని తోడ సిరిమల్లెతోట!
మూడు పువ్వుల బాట! ముత్యాల మూట!!

* *

'తేజేశ్వరి' కి భర్త దిట్టడు మేన
మామయౌ 'శ్రీనివాసామూర్తి' ఘనుడు
ఎలమితో కలిమితో ఈ దంపతులకు
ముగ్గురు కలిగిరి ముద్దుబిడ్డలును
కూతురు 'చైతన్య', కొమరారు 'గీత -
విష్ణువు' పేరిటి విమల తనయుడు,
'ఆదినారాయణ' ఆఖరి కొడుకు.
భగవాను సాయీశు పరమ సన్నిధిని
పెండ్లాడె 'కల్పజ' 'ప్రేమచందురు'ను
ఈడు జోడును గల్గు ఈ దంపతులకు
ముద్దుగా బుట్టిరి యిద్దరు సుతలు
'ఆరుద్ర' - 'వైదేహి' అనఁబరగు వారు.
ఆ దానకర్ణుడౌ ఆదికేశవుల
ఏకైక పుత్రుండు లోకైక నుతుడు
'శ్రీనివాసుడు' ఘనుడు చెలగి వేడుకను

'పగడాల' వంశాన ప్రభవించినట్టి -
లేమ, 'సుగుణ' - 'మురళీధరరావు'
దంపతుల పుత్రి, తరుణీ లలామ,
నీటుకత్తెల రాణి, 'నెల్లూరు' బోణి
'రూప'ను పెండ్లాడె రోచిష్ణువగుచు
పరగ నింగిని బోలు పందిరి వైచి
ధరను బోలిన యట్టి అరుగును గట్టి
బెంగుళూరున రంగరంగ వైభోగ -
ముల తోడ ఆ పెండ్లి ముచ్చట గొలిపె!!

* *

ఆశీస్సు

శ్రీరమ్య వక్షుండు శ్రిత వత్సలుండు
కారుణ్య ధాముండు కనకాంబరుండు
వారిజ నేత్రుండు వనద గాత్రుండు
శ్రీరమాధీశుండు సిరులిచ్చుగాక!
నాగ జందెమువాడు నాగ భూషణుడు
నాగ బంధము బొజ్జ నడికట్టువాడు
బేసి కన్నులవాని పెద్ద కొమరుండు
వాసిగా నిను గాచు భాసమానముగ!
బ్రహ్మ పుక్కిటి కొమ్మ, పణతి మాయమ్మ,
ఒనరంగ శశిబింబ, ఘన శారదాంబ,
జగదంబ శారదయు జయమిచ్చుగాక!
కమల గర్భుడు నీకు విమల యశమిచ్చు!
కాపాడు నిన్నెపుడు గౌరమ్మ విభుడు!
కాళహస్తీశుండు, కాశినాథుండు,
శ్రీగిరి లింగంబు, చెన్న కేశవుడు,
ఏడు కొండల సామి ఎల్ల వేళలను
వరములిచ్చుచునుండ వర్ధిల్ల గలవు!

కూతుళ్ళు - అల్లుళ్ళు, కొడుకు - కోడలును
మనుమరాం(డును, మనుమలును కలుగుచు
తామర తంపరై 'దళవాయి' కులము
ధరణిలో ఆచంద్ర తారార్కముగను
సిరి సంపదల తోడ చెలగును గాక!
ఆరోగ్య మాయువు అఖిల సత్కీర్తి
ఓ ఆదికేశవా! ఒనగూడు నీకు!
శ్రీరస్తు! శుభమస్తు! శివమస్తు నీకు!!

* *

''శతమానం భవతి శతాయుః పురుషః
శతేంద్రియ ఆయుష్యేవేంద్రియే ప్రతి తిష్ఠతి!''.

* * *

గీటురాయి-1:

## డా॥ భూతపురి సుబ్రహ్మణ్యశర్మ శతావధాని, డి.లిట్., గారి

# శ్రీకృష్ణభారతము - సంగ్రహ పరామర్శ

శ్రీరామచంద్ర గురు కృపా కటాక్ష వీక్షాపాదిత జగద్ధిత రసోదంచిత చారిత్రక కావ్య నిర్మాణ చణుడూ, కవితా సుధాకర, కవిభూషణ, కవి సార్వభౌమ, అవధాన వాచస్పతి, శతావధాని, మహాకవీత్యాది బిరుదాంచితుడూ అయిన డా॥ భూతపురి సుబ్రహ్మణ్యశర్మ డి.లిట్. గారు రచించిన శ్రీకృష్ణభారతము ఆధునికాంధ్ర చారిత్రక మహాప్రబంధాలలో తలమానికం. దానికదే సాటి అనే అనన్వయాలంకారానికి ప్రసిద్ధ లక్ష్యం ప్రత్యక్ష సాక్ష్యం.

శ్రీ కృష్ణభారతం అనే పేరు వినగానే ఎవరైనా కవి తనపేరుతో భారతం రచించారా? అనిపిస్తుంది లేదా ద్వాపరయుగంనాటి శ్రీకృష్ణుని చరితమా! అనే భ్రమను కూడా కలిగిస్తుంది. కాని ఇది ఆ రెండు విధాలైన అభిప్రాయాలకు అతీతమైంది. ఇట్టి సందేహం సాధారణంగా పాఠకులకు కలుగుతుంది అని గ్రంథకర్త ముందే ఊహించారు. అట్టి సందేహ నివారణకై కవి స్వయంగా కుండలీకరణంలో 'శ్రీకృష్ణరాయ మహాప్రబంధ' మని నామాంతరం ప్రకటించారు. ఈ మహాకవి తన 'నివేదనము' లో కూడా శ్రీకృష్ణభారతమని పేరు ఎందుకు

పెట్టారో వివరిస్తూ 'భరత వంశీయుల చరిత్ర భారతమని వచ్చినట్లే, భరతదేశ వీరుల చరిత్రయు భారతమను దృష్టితో శ్రీకృష్ణదేవరాయలచరిత్రకు శ్రీకృష్ణభారతమని పేరుపెట్టితి'నని నివేదించినారు. ఈ శ్రీకృష్ణభారతాన్ని కవి ఎనిమిది ఆశ్వాసాలుగా విభజించడంలో కూడా ఎంతో ఔచిత్యాన్ని పాటించారు. తన ఇష్టదైవమైన శ్రీరామచంద్రునికి అంకితమిచ్చిన ఈ మహాప్రబంధంలో పద్యసంఖ్య ఈ విధంగా ఉంది. షష్ఠ్యంత సహిత పీఠికలో 54, ప్రథమాశ్వాసం 276, ద్వితీయ 327, తృతీయ 353, చతుర్థ 396, పంచమ 356, షష్ఠ 371, సప్తమ 440, అష్టమ 430- మొత్తం 3003 పద్య గద్యాలు. అనులోమ విలోమ సామ్యసంఖ్యలో మూడు సంఖ్యయొక్క ప్రాధాన్యం వెల్లడింపబడింది.

రాయలేలిన సీమ రాళ్లసీమ కాదు రతనాల సీమ అనీ, రాయల పరిపాలనా వైభవంతో స్వర్ణయుగ ప్రశస్తిని సంతరించుకొన్న ఈ సీమలో పుట్టి - ఆ మహావీరుని గాథను తనివితీరా ప్రబంధీకరించడానికి సమకట్టి చరితార్థుడైన మహాకవి భూతపురి సుబ్రహ్మణ్యశర్మగారి శ్రీకృష్ణభారతాన్ని గురించి మనం మననం చేయడం రాయలసీమ కవుల, సహృదయ విమర్శకుల కర్తవ్యంగా భావిస్తూ, సంగ్రహంగా నా అభిప్రాయాలను ఈ వ్యాసంలో పేర్కొంటున్నాను.

పురాణేతిహాస ప్రసిద్ధమైన ఇతివృత్తానికీ, చారిత్రకమైన ఇతివృత్తానికీ ఎంతో వ్యత్యాసం ఉంది. సర్వసాధారణ కావ్యనిర్మాణంకన్నా చారిత్రక ప్రబంధ నిర్మాణం చాలా కష్టతరమైంది. వాస్తవాలను అతిక్రమించి కేవలం కల్పనా చాపల్యాన్ని ప్రకటిస్తే అది చారిత్రకం కానే కాదు. కాబట్టి చారిత్రక ప్రబంధ నిర్మాత ప్రతి సన్నివేశంలోనూ ఎంతో జాగరూకత పాటించవలసి ఉంది. 'సమకాలము వారలు మెచ్చ'రన్నట్లు 'కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నములు' పూర్వం నిరసింపబడ్డాయి. డా॥ భూతపురి సుబ్రహ్మణ్య శర్మగారు మహాప్రబంధ నిర్మాణానికి పూనుకోవడానికి మునుపే ఒక ప్రణాళిక ప్రకారం రాయలకు సంబంధించిన యథార్థ చారిత్రక సంఘటనల్లోని ఔచిత్యాన్నీ సత్యాన్నీ సవిమర్శ పరిశీలన చేసి, సందర్భ సముచితంగా ప్రయోగ దక్షత ప్రకటించారు. విషయసేకరణలో వీరివ్యుత్పత్తి ఎంత అమోఘమైందో, దానిని నైపుణ్యంతో రామణీయకంగా ప్రయోగించడంలో వీరి ప్రతిభ అంతగా గాంభీర్యాన్ని సంతరించుకొని రసభరితంగా పరిణమించింది. పరుసవేది సోకినట్లుగా ప్రతి సన్నివేశమూ స్వర్ణమయమై భాసించింది. చారిత్రక సత్యాలను రసమయం చేయడంలో భూతపురిగారు కథాకాలానికి సంబంధించిన ఎన్నో శాసనగ్రస్త విషయాలను, నాటి సమకాలీన ప్రబంధకవుల పద్యాలను, ప్రత్యక్షంగా శ్రీకృష్ణ దేవరాయలను సందర్శించిన ఆనాటి పాశ్చాత్య పండితుల అభిప్రాయాలను - ప్రబంధేతర సాహిత్యంలో ప్రకటింపబడ్డ ఎన్నో విషయాలను స్వీకరించి ప్రబంధీకరణకు అనుకూలంగా మలచుకొన్న తీరు ఈ కవి సార్వభౌముని అసాధారణ శేముషీ విభవాన్ని చాటుతూ ఉంది.

ఇంతటి ఈ మహా ప్రబంధంలో మచ్చుకు కూడా ఒక వ్యర్థపదం కనిపించదు. అది వీరి శబ్దార్థ సమప్రాధాన్యమైన పరిపక్వ రచనా రామణీయకానికి చక్కని నిదర్శనం. సద్యఃపరనిర్వృతికి సాధనంగా వీరు సంభాషణాత్మకశైలికి ప్రాముఖ్యమిచ్చి తిక్కనను ఆదర్శంగా గ్రహించారు. తిక్కన కవితాశైలి ఈ మహాప్రబంధంలో మనకు అక్కడక్కడా ప్రత్యక్షమౌతుంది. 'నన్నెఱుగుదు సుతునెఱుగుదు... కృష్ణుని మన్నిక కే నెవడ నీకు మంతనమాడన్' - ఇది కృష్ణరాయలను శిష్యునిగా తిమ్మరుసుకు తుళువ నరసరాజు అప్పగించు సన్నివేశం. ఇట్లే 'వచ్చినవాడు తుళ్వ నరపాలుడు నెట్టన గెల్తుమంచు వాక్రుచ్చగ రాదు... రాలచ్చికినై పెనంగుటయు లాభము కాదని సంశయించెదన్'. ఇది తిరుచినాపల్లి కోనేరి నాథుడు తుళ్వ నరపాలుని దండయాత్రను తెలుపుతూ తన మంత్రి సైన్యాధిపతులను హెచ్చరించు సందర్భం. ఇట్లెన్నో ఉదాహరణలు చూపవచ్చును. ఈ మహాకవి ఒక్క తిక్కన సోమయాజినే కాదు. నన్నయనుండి చిన్నయవరకు గల ప్రసిద్ధ కవుల రచనల్ని సందర్భానుసారంగా అనుసరించారు. ముఖ్యంగా ప్రబంధయుగంలోని అష్టదిగ్గజాల శైలిని అదేపనిగా 'ఎక్కడబడితే అక్కడ' అనుకరించారు. కారణం ఈ కావ్యం ప్రబంధయుగానికి ప్రతినిధియైన శ్రీకృష్ణదేవరాయల చరిత్ర కావడమే. ఇక ప్రథమాశ్వాసంలోని విద్యా నగర వర్ణన రాయల విలుబుత్తూరి వర్ణనకు ప్రతిరూపం. ఇందులో రాయల కల్పనలే ఐదాఱుపద్యాలలో యథాతథంగా అనుకరింపబడ్డాయి. ఈ మహాప్రబంధంలోని చిట్టచివరి ఆశ్వాసంలో పూర్వకవుల పద్యాలనే ఉదాహరించడం గమనార్హం. అవి ఆయా కవులపై గ్రంథకర్తకు గల భక్తిప్రపత్తుల్ని ప్రకటిస్తున్నాయి. ఈ విధంగా ఈ మహాప్రబంధములోని రచన ప్రకృష్ట పదబంధ విలసిత మనోజ్ఞమై - ప్రసన్న గంభీరంగా - లలిత సుకుమార విన్యాస విలాసాలతో రసబంధురంగా, నిత్యసుందరంగా సాగింది.

శ్రీకృష్ణభారతంలో కృష్ణరాయల పరిపూర్ణ జీవిత చరిత్ర అభివర్ణితం కాలేదు. అట్లైనచో కావ్యం విషాదాంతమై ఉండేది. కావ్యం మంగళాంతం కావాలి అని కవి సంకల్పం. అందుకే భూతపురి గారు మనుచరిత్రావిష్కరణ కార్యక్రమంతో కావ్యాన్ని పూర్తిచేసారు. శ్రీ భూతపురి సుబ్రహ్మణ్యశర్మగారు అల్లసాని పెద్దన సాహిత్య పీఠాధ్యక్షులు. అల్లసానివారికి రాయలు చేసిన గౌరవమర్యాదలు సాహిత్యచరిత్రలో మరెచ్చటా మనం వినలేదు. అంతటి మహోన్నత స్థానాన్ని రాయలు పెద్దనకు ఇచ్చి ఆయన పేరు నిలబెట్టారు. సాహితీ సమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయల సాహిత్యపోషణ అసామాన్యమైనది. పూర్వం భోజుని ఆస్థానంలో సారస్వత కళాపోషణకు అంతటి అనితరగౌరవ ప్రతిష్ఠలుండేవి. అందుకే రాయలు ఆంధ్రభోజుడుగా కీర్తింపబడ్డాడు. ఆంధ్రకవితా పితామహ బిరుదంతో సత్కరించి మనుచరిత్రను అంకితం గొన్న రాయలు అల్లసానిని 'ఎదురైనచో తన మదకరీంద్రము డిగ్గి కేలూత యొసగి ఎక్కించుకొన్నాడు'. ఇంతగా కవుల నాదరించిన సంఘటనలు 'నభూతో న భవిష్యతి'. అందుకే మనుచరిత్ర వంటి మహాకావ్యావిష్కరణ అనంతరం శ్రీకృష్ణరాయలు

ఎన్ని మహోన్నత కార్యాలు నిర్వహించినా అవి ఏవీ దీనితో సాటిరావు అనే లక్ష్యాన్ని గుర్తించి, దానికి సాక్ష్యంగా అల్లసాని పెద్దన సాహిత్య పీఠాధ్యక్షులైన భూతపురివారు ఆ అపూర్వ విశిష్ట సంఘటనకు పెద్దపీట వేసి అంతటితో తమ చారిత్రక మహాప్రబంధాన్ని నిలిపి వేసినారు. శ్రీకృష్ణరాయల సమగ్ర జీవితాన్ని తెలిసికోవాలి అని ఆరాటపడే పాఠకులకు ఇది కొంత అసంతృప్తిని కలిగించవచ్చు. కాని భూతపురి వారి దృష్టి 'జగద్ధిత రసోదంచితం'. ఆ లక్ష్యం నెరవేరాలంటే అతిముఖ్యమైన ఘట్టంతో కావ్యం ఆగిపోవాలి. పాఠకులలో ఆ ప్రధాన ఘట్టానికి సంబంధించిన అంశాలే శాశ్వతంగా నిలిచిపోవాలి. ఇదే శ్రీకృష్ణ భారత మహాప్రబంధంలోని తురీయలక్ష్యం.

శ్రీకృష్ణభారతంలోని అంశాలు ఒక క్రమపరిణామ రీతిలో ఒక్కొక్క ఆశ్వాసంలో విశదకరీంచబడ్డాయి. ఈ మహాప్రబంధంలో కృష్ణరాయల జనన బాల్య విద్యాభ్యాస విజయపరంపరలు, సాహితీ సమరాంగణ సార్వభౌమత్వానికి అనుగుణంగా పాలనలో సాహిత్య పోషణకు ఆయన ఇచ్చిన ప్రాధాన్యం మాత్రమే విశదీకరింపబడ్డాయి. కవి కావ్యనిర్మాణానికై ఏర్పరచుకొన్న ప్రణాళిక ఒక్కొక్క ఆశ్వాసంలో ఏ విధంగా నిరూపితమైందో సంగ్రహంగా పరిశీలించడం సమంజసం. ఒకటి రెండు ఆశ్వాసాలలో కథాక్రమం ఈ విధంగా ఉంది. విద్యానగర వర్ణనతో ఆరంభమైన ఇతివృత్తంలో క్రమక్రమంగా తుళువ నరసింహరాయల ముగ్గురు దేవేరులు తిప్పాంబ, నాగమాంబ, ఓబాంబలు - వారికి క్రమంగా వీర నరసింహరాయలు, శ్రీకృష్ణ దేవరాయలు, అచ్యుతరాయ రంగరాయల జననం. తిప్పాంబ కౌటిల్యంతో కృష్ణుని పాయసంలో విషం పోసి చంపడానికి యత్నింపగా తిమ్మరుసు ఆ బాలుణ్ణి కాపాడడం, ఆ సందర్భంలో నాగాంబ తిమ్మరుసుకు కృతజ్ఞతలు వెల్లడించడం. అటుపై కథాకథన విధానంలో భూతపురిగారు కావించిన మార్పు ఎంతో ప్రశంసార్హం. తిమ్మరుసు జీవితచరిత్రను కృష్ణరాయలు తల్లిని అడుగగా ఆమె వివరిస్తూ అందులో బుక్కరాయల తర్వాత విద్యానగర రాజ్యాంగ పరిస్థితులు, చంద్రగిరి ప్రభుత్వం, సాళువ నరసింహరాయల పాలనం, చిట్టిగంగన తిమ్మరుసును చేరదీసి తన చివరిదశలో తిమ్మరుసును మహామంత్రిగా నియమించవలసినదిగా సాళువ నరసింహరాయలను కోరడం. సాళువ నరసింహరాయలు తిమ్మరుసును తుళువ నరసరాజుకు పరిచయం చేయడం, విద్యానగరాన్ని తిమ్మరుసు తుళువ నరసరాజు స్వాధీనం కావించడం. సాళువ నరసింహరాయల పట్టాభిషేకం, ఆ సందర్భంలో తిమ్మరుసు ప్రధానమంత్రిగా, తుళువ నరసరాజు సర్వసైన్యాధిపతిగా నియమితులు కావడం, సాళువ నరసింహరాయలకు పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి తన జైమినీ భారతాన్ని అంకితం చేయడం, సాళువ నరసింహరాయలు అవసాన సమయంలో తుళువ నరసరాజును రాజప్రతినిధిగా నియమించడం- మొదలైన విషయాలు ప్రథమ ద్వితీయాశ్వాసాలలో వివరింపబడ్డాయి.

(సశేషం)

గీటురాయి-2

# అంతర్జాతీయ విపులానుభూతులు
# బాపురెడ్డిగారి 'అక్షరానుభూతులు'

డా॥ జె. బాపురెడ్డి అనుభవజ్ఞులైన కవి. 'జీవనశ్రుతుల'ను పెక్కింటిని ఇదివరకే వినిపించారు. కాలం మాయాజాలమన్న తాత్విక పరిణతికి ప్రస్థానం కావిస్తూనే ఆటపాటల చిన్నారి ముగ్ధత్వాన్ని ఒక కోణంలో ప్రదర్శిస్తారు. ఎప్పుడూ యువకవిలా అమాయకత్వం చూపుతూనే యుగకవిత్వ లక్షణాలను నేర్పుగా కలిగి వుంటారు. ఎప్పటికప్పుడు నవకవితా సంకలనాలతో 'రెడీ'గా ఉండే డా॥ బాపురెడ్డి ఇప్పుడు మనకు మరొకసారి అందించారు 'అక్షరానుభూతులు'.

కవిత్వం అంటే అనుభూతి మాత్రమే కానక్కరలేదు. ఆత్మాశ్రయత్వం కవిత్వానికి నిత్యాశ్రయం కాదు. కాని వేదన, చింతన, ఆలోచన, ఆనందం ఇత్యాదిగా ఆత్మగత చేతనతో వెలువడిన కవిత్వం సహజంగా భాసిస్తుందనడంలో సందేహం లేదు. శ్రీ బాపురెడ్డి విపులమైన కవి. అనుభవ విస్తారమున్న కవి. వీరికి స్థానిక, భౌతిక, పారభౌతిక, ప్రత్యక్ష, అప్రత్యక్షమైన సంబంధాలు, అనుబంధాలు, వివేచన అపారం. వీటినన్నింటిని కవిత్వోన్ముఖం కావించదలచుకున్న ప్రయోగశీలి ఈయన. అందుకనే వీరి కవిత్వంలో గూఢత్వం కంటె ఋజుత్వం ఎక్కువగా గోచరిస్తుంది.

శ్రీ బాపురెడ్డి కవిత్వం వాదాలకు ఇజాలకు, ఇమేజ్‌లకు అతీతమైనది. వీరు క్రాంతిని, ముక్తిని, కామననూ త్రికోణమైన అంతర్ముఖంతో ఆత్మవిద్యగా ఉపాసిస్తారు. అందుకే వీరి భావం బంధాల కతీతమౌతుంది. దృశ్య అదృశ్య వస్తువులతో లౌకిక పారలౌకిక స్పర్శ కలిగి మనం నివసిస్తున్న సామాజిక పరిసర ప్రజ్ఞను వీడకుండా అభ్యుదయానికి సారించగల దృష్టినిస్తుంది.

'మనిషికీ దేవుడికీ మధ్య
పరిణామం చెందుతున్న ప్రయోగాన్ని నేను' (పు.49)

అని కావ్యాత్మ నావిష్కరించిన కవి ఈయన. మనిషి దేవుణ్ణి తెలుసుకోవాలన్నా ఒక ప్రయోగశీలత్వం అవసరమని భావిస్తారీయన.

ఇప్పుడు నా చింతన జీవించడానికి కాదు
మరణించడానికి యోగ్యత గురించి (పు.19)

అంటూ మరణించడానికి యోగ్యత కలగాలంటే జీవితం సఫలం కావించుకోవాలన్న అనూహ్య విషయాన్ని ఎంతో సులభంగా అవగతం కావిస్తారు. 'పేరు పెట్టుకొనే' వ్యక్తిత్వాన్ని కాక పేరు తెచ్చుకొనే అస్తిత్వంతో నిత్యయాత్రను చేస్తారు.

బాపురెడ్డిగారికి ఆధునికత అంటే చాలా ఇష్టం. ఆయన కంప్యూటర్ మేధను చిన్నపిల్లవాని వలె చప్పట్లు కొడుతూ ప్రశంసించినట్టుగా అగుపిస్తారు. **'ఓ ప్రియమైన కంప్యూటరీ'** అంటూ విజ్ఞానాన్ని విధ్వంసానికి ఉపయోగించవద్దని బేలగా వేడుకుంటారు. **''నవ యుగ కరవాణి - కంప్యూటర్ పాణి''** అంటూ లలిత మనస్కునిగా వ్యక్తమౌతారు.

బాపురెడ్డి కంప్యూటర్‌ని ఎలా కొనియాడుతారో కోర్కెతో ప్రేయసిని అలాగే చేరి ఆమె తననందుకుని ఆదరించాలని వేడుకుంటారు. అరవిందుని ఎలా శ్లాఘిస్తారో ఆపాదమస్తకం స్త్రీవిద్యాధ్యయనం చేసే 'రత్యర్థి' విద్యార్థిని అలాగే పరీక్షిస్తారు. స్వీయానుభూతులతో మగ్నమైపోక ఆధునికాసురుని స్వార్థాన్ని మట్టుపెట్టాలని వాణ్ణి నిజాక్షర చతురతతో దూషిస్తారు.

శ్రీ బాపురెడ్డి స్వభావతః ఆంగ్లకవి కూడా అనే విషయం ఈ కావ్యంలోని కవితల్లో వ్యక్తమౌతూ ఉంటుంది. కొన్ని తెలుగు పలుకుబళ్ళు, ఒక చోట కనిపించే సమాస రచన, మరొకచోట ఎత్తుగడలను చూస్తే వీరు ఆంగ్లంలో ఆలోచించి తెలుగులో రాసినట్టుగా తోస్తుంది. దానికి ఆంగ్లంలో ఉన్న పాండిత్యాధికారం కారణం అంటే తప్పు లేదు.

**'నన్ను హారంగా గ్రుచ్చి/ శాశ్వతోపరి నిశ్శబ్ద పీఠస్థితి/ అమృతత్వ కంఠంలో వేసింది'** (పు.24)

**'అతని సాంద్రనీల దేహంలో/ నిబిడీకృతమైన / అప్రమేయ అంధకారాన్ని/ అతని అరిమిత దయాదాక్షిణ్యాలు/ ప్రజ్వలింప జేస్తుంటాయి'** - అన్న వాక్యాలు ఇంగ్లీషు భావనలో ఎంతో మృదులమై సాగివుండవచ్చుననిపిస్తాయి.

బాపురెడ్డిగారి అక్షరానుభూతులు 'అంతర్జాతీయ స్థాయి'లో విస్తృతమైన, 'నిత్యదిన యాత్రానుభూతులు'గా వారి హృదయాన్ని ఆవిష్కరిస్తాయి.

**డా॥ రాజేశ్వరీ దివాకర్ల**

*(అక్షరానుభూతులు - డా॥ జె. బాపురెడ్డి, వెల: రూ.100/-, జుబిలి పబ్లికేషన్స్, హైదరాబాదు-500 033)*

* * *

గీటుబాయి-3

# అంతర్జ్వనం - కె. శివారెడ్డి

కె. శివారెడ్డిగారు 'ఆటో' పటాటోపానికి గురియై హాస్పిటల్ పాలైన సమయంలో 'ఎనిమిది నెలల అనంతగదిజైలు నిర్బంధంనుంచీ దుఃఖంనించీ కదలిన కవితలను' 'అంతర్జ్వనం'గా సంపుటీకరించారు. మంచి కవిత్వం చదివితే మంచి భోజనం చేసినట్లుండాలనుకుంటే ఇది మంచి కవిత్వంకాదు. ఇదంతా 'గదిలో కూచున్నవాడి ప్రపంచం'. నుంచున్న, పడిపోయిన పుస్తకాలూ, పాతపేపర్లూ కొన్నిజ్ఞాపికలూ, ఖాళీ ఫ్లవర్ వేజ్, అర్ధాకలితో ఉన్న బౌద్ధ భిక్షువూ దీని ప్రతీకలు, కవితలకు నంబర్లే తప్ప పేర్లుండవు. ఇదంతా 'ఏకోరసః కరుణ ఏవ' కావచ్చు. కొండొకచో బీభత్సరసప్రధానం కావచ్చు. ఆరెండిటి సంకరమూ కావచ్చు. 'బీభత్సం రసమైతే దానిస్థాయి జుగుప్స' కాబట్టి ఉపమానాలూ అలాగే ఉంటాయి చూడండి!

'మూత్ర విసర్జన చేశాక/ చివరి చుక్కలు రాలటానికి/
అంగాన్ని విదిల్చినట్టు/ కొన్నింటిని విదిల్చి వేయాలి
లేకుంటే హృదయం తడిసి పోతుంది/ ఒక్కొక్కపుడు
నిర్దయే దయ ఔతుంది/ క్రూరత్వమే కారుణ్యమౌతుంది' **(14)**

రోజులన్నీ ఒకేలా ఉండవు కాబట్టి పరిస్థితి మారుతూంటుంది

'ఒకమేఘం ముక్క విమానం వెళ్ళిపోయాక మిగిలే పొగజాలు
ఇంకొంచెంపైన నీలనీలంగా కనిపించే ఆకాశ సముద్రం'**(7)** అవునుమరి!

'ఏ శబ్దగతం లేకుండా/ ముందు కెవడు నడుస్తాడు?
దుమ్ము పట్టిన ఆకాశం అద్దమ్మీద/ వేలితో
అద్భుత కవితా వాక్య మెవడు రాస్తాడు?' **(10)** కవికి తప్పదు.

'తలుపుల్ని ఎప్పుడూ/
ఓరగా తీసి ఉంచడమే మంచిది/ మల్లెపూలు పెట్టుకున్న
పక్కింటి/ పదహారేళ్ళ అమ్మాయి ''ఏదో కావాలని''/
తలుపు కొట్టకుండానే అదృష్టం అడుగిడవచ్చు'। **(21)**

(Quotation Marks కవివే)

కవి ఇలా విషాదాన్నించి నిర్వేదానికి, అందులోంచి ఆనందానికి చంక్రమణం చేస్తూన్నప్పుడు అతని కవిత సారూప్యాన్నించి వైరూప్యానికి, వైరూప్యాన్నించి నైరూప్యానికి పయనిస్తుంది.

'కొన్ని సంజ్ఞలు, కొన్ని భంగిమలు, కొన్నిసైగలు,
కొన్ని ఉపమలూ, కొన్ని రూపకాలూ,
విరిగిన చేతులూ, తెగిన తలలూ, మొండి దేహాలూ,
చెక్కిన ముఖాలూ, కోసేసిన నాలుకలూ.....'

ఏమిటదంతా అని అడగడానికి లేదు

'ఈ (రెండు) పాదాలూ మీకేం చెబుతాయి!
ఏమీ చెప్పకపోవచ్చు
ఏమీ చెప్పక పోవటం కూడా
ఒక రకంగా చెప్పడమేనేమో!' (26)

అందుకు కవి బాధ్యత ఏమీ లేదు

ఈరకమైన ఆత్మాశ్రయత్వంనించి బయట పడటంలో మనిషి 'స్వప్న ఖచిత కిరీటధారి..... నిరంతర కరవాల ధారి' అవుతాడు. (31)

'డాక్టర్లు గూడా/చేయాల్సిందంతా చేసి/ కొంతభాగాన్ని
కాలానికి వదిలేస్తారనుకుంటా.... కాళ్ళు లేకున్నా
నడవడం ఆగదు కాబట్టి/ అసలు మృత్యువు నడక-
ఆగడం లోనే ఉంది కాబట్టి' (41)

'అన్నీ ఖండితాల మధ్య అఖండ జీవ
ధారను గుర్తించి
కొమ్మలన్నీ నరికేసినా చిగురిస్తాడు
వేళ్ళల్లోంచి మళ్ళీ మళ్ళీ జన్మిస్తాడు' (49)

మధ్య మధ్యలో మందిరం మసీదూ (52), పిల్లల పెంపకం (62) కనబడినా

'నిర్జీవిని సజీవిని చేసే
సంజీవినీ పుల్లతో రాస్తున్న పద్యాలివి
పరమార్థం ఏమీలేదు - బతకడమే' (57)

మొత్తానికి 'ఇప్పటిదాకా పుస్తకం నువ్వు చదివావ్
ఇప్పుడు పుస్తకం నిన్ను చదవటం మొదలెట్టింది' (48)

అని ముప్పాతిక కవితల ఈ (అ) ఖండ కావ్యానికి ఫలశ్రుతి చెప్పుకోవచ్చు.

-ఇంద్రకంటి పినాకపాణి

# సాహిత్య వార్తలు

## 1. బెంగుళూరులో 'శ్రీరస' వారి 'నెలనెలా వెన్నెల' కార్యక్రమం, ఫిబ్రవరి 26, 2002. డా॥ సి. మృణాళిని, ఆచార్య పి.యల్. శ్రీనివాసులురెడ్డిగారల ప్రసంగాలు.

బెంగుళూరులోని శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్యవారి ''నెలనెలా వెన్నెల'' కార్యక్రమం ఫిబ్రవరి 26వ తేదీన శ్రీమతి అంబికా అనంత్ గారింట్లో జరిగింది. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలోని తులనాత్మక అధ్యయన కేంద్రంలో రీడరుగా పనిచేస్తున్న డా॥ సి. మృణాళిని గారు ''తెలుగు నవలా వికాసం'' అనే అంశంపై చక్కగా ప్రసంగించి సభ్యుల్ని ఆనందింప జేశారు. శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో తెలుగు ప్రొఫెసర్‌గా పనిచేస్తున్న డా॥ పి.యల్. శ్రీనివాసులురెడ్డిగారు ఎల్లన కవిత్వ విశేషాలను తెలియజేశారు. సభకు ఆచార్య తంగిరాల అధ్యక్షత వహించారు. డా॥ దివాకర్ల రాజేశ్వరిగారి వందన సమర్పణతో సభ ముగిసింది. అంబికగారు సభ్యులకు విందు ఏర్పాటు చేశారు.

## 2. బెంగుళూరులో మహాసహస్రావధాని శ్రీ వద్దిపర్తి పద్మాకర్ 'గజేంద్రమోక్షం' పురాణ ప్రవచనం, మార్చి 10, 2002

''త్రిభాషా మహాసహస్రావధాని'' (తెలుగు, సంస్కృతం, హిందీ) శ్రీ వద్దివర్తి పద్మాకర్ (ఏలూరు, పశ్చిమగోదావరి జిల్లా) మార్చి నెలలో బెంగుళూరు వచ్చారు. బి.ఇ.ఎల్. తెలుగు సంఘంలో పోతన భాగవతాన్ని గురించి అత్యద్భుతంగా ప్రసంగించారు. మార్చి 10వ తేదీ ఆదివారంనాడు ''సారస'' (సాహిత్య రసిక సమాఖ్య, బెంగళూరు) వారి ఆధ్వర్యంలో జయనగర్‌లో పోతన భాగవతంలోని 'గజేంద్రమోక్షం' పురాణంగా చెప్పారు. శ్రీ పంచాగ్నుల శాస్త్రిగారు, డా॥ సీతారాంగారు ఈ సభను ఏర్పాటు చేశారు. సుమారు నూరుమందికి పైగా సాహిత్య రసికులు ఈ సభకు వచ్చి ఆనందాబ్ధిలో ఓలలాడారు.

## 3. విజయవాడలో ఆచార్య తంగిరాలకు ''నేదునూరి గంగాధరం స్మారక జానపద సాహిత్య అవార్డు'' మార్చి 22, 23 తేదీలు, 2002

''జానపద కళాబ్రహ్మ'', ''కళావిరాట్'' శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారు విజయవాడలో ''జానపద కళాకేంద్రం'', ''ఆంధ్రనాటక కళాపరిషత్తు'' లను స్థాపించి జానపద కళలకు, నాటకరంగానికీ ఎంతో సేవ చేస్తున్నారు. ప్రతి సంవత్సరం జానపద కళల

సంబరాలు జరుపుతారు. ఈ సంవత్సరం మార్చి 22, 23 తేదీలలో ఈ సంబరాలు జరిగాయి. తప్పెటగుళ్ళు, డప్పులు, గరగనృత్యాలు, బుర్రకథలు, గంగిరెద్దులాటలు, హరికథ, వీరనాట్యం జానపదగేయగానం ఇత్యాది కళలు ప్రదర్శించారు. ఈ జానపద కళా సంబరాల సందర్భంగా ప్రముఖ జానపద సాహిత్య పరిశోధకుడు, ''వీరగాథల సవరాల జిమ్మడు'' అయిన ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారిని, ''జానపద వాఙ్మయోద్ధారకుడు'', ''అనాదృత వాఙ్మయ భిక్షువు'' అయిన కీ.శే. నేదునూరి గంగాధరంగారి స్మారక పురస్కారంతో సత్కరించారు. రోటరీ క్లబ్బు వారి సహాయ సహకారాలతో ఈ సంబరాలు నిర్వహింపబడ్డాయి. ఈ రెండు రోజులు జరిగిన సభలకు ''జానపద కళాకేంద్రం'' అధ్యక్షులైన శ్రీ ఎ. మధు(ర) మోహనకృష్ణగారు అధ్యక్షత వహించారు.

## 4. నెల్లూరులో తిక్కన విజ్ఞానకేంద్రం వారి మహాభారతోపన్యాసాలు మార్చి 23 నుండి 27వ తేదీవరకు, 2002.

**- కర్ణపాత్రను గురించి ఆచార్య తంగిరాల వారి ప్రసంగం, 27-3-2002**

నెల్లూరులోని తిక్కన విజ్ఞానకేంద్రంవారు మార్చి 23 నుండి 27వ తేదీ వరకూ (అయిదునాళ్ళు) మహాభారతంలోని ప్రధానపాత్రలను గురించి సుప్రసిద్ధులైన పండితుల చేత ప్రసంగాలు ఇప్పించారు. ప్రతిదినమూ సాయంత్రం 6-30 గంటలకు 'రావుబహదూర్' రేబాల లక్ష్మీనరసారెడ్డి పురమందిరంలో ఈ సభలు అత్యంత వైభవంగా నిర్వహింపబడ్డాయి. నిత్యమూ 200 మందికి పైగా మహాభారత రసికులు వచ్చి ఈ ప్రసంగాలు విని ఆనందించారు.

**సభలు ఈ క్రింది రీతిలో జరిగాయి:**

**23-3-2002:** శనివారం : శ్రీకృష్ణుడు - శ్రీనాగళ్ళ గురుప్రసాదరావుగారు, విజయవాడ.

**24-3-2002:** ఆదివారం: భీష్ముడు - ఆచార్య శలాక రఘునాథశర్మగారు, రాజమండ్రి.

**25-3-2002:** సోమవారం: ద్రోణుడు - శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు, తిరుపతి.

**26-3-2002:** మంగళవారం: ధర్మరాజు - శ్రీ మొవ్వ వృషాద్రిపతిగారు, రేపల్లె.

**27-3-2002:** బుధవారం: కర్ణుడు - ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు, బెంగుళూరు.

సంప్రదాయ సాహిత్యంపై శీతకన్ను పడుతున్న ఈ రోజుల్లో ఇటువంటి సభలు నిర్వహించడం ఎంతగానో మెచ్చుకోదగిన విషయం. మహాభారత, భాగవత, రామాయణాలను గురించి ప్రతి పట్టణంలోనూ ఇటువంటి సభలు జరుపవలసిన అవసరం ఎంతైనా ఉంది. సమాజంలో నీతి నియమాలను కాపాడటానికి, సుస్థిరం చేయటానికీ ఇటువంటి సాహిత్య సభలు ఎంతగానో తోడ్పడుతాయి. తిక్కన విజ్ఞాన కేంద్రం అధ్యక్షులు శ్రీమద్దాలి

మల్లికార్జునరావుగారు, ఉపాధ్యక్షులు శ్రీ వేదం వెంకట రామన్‌గారు, కార్యదర్శి శ్రీ అగస్త్యరెడ్డి వెంకురెడ్డిగారు ఈ మహాభారత సభలను ఘనంగా నిర్వహించినందుకు మిక్కిలి ప్రశంసనీయులు. తిక్కన విజ్ఞానకేంద్ర సంస్థాపకులు కీ.శే. మరుపూరి కోదండ రామిరెడ్డిగారు ప్రాతఃస్మరణీయులు. ఇటువంటి మహాభారతోపన్యాసాలను బెంగుళూరులో నిర్వహించడానికి ''శ్రీరస'' నిశ్చయించింది.

## 5. బెంగుళూరులో 'శ్రీరస' వారి 'నెలనెలా వెన్నెల'
## మార్చి 31, ఆదివారం, 2002

**- 'శ్రీ అన్నమాచార్య గానామృతం' గ్రంథావిష్కరణ, 'చైతన్య కవిత' - 34 & 35 సంయుక్త సంచిక ఆవిష్కరణ మరియు అంకిత మహోత్సవం:**

బెంగుళూరులోని శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్యవారు 'నెలనెలా వెన్నెల' కార్యక్రమం మార్చి 31వ తేదీ ఆదివారంనాడు శ్రీమతి ఆచంట కమలకుమారిగారి ఇంట్లో ఏర్పాటు చేసుకున్నారు. ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారు (కీ.శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారి పుత్రులు) ముఖ్య అతిథిగా విచ్చేశారు. ఆనందమూర్తిగారి భార్య శ్రీమతి చంద్రకళగారు, కుమార్తె శ్రీమతి యోగవందనగారు రచించిన ''శ్రీ అన్నమాచార్య సంకీర్తన గానామృతం'' అనే పుస్తకాన్ని ప్రసిద్ధ సంగీత విద్వాంసురాలు అన్నమాచార్య కీర్తనల ప్రచారకురాలు అయిన శ్రీమతి జయశ్రీగారు ఆవిష్కరించారు. అన్నమాచార్యుల కీర్తనలలో క్రొత్తవి 48 తీసికొని వాటికి స్వరకల్పన రాగతాళ నిర్దేశం చేశారు రచయిత్రులు. అన్నమాచార్యుల కీర్తనలను లోకానికి తెలియచేయటంలో కీ.శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చేసిన కృషిని ముఖ్యఅతిథి సభకు తెలియజేశారు. శ్రీమతి యోగవందనగారు తాను తల్లితో కలిసి స్వరకల్పన చేసిన కొన్ని కీర్తనలను పాడి వినిపించారు. తరువాత ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారు ''చైతన్య కవిత'' 34 & 35 సంయుక్త సంచికను ఆవిష్కరించారు. ఇటువంటి విశిష్టమైన కవిత్వ పత్రిక ఆంధ్రదేశంలోలేదనీ, ఆచార్య తంగిరాలవారి కృషి ప్రశంసనీయమని, దీంట్లో ఉత్తమ కవితలు ప్రచురింపబడుతున్నాయనీ సోదాహరణంగా చెప్పారు. ఈ 'చైతన్య కవిత'ను ఆచార్య తంగిరాల దంపతులు శ్రీమతి ఆచంట కమల కుమారి గారికి అంకితం చేశారు. కమల కుమారిగారు తంగిరాల దంపతులను సత్కరించారు. ఆనందమూర్తిగారి మనుమరాలు చి॥ కామేశ్వరీ యోగకీర్తన ప్రార్థనతో సభ ప్రారంభమయింది. సభకు శ్రీరస అధ్యక్షులు ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు అధ్యక్షత వహించారు. ఆనందమూర్తిగారిని 'శ్రీరస' గౌరవాధ్యక్షులు శ్రీ నిడమర్తి ఉమారాజేశ్వరరావుగారు దుశ్శాలువలతో సన్మానించారు. డా॥ దివాకర్ల రాజేశ్వరిగారు శ్రీమతి జయశ్రీగారినీ, శ్రీమతి ఆచంట కమలకుమారిగారు శ్రీమతి చంద్రకళగారినీ, శ్రీమతి అంబికా

అనంత్‌గారు శ్రీమతి యోగవందన గారినీ చి॥ కామేశ్వరీ యోగకీర్తనని శాలువాలతో పుష్పమాలలతో సత్కరించారు. రాజేశ్వరిగారి వందన సమర్పణతో సభ ముగిసింది. ఆచంట కమలకుమారిగారి కుటుంబం శ్రీరస సభ్యులకు చక్కటి విందు ఏర్పాటు చేశారు.

## 6. శ్రీరస, నెలనెలా వెన్నెల, 20-4-2002, బెంగుళూరు
## ప్రొ॥ తంబుశెట్టి రామకృష్ణగారి స్వీయ కవితాగానం ''నిశ్శబ్దయానం''
## (హైదరాబాదులో సి.నా.రె. చే ప్రొ॥ టి. రామకృష్ణగారి 'నిశ్శబ్దయానం' కవితాసంపుటి ఆవిష్కరణ సభ జరిగింది.)

20-4-2002 శనివారం సాయంత్రం 6 గంటలకు ప్రముఖ కవి, కాలికట్ విశ్వవిద్యాలయంలో బయోసైన్సెస్ ప్రొఫెసర్ తంబుశెట్టి రామకృష్ణగారు తన కవితా సంపుటి ''నిశ్శబ్దయానం'' నుండి కొన్ని కవితల్ని చదివి శ్రీరస సభ్యుల్ని ఆనందింప చేశారు. తరువాత మెదడులో ఒక వైపు సాంకేతిక విద్యల్ని నేర్చుకొనేశక్తి, మరొకవైపు లలితకళల్ని నేర్చుకునేశక్తి ఉంటాయని, ఈ రెండు వైపుల్నీ సమానంగా అభివృద్ధి చేయాలనీ, ప్రొ॥ రామకృష్ణగారు చెప్పారు. భాష మానవ మేధను పెంచుతుందని చెప్పారు. ఈ సభ డా॥ దివాకర్ల రాజేశ్వరిగారింట్లో జరిగింది. ఆచార్య తంగిరాల సభకు అధ్యక్షత వహించారు. ప్రొ॥ రామకృష్ణగారిని తంగిరాలవారు శాలువాతో సన్మానించారు.

## 7. మంగళగిరిలో 24-4-2002నాడు
## డా॥ బాబూ జగజీవన్‌రామ్‌గారి కాంస్య విగ్రహ ఆవిష్కరణ

భారత రాజ్యాంగ నిర్మాణ నిపుణుల కమిటీ సభ్యులు, ప్రపంచంలో మతప్రమేయం లేని మిక్కిలి పెద్దదైన లౌకిక ప్రజాస్వామ్య దేశ మాజీ ఉపప్రధాని, మహోజ్ఞాని, మహామనీషి, ''భారతదేశ అమూల్యరత్నం'' అయిన డా॥ బాబూ జగజీవనరామ్‌గారి కాంస్య విగ్రహ ఆవిష్కరణ సభ 24-4-2002 బుధవారం సాయంత్రం 4 గంటలకు గుంటూరు జిల్లా మంగళగిరిలో ఆర్.టి.సి. బస్టాండు ఎదుట జరిగింది. ఈ క్రింది విధంగా కార్యక్రమం కొనసాగింది.

విగ్రహ ఆవిష్కరణ : గౌ॥ శ్రీ కోట పున్నయ్యగారు, మాజి ఎం.పి. (రాజ్యసభ సభ్యులు)

సభాధ్యక్షులు : గౌ॥ శ్రీ కడియం శ్రీహరిగారు,
రాష్ట్ర భారీ మరియు మధ్యతరహా నీటిపారుదల శాఖామాత్యులు.

కాంస్యవిగ్రహ ప్రదాత : గౌ॥ శ్రీ బుల్లా సుబ్బారావుగారు, ఐ.ఏ.యస్.

ముఖ్య అతిథులు : గౌ॥ డా॥ కోడెల శివప్రసాద్‌గారు,
రాష్ట్ర పౌరసరఫరాల శాఖామాత్యులు.

గౌ॥ శ్రీ జె. ఆర్. పుష్పరాజుగారు,
రాష్ట్ర సాంఘిక సంక్షేమ శాఖామాత్యులు.

గౌ॥ శ్రీమతి యస్.సరస్వతిగారు,
మహిళా శిశుసంక్షేమ శాఖామాత్యులు.

గౌ॥ శ్రీ పాతూరి నాగభూషణంగారు,
ఛైర్మన్, జిల్లాపరిషత్, గుంటూరు.

గౌ॥ శ్రీ కోనేరు రంగారావుగారు,
రాష్ట్ర మాజీ ఉపముఖ్యమంత్రివర్యులు.

## 8. ''గోరు కొయ్యలు''కు ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు

2001 సంవత్సరానికిగాను ''ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు'' మెతుకుసీమ మెదక్‌జిల్లా గజ్వేల్‌కు చెందిన దాసరాజు రామారావుగారి ''గోరుకొయ్యలు'' కవితా సంపుటికి లభించిందని అవార్డు వ్యవస్థాపకులు 'రాధేయ' ఒక ప్రకటనలో పేర్కొన్నారు.

ఈ అవార్డు న్యాయనిర్ణేతలుగా - నిర్మలానంద, ప్రొ॥ ఆర్వీఎస్ సుందరం, దర్భశయనం శ్రీనివాసాచార్యగార్లు వ్యవహరించారు.

నిత్యచలనశీలతను మట్టిపోరు సంస్కృతిని సజీవ కవిత్వంగా మలిచిన దాసరాజు రామారావుగారిని న్యాయనిర్ణేతలు ప్రశంసించారు.

1988నుంచీ ఆధునిక కవిత్వానికి ఈ అవార్డు ప్రకటిస్తున్నామనీ ఈ క్రమంలో ఈ అవార్డు పొందినవారిలో దాసరాజు రామారావుగారు పదునాల్గవవారని 'రాధేయ' వివరించారు.

## 9. రాజమహేంద్రవరంలో డా॥ ఎన్.గోపిగారికి ప్రతిభా వైజయంతిక పురస్కార ప్రదానోత్సవం, 28-4-2002.

రాజమండ్రిలోని ఆంధ్రీ ప్రతిష్ఠాన్ సంస్థ తరపున ''ప్రతిభా వైజయంతిక'' పురస్కారాన్ని 2002 సంవత్సరానికిగాను ప్రముఖ కవి, పరిశోధకుడు ఆచార్య ఎన్. గోపికి ప్రదానం చేశారు. ఏప్రిల్28న సి.ఎస్.ఎల్. ట్రస్ట్ కేప్సర్ హాస్పిటల్ కాన్ఫరెన్స్ హాలులో జరిగిన పురస్కార ప్రదానోత్సవ సభలో డా. గోపిని 25 వేల రూపాయల నగదు, ప్రశంసాపత్రం ప్రదానం

చేసి ఘనంగా సత్కరించారు. సంస్థ కార్యదర్శి శ్రీమతి పట్టపగలు అనంతరామలక్ష్మి స్వాగతం పలుకగా అధ్యక్షులు శ్రీ పట్టపగలు వెంకటరావు పురస్కార ప్రాధాన్యాన్ని వివరించారు. 1995లో స్థాపించిన ఈ అవార్డు లోగడ డా.సి. నారాయణ రెడ్డి, మంగళంపల్లి బాలమురళీ కృష్ణ, ఆచార్య బేతవోలు రామబ్రహ్మం, ఆచార్య చేకూరి రామారావు, మధిర కృష్ణమూర్తి శాస్త్రి వంటి దిగ్గంతులకు ఇవ్వడం జరిగిందని, ఇప్పుడు ప్రముఖ కవి గోపికి లభించడం ముదావహమని పేర్కొన్నారు. ఈసందర్భంగా గోపి విశిష్టతను గురించి జరిగినగోష్ఠిలో వివిధ విద్వాంసులు పాల్గొని ప్రసంగించారు. వి.సి.గా గోపి అనే అంశంపైన ఆచార్య బేతవోలు రామబ్రహ్మం ఉపన్యాసిస్తూ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయాన్ని ప్రాంతీయ దశనుండి అంతర్జాతీయ స్థాయికి తీసికెళ్ళిన ఘనత గోపిదేనన్నారు. 'కవిగా గోపి' అనే అంశాన్ని వివరిస్తూ డా. ఎండ్లూర్లి సుధాకర్ తొమ్మిది కవితా సంపుటాలు ప్రచురించి ఊపిరి తీసుకున్నంత సహజంగా నిరంతరం కవిత్వం రాస్తున్న గొప్ప కవి అని ప్రశంసించారు. డా. పొన్నా లీలావతి 'పరిశోధకుడుగా గోపి' అనే విషయంపై సోదాహరణ ప్రసంగం చేశారు. 'స్నేహితుడుగా గోపి' అనే అంశంపైన గోపి బాల్యమిత్రుడు రాజమండ్రి సెంట్రల్ జైల్ సూపరింటెండెంట్ బి. మహేందర్‌రెడ్డి మాట్లాడుతూ గోపిని తెలంగాణా మట్టిలోంచి కష్టపడి పైకొచ్చిన మొక్కగా అభివర్ణించారు. ఈ సభలో సబ్ కలెక్టర్ వి.శేషాద్రి ఐ.ఎ.ఎస్, స్వతంత్ర హాస్పిటల్ చైర్మన్ గన్ని సత్యనారాయణమూర్తి, పతివాడ సూర్యనారాయణ తదితరులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా సాహిత్యపీఠం మరియు ఆర్ట్స్ కాలెజి విద్యార్థులు గోపిని ఘనంగా సత్కరించారు.

## 10. బెంగుళూరులో 'అరసం' నాల్గవ వార్షికోత్సవం - 'కథాతరంగాలు' ఆవిష్కరణ, మే 12 ఆదివారం 2002

ప్రసిద్ధ కథానికా రచయిత, జర్నలిస్టు, అనువాదకులు అయిన శ్రీ నిడమర్తి ఉమారాజేశ్వరరావుగారు 23-11-1997లో అభ్యుదయ రచయితల సంఘం బెంగుళూరు శాఖను స్థాపించారు. దీని నాల్గవ వార్షికోత్సవం మే 12 ఆదివారం సాయంత్రం 4 గంటలకు తెలుగు విజ్ఞాన సమితి భవనం ప్రాంగణంలో జరిగింది. ఆంధ్రప్రదేశ్ అరసం అధ్యక్షుడు, ప్రసిద్ధ భాషా శాస్త్రవేత్త, ప్రముఖ కథానికా రచయిత ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి, ఆర్వీఆర్, ప్రొ॥ చందు సుబ్బారావు, శ్రీ పెనుగొండ లక్ష్మీనారాయణ, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ మేనేజరు శ్రీ పి. రాజేశ్వరరావు ప్రభృతులు ఈ సభలో పాల్గొన్నారు. ఈ సందర్భంగా బెంగుళూరులోని వివిధ రచయితలు, రచయిత్రులు, ఆంధ్రప్రదేశ్‌లోని మరికొందరు కథానికా రచయితలు వ్రాసిన 37 కథానికలతో కూడిన ''కథా తరంగాలు'' అనే సంకలనాన్ని విశాలాంధ్ర రాజేశ్వరరావుగారు ఆవిష్కరించారు. ప్రొ॥ చందు సుబ్బారావుగారు, శ్రీ పెనుగొండ

లక్ష్మీనారాయణగారు ఈ కథానికల సంకలనాన్ని సమీక్షించారు. ఉమారాజేశ్వరరావు - వి.వి.న. మూర్తిగారు ఈ సంకలనానికి సంపాదకులు. వి.వి.న మూర్తిగారు రచించిన ''దిశ'' అనే కథానికా సంకలనాన్నికూడా ఈ సందర్భంగా ఉమారాజేశ్వరరావుగారు ఆవిష్కరించారు. ఈ ''కథ తరంగాలు'' అనే సంకలన గ్రంథం కర్ణాటక రాష్ట్రంనుండి వెలువడిన మొట్టమొదటి కథానికా సంకలనం అని పెనుగొండ లక్ష్మీనారాయణగారు పేర్కొన్నారు.

## 11. తిరుపతిలో ఆచార్య రవ్వా శ్రీహరిగారికి ఆచార్య తిమ్మావజ్ఝుల కోదండరామయ్య స్మారక సాహిత్య పురస్కారం, జూన్ 1, 2002

1995లో తిరుపతిలో ఏర్పడిన ''కోదండరామ మిత్రమండలి''వారు ప్రతి సంవత్సరం కీ.శే. ఆచార్య తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారి స్మారకంగా ఒక ప్రసిద్ధ సాహిత్యవేత్తను సత్కరిస్తున్నారు. ఈ సంవత్సరం కుప్పంలోని ద్రావిడ విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులైన ఆచార్య రవ్వా శ్రీహరిగారిని సత్కరించారు. ఈ సత్కారసభ సాధారణంగా కోదండరామయ్యగారి జన్మదినమైన ఫిబ్రవరి 2వ తేదిన జరుగుతూ వస్తోంది. క్రిందటి సంవత్సరం కోదండరామయ్యగారి వర్ధంతి అయిన మే 27 వ తేదిన జరిగింది. ఈ సంవత్సరం అనివార్యకారణాలవల్ల జూన్ 1వ తేదీ శనివారం సాయంత్రం 5.30గంటలకు జరిగింది. తిరుపతిలో గోవిందరాజస్వామి తేరువీథిలో ఉన్న భీమాస్ డీలక్స్ కాన్ఫరెన్స్ హాలులో జరిగిన ఈ సభకు ఆచార్య కె. సర్వోత్తమరావుగారు ముఖ్య అతిథిగా విచ్చేశారు. శ్రీ సింగరాజు సచ్చిదానందంగారు స్వాగతవాక్యాలు పలికారు. డా॥ ముదివేడు ప్రభాకరరావుగారు సన్మానగ్రహీతను సభకు పరిచయం చేశారు. 'సహస్రావధాన బ్రహ్మ' డా॥ మేడసాని మోహన్‌గారు ప్రధానవక్తగా పాల్గొన్నారు. కోదండరామయ్యగారి ప్రియశిష్యులైన ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు (బెంగుళూరు) ఈ సభకు అధ్యక్షత వహించవలసి ఉండగా, అనారోగ్యం కారణంవల్ల ఆయన సభకు రాలేకపోయారు. కోదండరామయ్యగారి ఏకైక పుత్రిక డా॥ పి. వత్సల వందన సమర్పణతో సభ ముగిసింది.

## 12. తణుకులో డా॥ ఎన్.గోపిగారికి 'తిలక్ సాహిత్య పురస్కారం', ఆగస్టు 25, 2002

'తిలక్ అవార్డు - 2002'ను విద్యావేత్త, విమర్శకులు, మానవతా కవి అయిన ఆచార్య ఎన్. గోపికి బహూకరించిన నన్నయభట్టారకపీఠం సాహిత్య సభకు డా॥ జియస్వీ ప్రసాద్ అధ్యక్షత వహిస్తూ శ్రీ ఎన్. గోపి తెలుగు సాహిత్యానికి చేసిన సేవలను ప్రస్తుతించారు.

వర్ధమాన కవులను ప్రోత్సహిస్తున్న జాతీయ కవి అని, 'నానీలు' అనే క్రొత్త ప్రక్రియకు సృష్టికర్త అని ప్రస్తుతించారు. డా॥ శ్రీపాద కృష్ణమూర్తి సభాప్రారంభం చేస్తూ, తిలక్ సాహిత్యాన్ని ప్రచారం చేయాలని కోరారు. కుమారి కె. రాజేశ్వరి ప్రార్థన చేయగా, ముఖ్య అతిథి, సన్మాన గ్రహీత అయిన డా॥ గోపిని శ్రీకొప్పర్తి పరిచయం చేసారు. ఆచార్య ఎన్.గోపిని నన్నయ భట్టారకపీఠం తరపున డా॥ జీయస్వీ ప్రసాద్ తిలక్ అవార్డుతో ఘనంగా సత్కరించారు. డా॥ శ్రీపాద, డా॥ తాతిని రామబ్రహ్మం, డా॥ వి.వెంకట్రాజు, రసరాజు, డి.జి. రామారావు, ప్రభృతులు సన్మానంలో పాల్గొన్నారు. డా॥ శ్రీపాద కృష్ణమూర్తితో కలిసి ఈ తిలక్ సాహిత్య పురస్కారాన్ని స్థాపించిన ఆచార్య తంగిరాల సుబ్బారావుగారు అనారోగ్య కారణంగా ఈ సభకు రాలేకపోయారు.

ముఖ్య అతిథి, సన్మాన గ్రహీత ఆచార్య గోపి ప్రసంగిస్తూ కవి ఎప్పుడూ పసివాడనీ, ఆవిధంగా తిలక్ ఆంధ్ర దేశంలోని ప్రతి యువకుని మనసులో నిలచి ఉన్న కవి అన్నారు. కాలం కవిత్వానికి లక్షణం అని, ఆ విధంగా నన్నయ, తిక్కన, తిలక్ మొదలగు కవులు ఆకాలానికి అనుగుణంగా కవిత్వాన్ని వ్రాసారు అన్నారు. కాలం నిరంతరం చక్రం అనిపేర్కొన్నారు. తిలక్ ధ్వనిప్రధానమైన కవిత్వం వ్రాసారని, తిలక్ వ్రాసిన కవితలు హృద్యంగా చదివారు ఆచార్య గోపి. మానవధర్మం మీద ఎక్కువ నమ్మకం కలవ్యక్తి తిలక్ అని, ఆయన ఎప్పుడూ నిరాశావాది కాదని, రమణీయమైన కవిత్వం చెప్పాడని ఆచార్య గోపి పేర్కొన్నారు. మధ్య తరగతి కుటుంబాల బాధలను వ్యక్త పరుస్తూ వ్రాసిన తిలక్ కవిత్వ విశేషాలు గోపి సభలో తెలియజేశారు.

తొలుత నన్నయభట్టారకపీఠం ప్రధాన కార్యదర్శి శ్రీసుశర్మ స్వాగతం పలుకుతూ ''మానవ సంబంధాలే డా॥ గోపికి ఆక్సిజన్' అని తెలుగు సాహిత్యంలో అన్ని ప్రక్రియలను స్పృశించి, గ్రంథ రూపంలోనికి తీసుకొని వచ్చిన మహాకవి గోపి అని పేర్కొన్నారు. శ్రీ జి.ఎల్.ఎన్. మూర్తి వందన సమర్పణతో సభ జయప్రదంగా ముగిసింది.

- సుశర్మ, ప్రధాన కార్యదర్శి, నన్నయ భట్టారకపీఠం

## 13. నంద్యాలలో తెలుగు పండితులు విద్వాన్ శ్రీ జి. సుబ్రహ్మణ్య శాస్త్రిగారి ఉద్యోగ విరమణ సందర్భంగా మహా గురుపూజోత్సవం, 29-9-2002.

కవి, కథకుడు, విమర్శకుడు, నవలారచయిత, శిష్యకోటి హృదయ సామ్రాజ్యాధిష్ఠితుడు, సుమనస్వి, సోదరోపాధ్యాయ హృదయాంతరంగ భాసితుడు, సరస సంభాషణా చతురుడు, శిష్య వత్సలుడు, విశిష్టగుణ సంపన్నుడు, పాండితీ విభవ సుందరుడు, నంద్యాల మునిసిపల్ హైస్కూలు ప్రధాన తెలుగు పండితుడు అయిన విద్వాన్ శ్రీ

గొట్టిముక్కల సుబ్రహ్మణ్య శాస్త్రిగారికి ఉద్యోగ విరమణ సందర్భంగా 29-9-2002 ఆదివారం సాయంత్రం 5 గంటలకు కర్నూలు జిల్లాలోని నంద్యాల మునిసిపల్ హైస్కూలు ఆవరణలో మహా గురుపూజోత్సవం జరిగింది. ఆంధ్రప్రదేశ ఉన్నత విద్యాశాఖామాత్యులు శ్రీ ఎన్. మహమ్మద్ ఫరూక్‌గారు, నంద్యాల మునిసిపల్ చైర్మన్ 'దానకర్ణుడు' శ్రీ ఎస్.పి.వై.రెడ్డిగారు, మునిసిపల్ వైస్ చైర్మన్ శ్రీ మాఘం పుల్లయ్యగారు, కర్నూలు జిల్లా విద్యాధికారి శ్రీ ఎస్. జగన్నాథరెడ్డిగారు, మునిసిపల్ కమీషనర్ శ్రీ రాజేంద్ర ప్రసాద్‌గారు, టి.వి. మరియు సినీ రచయిత శ్రీ యామినీ సరస్వతిగారు ఈ సన్మాన సభలో పాల్గొన్నారు. ఉస్మానియా యూనివర్సిటి తెలుగు ప్రొఫెసర్ ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డిగారు ప్రధానవక్తగా ఉపన్యసించారు. ఈ సన్మాన సంఘానికి ప్రముఖ కవి, రచయిత, సూరన సారస్వత సంఘాధ్యక్షులు, సర్జన్ డా॥ గెలివి సహదేవుడుగారు అధ్యక్షులు. శ్రీ ఎస్. మహమ్మద్ కరీముద్దీన్‌గారు కన్వీనరు.

## 14. డా॥ ఆవంత్స సోమసుందర్ లిటరరీ ట్రస్ట్ (డా॥ సోమసుందర్ సాహిత్య పురస్కారం), పిఠాపురం, నవంబరు 2002

2002వ సంవత్సరం నవంబరు 18వ తేదీకి డా॥ ఆవంత్స సోమసుందర్‌కు 78 సంవత్సరాలు నిండాయి. ఆ రోజున జరిగే జన్మదినోత్సవాన్ని పిఠాపుర సాహిత్యోత్సవంగా ప్రతి సంవత్సరం జరపడానికి గాను ధర్మనిధి (ట్రస్టు) ఏర్పాటు చేయబడింది. ఈ నిధి నుంచి వచ్చే ఆదాయం నుంచి ప్రతిసంవత్సరం ఇదే తేదీని ఒక ఉత్తమ కవికి గాని, ఉత్తమ సాహిత్య విమర్శకునికిగాని ''డా॥ సోమసుందర్ సాహిత్య పురస్కారం'' గా ఐదువేల రూపాయల నగదు, నూత్న వస్త్రాలతో సన్మానం చెయ్యాలని నిశ్చయించాము.

దాదాపు మూడు వందల ఏభై సంవత్సరాలుగా పిఠాపురం సంస్థానాధిపతులు అఖిలాంధ్ర సాహిత్య లోకానికి పిఠాపురాన్ని ఒక పటిష్ఠమైన కేంద్రంగా రూపొందించారు. ఎందరో కవులను పోషించారు. ఈ సంస్థాన పోషణలో ప్రవర్ధిల్లిన సాహిత్యానుస్యూతి 1940నుంచి ఆగిపోయింది. అనంతరం శ్రీ సూర్యరాయ విద్యానంద గ్రంథాలయం, నవ్య కళా సమితి, కళాకేళి నికేతన్, పిఠాపురం సాహితీ సమితి వంటి సంస్థలు మాత్రం యథాశక్తిని సాహితీ సత్కారం చేస్తూ వచ్చాయి. గురుదేవులు దేవులపల్లి కృష్ణశాస్త్రి 1948 వరకూ పిఠాపురం సాహిత్యాభిమానులకు గొప్ప ప్రేరణశక్తిగా ఉండేవారు. తదుపరికాలంలో సాహిత్య కార్యక్రమాలను ఆవంత్స సోమసుందర్, చెలికాని భావనరావు, రాంషా, శశాంక, ఆకొండి వెంకటరత్నం, పన్నాల సుబ్రహ్మణ్య భట్టు ప్రభృతులు నిర్వహిస్తూ వచ్చారు. సభలూ, సమావేశాలూ, సత్కారాలూ, గోష్ఠులూ ఇంతవరకూ యథాశక్తిగా జరుపబడుతూనే ఉన్నాయి. కాని, రాను రాను మన సంస్కృతి పెడమార్గాలు పట్టి ఇతరేతర ఆకర్షణలకు లోనవుతోంది. సాహిత్య కార్యక్రమాల పట్ల శ్రద్ధ చూపేవాళ్ళు కరవైపోతున్నారు. ఇట్టి విషమస్థితిలో

పిఠాపురంలో వెలిగించబడిన సాహిత్యజ్యోతులు ఆరిపోకుండా కాపాడాలన్న కాంక్షతోనే సోమసుందర్ సాహిత్యనిధిని ఏర్పాటు చేశాము. గత నాలుగు శతాబ్దాలుగా ఎందరో కవులను ప్రోత్సహించి, పోషించి, ఉత్తమ సాహితీ కృతులను వెలయించిన పిఠాపురం గత చరిత్ర వైభవాన్నైనా స్మరింకునే సహృదయులు రాగల కాలాల్లో మరీ అరుదైపోతారేమోనన్న భయంతోనే యథాశక్తిగా ఈ చిన్న నిధి ఏర్పాటు చేయడం జరిగింది.

దీనిని ఆంగ్లంలో ''డా.ఆవంత్స సోమసుందర్ లిటరరీ ట్రస్ట్'' అనీ, తెలుగులో ''డా.సోమసుందర్ సాహిత్య పురస్కారం'' అనిన్నీ పేర్కొనడానికి నిశ్చయించి మూలనిధి సమకూర్చి బేంకులో జమచేయడమైంది. ఈ నిధిని మరింతగా పెంపొందిండానికి మిత్రుల ఆర్థికసహాయం అర్థించదలుచుకోలేదు. డా. సోమసుందర్‌పై అభిమానంతో గాని, ఈ నిధిని పెంపొందించి సత్కార్యాలు జరపాలన్న సదుద్దేశంతో గాని, మిత్రులెవరైనా స్వచ్ఛందంగా సహకరించదలచిన వారికి ఈ ట్రస్టు బోర్డు కృతజ్ఞతలర్పిస్తూ స్వీకరిస్తుంది. దీనికి ఒక శాశ్వత కార్యవర్గాన్ని ఏర్పాటు చేయడమైనది.

గమనిక: 2002వ సంవత్సరం నవంబరు 18వ తేదిన జరిగిన పిఠాపురం సాహిత్యోత్సవంలో ప్రముఖ కవి విమర్శకుడు పండితుడు అయిన డా॥ మిరియాల రామకృష్ణగారికి ''డా॥ సోమసుందర్ సాహిత్య పురస్కారం'' ఇవ్వబడింది.

శ్రీనివాసా నర్సింగ్‌హోమ్ — అభినందనలతో
చర్చిసెంటర్ — అధ్యక్షులు : డా॥ కె. వెంకటరావు
పిఠాపురం - 533 450. — ఉపాధ్యక్షులు: డా. చాపరాల బాబూరావు చౌదరి,
ప్రొ॥ చందు సుబ్బారావు, కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ
కార్యదర్శులు: విరియాల లక్ష్మీపతి,
ఉపేంద్ర శాతకర్ణి ఆవంత్స, కొంపెల్ల కామేశ్వరరావు

## 15. 'గాలికట్ట'కు ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు

గత పదిహేను సంవత్సరాలుగా ఆధునిక కవులు ప్రతిష్ఠాత్మకంగా భావిస్తున్న ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు-2002 కోసం పి. విద్యాసాగర్ కవితా సంపుటి 'గాలికట్ట' ఎంపికైందని అవార్డు వ్యవస్థాపకులు, ప్రముఖ కవి శ్రీ రాధేయ ఒక ప్రకటనలో పేర్కొన్నారు.

ఈ అవార్డు న్యాయ నిర్ణేతలుగా ప్రముఖ కవులు శ్రీ కె. శివారెడ్డి, నందిని సిద్దారెడ్డి, డా॥ దేవరాజు మహారాజు గార్లు వ్యవహరించారు.

అవార్డు పొందిన పి. విద్యాసాగర్ ఖమ్మం జిల్లా పాల్వంచకు చెందినవారు. ఈ అవార్డు పొందిన వారిలో విద్యాసాగర్ పదిహేనవ వారని రాధేయ అన్నారు.

ఆదివాసీ గిరిజన జీవితాన్ని కవితావస్తువుగా స్వీకరించి, అరణ్య హృదయ అంతరంగ సంఘర్షణను అద్భుతంగా చిత్రించిన కవిత్వమే 'గాలికట్ట'గా న్యాయ నిర్ణేతలు పేర్కొన్నారు.

– రాధేయ, కొత్తచెరువు

## 16. 'శ్రీ రస' వారి 'సాహిత్య సంక్రాంతి'

## బెంగుళూరు, 12-1-2003, ఆదివారం సాయంకాలం 4 గంటలకు

### ప్రస్తావన

''సాహిత్యరసికులైన సభాసదులందరికీ నూతన సంవత్సర శుభాకాంక్షలు మరియు సంక్రాంతి శుభాకాంక్షలు ...

'శ్రీరస' అంటే 'శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య'. ఈ చిన్న సాహిత్య సంస్థను మేము 1994వ సంవత్సరం ఏప్రిల్ 11వ తేదీని - అంటే భావనామ సంవత్సర ఉగాదినాడు - మహాలక్ష్మి లేఅవుట్ లో ఉన్న డా॥ దివాకర్ల రాజేశ్వరిగారింట్లో స్థాపించాం. దీనిని ప్రారంభించినవారు ప్రముఖ ప్రయోగవాద కవి శ్రీ ''పఠాభి''గారు - అంటే శ్రీ తిక్కవరపు పట్టాభిరామరెడ్డిగారు. ఆ ప్రారంభసభకు కన్నడంలోని ప్రసిద్ధ దళితకవి డా॥ సిద్ధలింగయ్యగారు కూడా వచ్చారు. ఆనాడు ఉగాది కవితాగోష్ఠితో ''శ్రీరస'' ప్రారంభమయింది.

తరువాత రెండు సంవత్సరాల పాటు పెద్దగా కార్యక్రమాలు జరగలేదు. తిరిగి 1996వ సంవత్సరం సెప్టెంబరు 9వ తేదీ సోమవారం సాయంకాలం 5 గంటలకు మల్లేశ్వరం 13వ క్రాస్‌లో ఉన్న శ్రీమతి అంబికా అనంత్‌గారింట్లో 'శ్రీరస'కు 'పునర్జన్మ' కలిగింది. శ్రీ పేరాల భరతశర్మగారూ, శ్రీ విశ్వనాథ పావనిశాస్త్రిగారూ శ్రీరసను పునః ప్రారంభించారు. అప్పటినుండి ఇప్పటివరకూ ఇంచుమించు నెలకొకసారి ''నెలనెలా వెన్నెల'' పేరుతో కవితాగోష్ఠులు సాహిత్యగోష్ఠులు నిర్వహిస్తూ వచ్చాం. కవులు రచయితలు సాహిత్యప్రియులు ఈ గోష్ఠులలో పాల్గొని ఆనందిస్తూ వచ్చారు. ఈకార్యక్రమాలు సాధారణంగా మల్లేశ్వరంలోని శ్రీమతి అంబికా అనంత్‌గారింట్లోకాని, మహాలక్ష్మి లేఅవుట్ లోని డా॥ దివాకర్ల రాజేశ్వరిగారింట్లోకాని జరుగుతూ ఉంటాయి.

''నెలనెలా వెన్నెల''వంటి చిన్న చిన్న సాహిత్య కార్యక్రమాలే కాకుండా, ఏడాదికి రెండు మూడు పెద్ద పెద్ద సాహిత్య సభలు కూడా నిర్వహిస్తూ ఉంటాం. ఇవి ఎక్కువగా ''సంక్రాంతి''కి, ''ఉగాది''కి, ''విజయదశమి''కి ఏర్పాటు చేస్తూ ఉంటాం. ''సాహిత్య సంక్రాంతి'' - ''సాహిత్య వసంతం'' - ''సాహిత్య శరత్తు'' అని వీటికి పేర్లు. మా ''చైతన్య కవిత'' అనే కవిత్వ పత్రిక కూడా ప్రతి సంవత్సరం వసంతంలో ఒక సంచిక, శరత్తులో మరొక సంచిక వెలువడుతూ ఉంటాయి.

క్రిందటి సంవత్సరం మేనెలలో నాకు అనారోగ్యం సంభవించింది. అందువల్ల ''సాహిత్య వసంతం'' ''సాహిత్య శరత్తు'' కార్యక్రమాలు నిర్వహించలేకపోయాం. ''చైతన్యకవిత'' కూడా క్రిందటి ఏడాది ''వసంతసంచిక'' ఒక్కటే వెలువరించగలిగాం. ఈ 2003వ సంవత్సరాన్ని ''సాహిత్య సంక్రాంతి'' సభతో ప్రారంభిస్తున్నాం. చైతన్య కవిత శరత్సంచిక ముద్రణలో ఉంది. త్వరలో వెలువడబోతోంది. (దీనిని స్వభాను వసంత సంచికతో కలిపి ప్రచురించే ఆలోచన కూడా ఉంది).

ఈ 'సాహిత్య సంక్రాంతి' సభను నిర్వహించడానికి చేయూతనిచ్చిన వదాన్యులూ శ్రీ కె.పి. రావుగారికి ముందుగా నమస్కరిస్తున్నాను. వీరు తూర్పు గోదావరీ మండలానికి చెందినవారు. కూచిమంచి తిమ్మకవి, కూచిమంచి జగ్గకవుల వంశంలోనివారు. తెలుగు విజ్ఞాన సమితికి రెండు పర్యాయాలు అధ్యక్షులుగా ఉండి, దానికి 25 లక్షల నిధిని సేకరించి పెట్టిన మహానుభావులు. బెంగుళూరులో అతి ప్రసిద్ధులైన ఆడిటర్‌గారు!

ఈ ''సంక్రాంతి సాహిత్య సభ'' ''హాస్యభారతి'' అనే ఉపన్యాసంతో ప్రారంభమవుతోంది. వక్త శ్రీ ఆమళ్ళదిన్నె గోపీనాథ్‌గారు - వీరు ఆంధ్ర ప్రదేశ్‌లోని అనంతపురానికి చెందినవారు. సుప్రసిద్ధ జానపద సాహిత్యవేత్తలు, జానపదగాయకులు, హాస్యరసాన్ని సిద్ధింపజేయుటంలో దిట్టలు, రంగస్థలనటులు, ''హాస్య భారతి'' బిరుదాంకితలు, సభానిర్వహణ చతురులు, ''రాయలసీమ రత్నం''. వీరి రచనలు: ''హాస్యభారతి'' - ''సభాపర్వం'' - ''అవధానాల్లో అప్రస్తుత ప్రసంగాలు'' ''ఇదేనా మన సంస్కృతి'' - ''సర్వోత్తముడు గాడిచర్ల'' - ''మహామేధావి కట్టనుంచి'' - ''ముసలమ్మ త్యాగం'' - ''రాయలసీమ జానపద గేయాలు'' మొదలైనవి. ఇప్పుడు శ్రీ అమళ్ళదిన్నె గోపీనాథ్‌గారు తెలుగు సాహిత్యంలోను, ముఖ్యంగా జానపద గేయాలలోను, నిత్య జీవితంలోను, సాహిత్య సభలు నిర్వహించడంలోనూ దాగిఉన్న హాస్య రసాన్ని, విచిత్ర సన్నివేశాలను మనకు మనోల్లాస జనకంగా వివరిస్తారు''.

బెంగుళూరు — తంగిరాల వెంకట సుబ్బారావు
12-1-2003 వ్యవస్థాపక అధ్యక్షుడు, ''శ్రీరస''

**సభా విశేషాలు:**

పై సభకు శ్రీ కె.పి. రావుగారు ముఖ్య అతిథిగా విచ్చేశారు. డా॥ దివాకర్ల రాజేశ్వరిగారి ప్రార్థనతోను స్వాగతవచనాలతోను సభ ప్రారంభమయింది. ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావుగారు సభకు అధ్యక్షత వహించి పైన తెల్పిన ప్రస్తావన కావించారు. శ్రీ అమళ్ళ దిన్నె గోపీనాథ్‌గారు జానపద సాహిత్యంలోని హాస్య రసాన్ని గురించి సోదాహరణంగా ప్రసంగించారు. సభ నవ్వుల పువ్వులతో విరబూసింది. శ్రీ బి. త్రినాథ

రెడ్డిగారు రచించిన ''ఆలోచించండి ఒక్క క్షణం'' (భగవద్గీతకు ఆధునిక వ్యాఖ్య) అనే గ్రంథాన్ని శ్రీ కె.పి. రావుగారు ఆవిష్కరించారు. ప్రముఖ కవి శ్రీ 'అశ్విని' (శ్రీనండూరి భాస్కర్‌గారు) గ్రంథాన్ని పరిచయంచేశారు. శ్రీ కె.పి. రావుగారు ప్రధానవక్తయైన శ్రీ అమళ్ళదిన్నె గోపీనాథ్‌గారిని వేయినూటపదహార్లతోను శాలువాతోను సత్కరించారు. ఇటువంటి సాహిత్య సభలు తరచుగా జరపాలని సూచించారు. సంస్కృత సాహిత్యంలో కాని, ప్రాచీనాంధ్ర సాహిత్యంలో కాని, హాస్యరసం ఎక్కువగా లేదనీ, ఆంగ్ల సాహిత్య ప్రభావంతో ఆధునిక సాహిత్యంలోనే హాస్యరస ప్రధానమైన రచనలు పుష్కలంగా వెలువడ్డాయనీ ఆచార్య తంగిరాల తమ మలిపలుకులలో తెలియజేస్తూ, సంస్కృతంలో ఉన్న హాస్యరసభరితమైన ఒక శివస్తుతి శ్లోకాన్ని చదివి వివరించారు. శ్రీమతి రోహిణీ సత్యగారి వందన సమర్పణతో సభ ముగిసింది. శ్రీమతి కూచిమంచి సీతామహాలక్ష్మి శ్రీ కూచిమంచి పూర్ణచంద్రరావు దంపతుల సౌజన్యంతో శ్రీరసవారు ఈ సభను ఏర్పాటు చేశారు.

## 17. బెంగుళూరులో దాసరి అమరేంద్రగారి కథానికల సంపుటి ''శేఫాలిక'' ఆవిష్కరణ, 21-3-2003.

బెంగుళూరులో మల్లేశ్వరంలోని ''గాంధీ సాహిత్య సంఘం''లో 21-3-2003 శుక్రవారం సాయంత్రం 6 గంటలకు ప్రముఖ రచయిత శ్రీదాసరి అమరేంద్రగారు రచించిన ''శేఫాలిక'' అనే కథానికల సంపుటి ఆవిష్కరణ సభ జరిగింది. బెంగుళూరు విశ్వవిద్యాలయ విశ్రాంత ఆచార్యులు డా॥ తంగిరాల వెంకటసుబ్బారావు ఈ గ్రంథాన్ని ఆవిష్కరించారు. ప్రకృతి సౌందర్యం, మహిళాభ్యుదయం, ఉన్నతమైన జీవితపు విలువలు, హాస్యం, సాహిత్య సంస్కారం, రమణీయమైన శైలి - ఇవి దాసరి అమరేంద్రగారి కథలలో అడుగడుగునా ప్రత్యక్షమవుతాయని తంగిరాలవారు అన్నారు. కవిత్వంలోనే కాదు, కథానికలలో కూడా భావకవిత్వధోరణి, అభ్యుదయ కవిత్వధోరణి ఉంటాయన్నారు. అమరేంద్రగారు మంచి భావుకుడైన కథానికా రచయిత అన్నారు.

ముందుమాటలో శ్రీపతిగారు చెప్పినట్లుగా అమరేంద్రగారి కథలలో అందం, పరిమళం, మధుర సంగీతం దాగి ఉన్నాయి. జీవితంలో, సమాజంలో ఉన్నతమైన విలువల కోసం సామాన్యుడు చేసే సాధన ఈ కథలలోని ఇతివృత్తాలు. వీటివల్ల కథలకు అందం వచ్చింది. ఆ ఇతివృత్తాలకు రచయిత తన నిత్య సత్యాన్వేషణ జోడించడం వల్ల ఆ అందానికి పరిమళం అబ్బింది. స్వతహాగా ఈ రచయిత సాత్త్విక సౌశీల్య సంపన్నుడు కావడంవల్ల తన కథలలో మనోహరమైన సంగీతాన్ని వినిపించగలిగాడు.

శ్రీ వి. వి. న. మూర్తిగారు ఈ గ్రంథాన్ని సభకు పరిచయంచేశారు. చాలా కథలలో కథానికా లక్షణాలు లేవు అన్నారు. అన్నిటిలోకీ ''మూడు దృశ్యాలు'' కథ తనకు

నచ్చిందన్నారు. జీవితంలోని వాస్తవికతను కటువుగా చెప్పడం రచయిత నేర్చుకోవాలన్నారు. సభకు బెంగుళూరు ''అరసం'' అధ్యక్షులు శ్రీనిడమర్తి ఉమారాజేశ్వర రావుగారు అధ్యక్షత వహించారు. అమరేంద్ర అంచరికీ కృతజ్ఞతలు తెలియచేశారు.

## 18. బెంగుళూరులో తెలుగు విజ్ఞాన సమితి సువర్ణ మహోత్సవాలు, మార్చి 22,23, 2003

ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధులు తెన్నేటి విశ్వనాథంగారు, ప్రసిద్ధ శాస్త్రవేత్త సూరి భగవంతంగారు, దివాన్ న్యాపతి మాధవరావు పంతులుగారు, భూగర్భ శాస్త్రవేత్త పి.యస్. నారాయణగారు మొదలైన ప్రముఖులు కలిసి 1952లో బెంగుళూరులో 'తెలుగు విజ్ఞాన సమితి'ని స్థాపించారు. గత 50 సంవత్సరాలుగా ఈ సంస్థ బెంగుళూరులోని తెలుగు వారి భాషాసంస్కృతుల్ని పదిలంగా కాపాడుతూ వస్తోంది. ఈ సమితి సువర్ణ మహోత్సవాలు ఈ సంవత్సరం మార్చి 22, 23 తేదీలలో వైట్‌ఫీల్డ్‌లో ఉన్న ''శాంతి నికేతన్'' లో ''శ్రీకృష్ణదేవరాయనగర్'' లో రంగరంగ వైభోగంగా జరిగాయి.

22-3-2003 శనివారం ఉదయం 9-30 గంటలకు ఆంధ్రప్రదేశ్ ఆర్థిక శాఖామాత్యులు మాన్యులు గౌ॥ శ్రీ యనమల రామకృష్ణుడుగారు జ్యోతి ప్రజ్వలనం చేసి సువర్ణ మహోత్సవాలను ప్రారంభించారు. కర్ణాటక రాష్ట్ర సమాజ కల్యాణ శాఖామాత్యులు గౌ॥ శ్రీ ఎ. కృష్ణప్పగారు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. కర్ణాటక రాష్ట్ర మాజీ విధాన సభాధ్యాక్షులు, తెలుగు విజ్ఞాన సమితి ముఖ్యపోషకులు అయిన మాన్యులు శ్రీ రమేష్ కుమార్‌గారు గౌరవ అతిథులుగా పాల్గొన్నారు. ఈ సభలో పద్మభూషణ్ డా॥ కె.జె. ఏసుదాసు (సంగీతం) గారినీ, పద్మశ్రీ డా॥ కోట హరినారాయణ (వైమానిక శాస్త్రవేత్త) గారినీ, పద్మశ్రీ తుర్లపాటి కుటుంబరావు (పాత్రికేయులు) గారినీ, శ్రీమతి పి. సుశీల (చలనచిత్ర నేపథ్య గాయకులు) గారినీ, శ్రీ జి. నందకుమార్ (ప్రసిద్ధ చలనచిత్ర నిర్మాత) గారినీ ఘనంగా సన్మానించారు. తెలుగు విజ్ఞాన సమితి అధ్యక్షులైన శ్రీ ఎ. రాధాకృష్ణరాజుగారు ఈ సభకు అధ్యక్షత వహించారు.

మధ్యాహ్నం 2-00 గంటలకు సువర్ణ మహోత్సవాల సాంస్కృతికోత్సవాలను జ్ఞానపీఠ పురస్కార గ్రహీత డా॥ సి. నారాయణరెడ్డి (ఎం.పి.)గారు ప్రారంభించారు. దాదాసాహెబ్ ఫాల్కే పురస్కార గ్రహీత, ''నటసమ్రాట్'' డా॥ అక్కినేని నాగేశ్వరరావుగారు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. ''సహజకవి'' శ్రీ మల్లెమాల సుందర రామిరెడ్డి (ఎం.ఎస్.రెడ్డి)గారు, సువర్ణమహోత్సవ ఆహ్వాన సమితి అధ్యక్షులైన శ్రీ ఎ.ఎస్. చినస్వామిరాజుగారు, సువర్ణ మహోత్సవ ప్రత్యేక సంచిక సమితి అధ్యక్షులైన శ్రీ జె.ఎస్.రెడ్డిగారు, ఎం.ఎల్.ఏ. శ్రీ కట్టా సుబ్రహ్మణ్యం నాయుడుగారు గౌరవ అతిథులుగా పాల్గొన్నారు. ఈ సభ కూడా శ్రీ రాధాకృష్ణరాజుగారి అధ్యక్షతనే జరిగింది.

మొదటిరోజు ఉదయం 9 గంటలనుండి రాత్రి 9 గంటల వరకూ ఈ క్రింది సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి:

అన్నమాచార్య కీర్తనలు - శ్రీమతి శోభరాజు బృందం, హైదరాబాద్.

కూచిపూడి నృత్యం - కుమారి స్రవంతి, హైదరాబాద్.

ప్రజానాట్యమండలి జానపద విన్యాసాలు - ఆంధ్రప్రదేశ్

పేరిణి శివతాండవం - శ్రీ బి. శ్రీనివాసరావు బృందం, హైదరాబాద్.

సంగీత విభావరి - శ్రీ సాలూరి వాసురావుగారి సారథ్యంలో శ్రీమతి పి. సుశీల, శ్రీ కె. జె. ఏసుదాస్ గారల సమక్షంలో ప్రముఖ చలనచిత్ర నేపథ్య గాయకులు పాల్గొన్నారు.

23-3-2003 ఆదివారం ఉదయం సాహితీ సదస్సు జరిగింది. దీనికి శ్రీ ఎం.ఎస్. రెడ్డిగారు అధ్యక్షత వహించారు. ''కవి కిరీటి'' డా॥ ఉండేల మాలకొండారెడ్డి గారు కర్ణాటకాంధ్ర సాహిత్య సంబంధాలను గురించి ప్రసంగించారు. శ్రీ ఎ. రాధాకృష్ణరాజుగారు ''కన్నడ-తెలుగు చలనచిత్రానుబంధం'' గురించి వివరించారు.

మధ్యాహ్నం శ్రీ గజల్ శ్రీనివాస్‌గారు తెలుగు గజళ్ళు పాడి శ్రోతల్ని రంజింపజేశారు. నెల్లూరు నుండి వచ్చిన మురళి బృందం ''హాస్య వల్లరి'' కార్యక్రమాన్ని నిర్వహించి శ్రోతల్ని కడుపుబ్బ నవ్వించారు. హైదరాబాదు నుండి వచ్చిన ప్రముఖ రంగస్థల నటుడు శ్రీ గుమ్మడి గోపాలకృష్ణ బృందం వారు పాండవోద్యోగం నాటకంలోని ''శయన దృశ్యం'' (పడక సీను) ప్రదర్శించి ప్రేక్షకుల్ని రసానందంతో ఉర్రూతలూగించారు.

సాయంత్రం 4 గంటలకు సువర్ణమహోత్సవం ముగింపు సమావేశాలు జరిగాయి. వీటికి భారత మాజీ ప్రధానమంత్రి గౌరవనీయులు శ్రీ పి.వి. నరసింహారావుగారు ముఖ్య అతిథిగానూ, భారతీయ జనతాపార్టీ అఖిలభారత అధ్యక్షులు గౌరవనీయులు శ్రీ ఎం. వెంకయ్యనాయుడుగారు, కేంద్రమంత్రి శ్రీ అనంత కుమార్‌గారు, కర్ణాటక రాష్ట్ర పౌరసరఫరాల శాఖామాత్యులు గౌరవనీయులు శ్రీ రామలింగారెడ్డిగారు గౌరవ అతిథులుగానూ పాల్గొన్నారు. ''దానచింతామణి'' శ్రీ డి.కె. ఆదికేశవులుగారు (అధ్యక్షులు, సువర్ణ మహోత్సవ ఆర్థికసమితి), ఎం.ఎల్.సి. శ్రీ కె.బి. మునివెంకటరెడ్డిగారు (అధ్యక్షులు, సువర్ణ మహోత్సవ అతిథి సత్కార సమితి) విశిష్ట అతిథులుగా పాల్గొన్నారు. రాధాకృష్ణరాజుగారు సభకు అధ్యక్షత వహించారు. ప్రముఖ చలనచిత్ర నేపథ్య గాయకులైన శ్రీమతి ఎస్. జానకిగారినీ, శ్రీ పి. బి. శ్రీనివాస్‌గారినీ, సంగీత దర్శకులు శ్రీ సాలూరు వాసురావుగారినీ ఈ సభలో ఘనంగా సత్కరించారు.

రాత్రి శ్రీమతి అనూరాధ - శ్రీ శ్రీధర్ దంపతులు మహాభారత నృత్యరూపకాన్ని ఎంతో అందంగా రసవంతంగా ప్రదర్శించారు. తిరిగి శ్రీ సాలూరి వాసురావుగారి

సారథ్యంలో, శ్రీమతి ఎస్. జానకి, శ్రీ పి.బి. శ్రీనివాస్‌గారల సమక్షంలో ప్రముఖ చలనచిత్ర నేపథ్యగాయకులు ''సంగీత విభావరి'' ని నిర్వహించారు. రాత్రి 10 గంటలకు సాంస్కృతిక కార్యక్రమాలు అత్యంత వైభవోపేతంగా ముగిసాయి.

రెండు రోజులు జరిగిన ఈ సువర్ణ మహోత్సవ సభలకు, ఒక్కొక్కరోజున సుమారు 5 వేలమంది తెలుగు సోదర సోదరీమణులు హాజరయ్యారు. వీరందరికీ ప్రతిదినమూ రెండు పూటలా షడ్రసోపేతమైన భోజనాలు ఉచితంగా పెట్టిన మహానుభావుడు ''దానచింతామణి'' బిరుదాంకితులైన శ్రీ డి.కె. ఆదికేశవులు నాయుడుగారు. అంతేకాదు, శాంతినికేతన్‌లో సుందరమైన సభాస్థలిని తెలుగు విజ్ఞాన సమితికి ఉచితంగా ఇచ్చిన సహృదయులు కూడా ఆదికేశవులుగారే! వీరికి పరమేశ్వరుడు ఆయురారోగ్య సంపత్ పరంపరాభివృద్ధిని ప్రసాదించుగాక!

## 19. ''శ్రీరస'' సాహిత్య వసంతోత్సవాలు
## బెంగుళూరు, ఏప్రిల్ 10, 11 తేదీలు, 2003

శ్రీ కృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య ('శ్రీరస') వారు 'స్వభాను ఉగాది', 'శ్రీరామ నవమి' పర్వదినాలను పురస్కరించుకొని ఏప్రిల్ 10, 11 తేదీలలో రెండు రోజులపాటు 'సాహిత్య వసంతోత్సవాలు' జరిపారు. తెనాలి సంస్కృత కళాశాలలో ప్రిన్సిపాల్‌గా పనిచేస్తున్న డా॥ మైలవరపు శ్రీనివాసరావుగారిని ఆహ్వానించి ''వాల్మీకి రామాయణం - సుందరకాండ సౌందర్యం'' అనే అంశంపై రెండు దినాలు అద్భుతమైన ప్రసంగాలు ఏర్పాటుచేశారు. మొదటి ప్రసంగం 10-4-2003 గురువారం సాయంకాలం 6 గంటలకు మల్లేశ్వరం 8 వ క్రాస్‌లో ఉన్న 'గాంధీసాహిత్య సంఘం'లో జరిగింది. ఇది స్వర్గీయ సకలా రంగనాయకమ్మగారి స్మారక సాహిత్యోపన్యాసం. దీనిని ఏర్పాటు చేసిన వదాన్యులు శ్రీ సకలానరసింహులు శ్రేష్ఠిగారు (ప్రతిభా జ్యూయర్రీ హౌస్, బెంగుళూరు). రెండవ ప్రసంగం శ్రీరామ నవమినాడు 11-4-2003 శుక్రవారం సాయంకాలం 4 గంటలకు మల్లేశ్వరం 13 వ క్రాసులో ఉన్న శ్రీమతి అంబికా అనంత్ - శ్రీ పి.ఎస్.వి. అనంతనారాయణ దంపతుల గృహంలో జరిగింది. ఇది స్వర్గీయ అగ్రహారం కృష్ణారెడ్డిగారి స్మారక సాహిత్యోపన్యాసం. దీనిని ఏర్పాటుచేసిన వదాన్యులు శ్రీ ఎ.కె. జయచంద్రారెడ్డిగారు (రెడ్డి అండ్ కో, ఆడిటర్స్, బెంగుళూరు). ఈ రెండు సభలకూ ఆచార్య తంగిరాలవారు అధ్యక్షత వహించారు.

'రామాయణ ప్రవచన సుధాకర', 'రామాయణ సుధానిధి' అయిన డా॥ మైలవరపు శ్రీనివాసరావుగారు రెండు రోజులూ తమ సాటిలేని మేటి ప్రసంగాలతో శ్రోతల్ని మంత్రముగ్ధుల్ని చేసి, వాల్మీకి రామాయణ సుధాలహరిలో ఓలలాడించారు. ఉపన్యాస ధోరణి,

శ్లోకాలు పఠించే తీరు 'నభూతో నభవిష్యతి'గా మిక్కిలి ఆకర్షణీయంగా ఉన్నాయి. శ్రీనండూరి భాస్కర్ అనే ఒక శ్రోత (కవి, సాహిత్యవేత్త) డా॥ శ్రీనివాసరావుగారికి ఒక లేఖ వ్రాస్తూ తన ఆనందాన్ని ఈ క్రింది విధంగా వ్యక్తం చేశారు.

శ్రీయై నమః

నండూరి భాస్కర్
Tel : 080 - 526 7234
25-04-03

D 123 DOS Colony
Jeevanbhimanagar
Bangalore 560 075

''ఆత్మీయ భావుకులు, ఆధ్యాత్మిక సాధకులు - శ్రీమాన్ మైలవరపు శ్రీనివాసరావుగారి దివ్య సముఖమునకు, అభివాదములు.

ఆప్త మిత్రులు - అక్షరమూర్తి తంగిరాల; సాహిత్య సమలంకృత లతిక అంబిక గార్ల సాహార్ద్ర సారథ్యంలో మీ సుందరకాండ ఉపన్యాస విన్యాస లహరిలో నామనసు లాస్యం చేసింది. అది ఒక మరపురాని, చిరస్మరణీయ ఆధ్యాత్మికానందానుభవం. ధన్యవాదములు. ...

మీరు ఇక్కడకు ఎప్పుడు వస్తున్నారు? తెలియజేయగలరు. మీ దర్శన భాగ్యం నా బోటి జిజ్ఞాసువులకు ఒక చలివేంద్రం. ఒక శీతల తరుచ్ఛాయ. సర్వం శ్రీ కృష్ణార్పణం!

'స్వాశ్రితానామ భయదం య ఏవం స్తౌతి మారుతిం!' శుభం

బెంగుళూరు
25-4-2003

భవదీయ
నండూరి భాస్కర్

తన అద్వితీయమైన ప్రసంగాలతో శ్రోతల్ని ఆకట్టుకున్న డా॥ మైలవరపు శ్రీనివాసరావుగారిని మొదటి రోజు శ్రీసకలా నరసింహులు శెట్టిగారి పరంగా శ్రీ కె. పి. రావుగారు, రెండవ రోజు శ్రీ ఎ. కె. జయచంద్రా రెడ్డిగారు వేయి నూటపదహార్లతో శాలువాతో ఘనంగా సత్కరించారు. మొదటి సభ శ్రీ ఇంద్రకంటి పినాకపాణిగారి వందన సమర్పణతోను, రెండవ సభ శ్రీ జోళదరాశి (గుత్తి) చంద్రశేఖర రెడ్డిగారి వందన సమర్పణతోను ముగిసాయి.

బెంగుళూరులో డా॥మైలవరపు శ్రీనివాసరావుగారి రామాయణోపన్యాసాలు మరిన్ని ఏర్పాటు చేయడానికి ప్రముఖ ఆడిటర్ శ్రీ కె. పి. రావుగారు, తెలుగు విజ్ఞాన సమితి కార్యదర్శియైన శ్రీ ఏ. రాజేంద్రనాయుడుగారు ప్రయత్నాలు చేస్తున్నారు.

వార్తల సేకరణ: **రాజేశ్వరి-అంబిక**

వితరణ వార్త:

## టి.టి.డి. వారికి కోటిరూపాయల విరాళమిచ్చిన 'దాన చింతామణి' శ్రీ డి.కె. ఆదికేశవులుగారు

(i) **తిరుమల, జూలై 20: తిరుమల తిరుపతి దేవస్థానం నూతన పాలక మండలి ప్రమాణ స్వీకారోత్సవం సందర్భంగా ''దానచింతామణి'' శ్రీ డి.కె. ఆదికేశవులు నాయుడుగారు ఒక కోటి రూపాయల విరాళాన్ని టి.టి.డి.కి అందజేశారు. 'సాయి శ్రీనివాస్ ఎండోమెంట్' పరంగా ఈ విరాళమిచ్చారు.**

సత్య సాయిబాబా సేవా మార్గాన్ని అనుసరిస్తూ ఆదికేశవులు నాయుడు ఈ విరాళాన్ని పేద, బడుగు ప్రజలకు అవసరమైన విలువైన ఆధునిక వైద్య సదుపాయాన్ని అందించాలని కోరారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర దేవాదాయ శాఖ మంత్రి దండు శివరామరాజు, టి.టి.డి. నూతన పాలకమండలి చైర్మన్ పి.చలపతిరావు, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ శాఖ మంత్రి బొజ్జల గోపాలకృష్ణారెడ్డి, టి.టి.డి. కార్య నిర్వహణాధికారి డాక్టర్ పి. కృష్ణయ్యలకు ఈ విరాళాన్ని అందజేశారు.

చిత్తూరు జిల్లా కలెక్టర్‌గా పనిచేస్తున్న సమయంలో డాక్టర్ పి. కృష్ణయ్య విశేష కృషి నందిస్తూ భగవాన్ శ్రీ సత్య సాయిబాబా ఆశీస్సులతో చిత్తూరు ప్రాంత పేదప్రజల దాహార్తిని తీర్చేందుకు ఉద్దేశించిన నీటి సరఫరా ప్రాజెక్టును విజయవంతంగా చేపట్టారని ఆదికేశవులు నాయుడు గుర్తు చేశారు. శ్రీ సత్య సాయిబాబా అందించిన అదే స్ఫూర్తితో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ఆదేశానుసారం టి.టి.డి. ప్రతిష్ఠాత్మకంగా రూ.100 కోట్లతో 'ప్రాణదానం' పథకాన్ని ప్రారంభించారని ఆదికేశవులు చెప్పారు. తిరుపతి స్విమ్స్ ఆసుపత్రిలో 'ప్రాణదానం' పథకాన్ని ప్రారంభించిన సందర్భంగా తన వంతు విరాళంగా ఒక కోటి రూపాయలను అందిస్తానని వాగ్దానం చేశానని ఆదికేశవులు నాయుడు చెప్పారు. ఆ మేరకు టి.టి.డి. నూతన పాలక మండలి ప్రమాణ స్వీకారోత్సవాన్ని పురస్కరించుకుని ఈ మొత్తాన్ని ''సాయి శ్రీనివాస్ ఎండోమెండ్'' అనే పేరుతో విరాళంగా ఇస్తున్నట్లు ఆదికేశవులు నాయుడు ప్రకటించారు.

(ii) **సత్యసాయి మార్గాన తిరుమలలో భక్తులకు సేవలందిద్దాం: డి.కె. ఆదికేశవులు నాయుడు**

తిరుమల, జూలై 20: భగవాన్ శ్రీ సత్య సాయిబాబా నిండుహృదయంతో పేదప్రజల బాగుకోసం చేస్తున్న సేవల స్ఫూర్తితో తిరుమల తిరుపతి దేవస్థానం పాలక

మండలి నూతన సభ్యులు కూడా కృషి చేయాలని ప్రముఖ వ్యాపారవేత్త ఆదికేశవులు నాయుడు కోరారు. తిరుమల తిరుపతి దేవస్థానం నూతన పాలకమండలి సభ్యులుగా శ్రీ ఆదికేశవులు నాయుడు శనివారం మధ్యాహ్నం శ్రీవారి ఆలయ బంగారు వాకిలిలో ప్రమాణస్వీకారం చేశారు. రాష్ట్ర దేవాదాయ మంత్రి దండు శివరామరాజు, టి.టి.డి. కార్య నిర్వహణాధికారి పి. కృష్ణయ్యలు ఆదికేశవులు నాయుడిచే ప్రమాణస్వీకారం చేయించారు. బంగారు వాకిలిలో జరిగిన ఈ పవిత్ర ప్రమాణోత్సవం అనంతరం శ్రీరంగనాయకుల మండపంలో సభ్యులకు, చైర్మన్ పి. చలపతిరావుకు, ఆదికేశవులు నాయుడుకు ఆయన కుటుంబ సభ్యులకు ఆలయ ప్రధానార్చకులు, వేద పండితులు ఆశీర్వచనం పలికారు. అనంతరం అన్నమయ్య భవన్‌లో జరిగిన ప్రథమ సమావేశంలో ఆదికేశవులు నాయుడు మాట్లాడుతూ భగవాన్ శ్రీ సత్య సాయిబాబా వైద్యం, విద్య, త్రాగునీటి సరఫరాకు అధిక ప్రాధాన్యత నిచ్చి విశేష సేవలందిస్తున్నారని తెలిపారు. అందులో భాగంగా చిత్తూరు జిల్లాకు శ్రీ సత్య సాయిబాబా ఆశీస్సులతో శాశ్వత తాగు నీటి పథకం మంజూరై జన్మభూమి పథకాల్లో భాగంగా విజయవంతంగా పూర్తయ్యిందన్నారు. 30 కోట్ల రూపాయల ఈ బృహత్తర ప్రాజెక్టులో 11 కోట్ల రూపాయలను ''శ్రీనివాస ట్రస్టు'' పేరుతో విరాళంగా సమకూర్చినట్లు చెప్పారు. అదే విధంగా టి.టి.డి నూతన పాలకమండలి సభ్యులు కూడా 100 కోట్ల ''ప్రాణదానం'' ప్రాజెక్టుకు నిధులు సేకరించాలని విజ్ఞప్తి చేశారు.

సత్యసాయి సేవాసంస్థలలో వలె క్రమశిక్షణాయుతంగా టి.టి.డి.ని భక్తులకు సేవలందించే దిశలో నడపాలని ఆయన కోరారు. యాత్రికులకు మెరుగైన సేవలందించేందుకు త్రికరణశుద్ధిగా కృషి చేస్తూ ప్రజాహిత, ప్రజా సంక్షేమ కార్యక్రమాల్లో కూడా పాలు పంచుకోవాలని శ్రీ ఆదికేశవులు నాయుడు కోరారు.

అనంతరం రాష్ట్ర దేవాదాయశాఖ మంత్రి దండు శివరామరాజు మాట్లాడుతూ ప్రస్తుతం 500 కోట్ల బడ్జెట్‌ను రెట్టింపుగా 1000 కోట్ల బడ్జెట్ తీసుకు రావాలని నూతన పాలక మండలిని కోరారు. ఇందుకు ఆదికేశవులు నాయుడు సూచించిన విధంగా త్రికరణశుద్ధిగా క్రమశిక్షణాయుతంగా కృషి చేయాలని, బడ్జెట్ రెట్టింపు చేసి సమర్థవంతమైన పాలక మండలిగా నిరూపించుకోవాలని సూచించారు. ముఖ్యమంత్రి చంద్రబాబు తనను స్వయంగా వెళ్ళి పలువురు నిష్ణాతులతో కూడిన ఈ పాలక మండలి ప్రమాణస్వీకారాన్ని చేయించాలని ఆదేశించినట్లు చెప్పారు. పేదలకు, బడుగు వర్గాలకు ఆధునిక వైద్య సేవలందించేందుకు ఆది కేశవులు నాయుడి విరాళం మహనీయమని పేర్కొన్నారు.

సత్య సాయిబాబా మార్గంలో వైద్యం, విద్య, త్రాగునీరు సరఫరాకు ప్రముఖ స్థానం ఇస్తున్నట్లే ఆయన మార్గంలో నడవాలని మంత్రులు బొజ్జల గోపాల కృష్ణారెడ్డి, దండు

శివరామరాజు, నూతన చైర్మన్ పప్పుల చలపతిరావులు తమ ప్రసంగాల్లో ఉద్ఘాటించారు. అనుభవజ్ఞులు, సమర్థులు, నిష్ణాతులు, పెద్దలతో నూతన పాలక మండలి ఏర్పాటైందని, క్రమశిక్షణాయుతంగా నడుపుతూ ఒకవైపు భక్తులకు సేవలందిస్తూ మరోవైపు ప్రజాహిత కార్యక్రమాల పట్ల దృష్టి సారించాలని సభలో ప్రసంగించిన మంత్రులు ఆదికేశవులు నాయుడితో ఏకీభవించారు. కాగా తాను బోర్డు సభ్యుడు కావడం కేవలం దైవసంకల్పం మాత్రమే కాదని శ్రీ చంద్రబాబు నాయుడుకు నూతన పాలక మండలి పట్ల ఉన్న అభిమానం కారణమని, అందుకు ముఖ్యమంత్రికి ఆయన కృతజ్ఞతలు తెలిపారు.

**సౌజన్యం: ఆదివారం ఆంధ్రప్రభ, జూలై 21, 2002**

* * *

పర్యావరణ వార్త:

# విశ్వకల్యాణం

**పర్యావరణ పరిరక్షణ ప్రచార సంస్థ, డోర్. నెం. 25-17-328, వేణుగోపాలపురం, శ్రీనివాసరావుతోట చివర, గుంటూరు-522 004.**

## మా తృతీయ కానుక

దోమల బారినుండి రక్షణకై యింతవరకు ఉపయోగించే దోమల మందులలో కొన్ని మీకు, వాతావరణమునకు హాని కలిగించే ప్రమాదమున్నందున మేము అనేక పరిశోధనలు చేసి ఏమాత్రము ఖర్చు లేనిది, వాతావరణకాలుష్యం కాని విధానాన్ని కనుగొని, మా సభ్యుల ప్రయోజనం కొరకు మాత్రమే మా తృతీయ కానుకగా ప్రకటించుచున్నాము. మా మొదటి కానుకను అమలుజేయ సంకల్పించుకొనుట, అమలుజేయుట మాత్రమే మా రుసుము.

### విధానము

(అవరోహణా క్రమంతో ప్రాధాన్యతా మూలికలు) గుప్పెడు వేపాకులు 6 తులసి ఆకులు, 4 గానుగ ఆకులు, 2 ఉమ్మెత్త ఆకులు, అర చిటికెడు మంచి పసుపు పొడి, రెండు అరచేతుల మధ్య ఉంచుకొని, బాగుగా నలిచి, ఆఆకుల పొడుము మీరు పరుండు తావున చల్లిన దోమలు అచటనుండి వెడలిపోవును.

# సభ్యత్వమున్నకై అమలు చేయవలసిన మా మొదటి కానుక
# బలి వైశ్వదేవ యజ్ఞము

పంచ మహాయజ్ఞములలోని బలి వైశ్వదేవ యజ్ఞ మనగా మనతో పాటు జీవించే జీవులకు (పశు పక్ష్యాదులకు) నిత్యము ఆహారము సమకూర్చుట. నేటి వాతావరణ కాలుష్యానికి తెలిసియో తెలియకనో మనమందరము కారకులము గావున నివారణకు మనమే కర్తృత్వము వహించి పితృ, ఋషి, దేవ ఋణములలో దేవఋణ విముక్తుల మయ్యెదముగాక!.

ఈ వాతావరణ కాలుష్య స్థితి వలన రాబోవు పరిణామాలు చాలా తీవ్రంగా ఉంటాయని శాస్త్రవేత్తలు హెచ్చరిస్తున్నారు. కొందరి లబ్ధి కొరకు వృక్షాలు అదృశ్య మవుతున్నాయి. రానున్న కాలంలో విత్తనాలు మొలకెత్తే పరిస్థితి ఉండక పోవచ్చునని కూడా అంటున్నారు. కావున దీపం ఉండగనే యిల్లు చక్క-బెట్టుకున్నట్లు అవకాశం ఉన్న మేరకు కొండలపై, గుట్టలపై, బంజరు భూములయందు, ఖాళీ స్థలములయందు చెట్ల పెంపకానికి విత్తన ప్రతిష్ఠ చేయవలసిన బాధ్యత ప్రతి ఒక్క-రిది. ఇందుకు వలసిన ఆలోచనలు, పంపకంద్వారా, వ్యాపకంద్వారా, వ్యష్టిగా, సమష్టిగా కృషి చేద్దాం.

మనము తినిన తరువాత వ్యర్థంగా పారవేసే పండ్ల విత్తనములను సేకరించి కొండలు గుట్టలు మొదలగు ప్రదేశములయందు, అటవీ బంజరు భూములయందు విత్తన ప్రతిష్ఠ చేద్దాం. ఇందుకు ఒకరికొకరు ఆర్థిక సహాయం అవసరంలేని కార్యక్రమమిది. నిత్యం మీరు తిని వ్యర్థంగా పారవేసే పండ్లవిత్తనాలు నిరుపయోగం కాకుండా కడిగి ఎండబెట్టి జాగ్రత్తచేసి, మీరు కొండలు అడవులుగుండా ప్రయాణంచేసే సమయం తటస్థ పడినప్పుడు వాటిని ఆ ప్రదేశములలో వెదచల్లండి. ఉదాహరణకు సీతాఫలము, జామ, వేప, గానుగ, చింత, కుంకుడు మొదలగు వృక్షజాతులే కాక దోస, చిక్కు-డు మొదలగు స్వల్పకాలములో ఫలితములిచ్చే విత్తనములు కూడ చల్లవచ్చును. ఇదే బలి వైశ్వదేవ యజ్ఞము. మీకు ప్రయాణంచేసే అవకాశము లేనియడల ఆ ప్రాంతములగుండా ప్రయాణించేవారికి మీరు సేకరించిన విత్తనములనిచ్చి యజ్ఞ సహాయకులుకండి. ఇదియే మీరు అనుసరించవలసిన మా మొదటి కానుక!

| | | |
|---|---|---|
| చల్లా నాగవర్ధన్ | బి. శ్రీకృష్ణవేణి | చల్లా రాఘవేంద్ర |
| కార్యదర్శి | ప్రచార కార్యదర్శి | వ్యవస్థాపక అధ్యక్షుడు |

* * *

# చైతన్య కవిత

## 2002-2003 మధ్య చేరిన చందాదారులు

పోషక సభ్యులు:

1. డా॥ ఎస్. శైలజ, M.Sc., Ph.D., ప్రముఖ కవయిత్రి, Excise Superintendent (Prohibition), District Collectorate, ONGOLE - 523 001, Prakasam District.

2. శ్రీమతి సులోచన - శ్రీ బత్తెనపట్ల శేషారెడ్డి దంపతులు, D.No. W/24/1820/38, Military Colony, A.K. Nagar Post, NELLORE - 524 004, A.P.

3. శ్రీమతి లలిత - డా॥ బి. సుధాకరరెడ్డి దంపతులు, B-6, Indira Gandhi Institute of Development & Research, Goregaon (Near Film City) MUMBAI - 400 063.

4. శ్రీమతి అన్నపూర్ణాదేవి - డా॥ రాచకొండ నరసింహశర్మ దంపతులు, 4202, Quaker Court, North Wales, PA 19454, USA. (రావిశాస్త్రిగారి తమ్ముడు)

5. శ్రీమతి శారదా అశోకవర్ధన్, ప్రముఖ కవయిత్రి, 701, Amarchand Sarma Comples, Sardar Patel Road, Secunderabad - 500 003, A.P.

6. కీ.శే. ఇంటూరి మరియాంబ - కీ.శే. నడకుర్తి వేంకటరత్నకవి దంపతులు తెలుగు భాషా సాహిత్యాలకై చేసిన కృషికి జ్ఞాపకార్థంగా వారి పెద్ద కుమార్తె ''కవయిత్రీ తిలక'' శ్రీమతి కొలకలూరి స్వరూపరాణి, 35-3-80/C, East to zacharaiah Hospital, Kesava Swamy Peta, ONGOLE-523 001, Prakasam District.

7. డా॥ పుసులూరి సీతాపతిరావుగారి పరంగా శ్రీ తంగిరాల భాస్కరరావు, రాజమండ్రి, తూర్పుగోదావరి జిల్లా, Dr. P. Sithapathi Rao, No. 137, Dwaraka Nagar Colony, Panjagutta, Hyderabad - 500 482, A.P.

8. శ్రీమతి బి.వి. విజయలక్ష్మి - శ్రీ ఐ. శ్రీనివాసరావు దంపతులు, Q.No. 113-C, Sector XI, Ukkunagaram, Visakhapatnam - 530 032, A.P.

9. డా॥ కె. రామాంజనేయులు, M.A.; Ph.D., Lecturer in Telugu, Rentachintala-522 421, Guntur District, A.P.

10. డా॥ పంపన సూర్యనారాయణ, M.A.; Ph.D., ప్రసిద్ధ కవి, పరిశోధకుడు, Reader in Telugu, Maharani's College, Peddapuram - 533 437, East

Godawari District, A.P. (ఈయన ఇటీవలనే స్వర్గస్థులయ్యారని చెప్పడానికి చింతిస్తున్నాము).

11. శ్రీమతి పద్మ - శ్రీలంక చంద్రశేఖరం దంపతులు, #7, 1062/1&1063, Ist Cross, 4th Main, II Block, BEL Layout, Vidyaranyapura, Bangalore - 560 097.

12. డా॥ సోమిరెడ్డి (పెళ్ళకూరు) జయప్రద, ప్రముఖ రచయిత్రి, కవయిత్రి, Vamsi Nursing Home, Indira Bhawan Road, Sankara Agraharam, Nellore - 524 001, A.P.

13. శ్రీమతి సీతా మనోహరం - లెఫ్టినెంట్ కర్నల్ టి.కె.రావు దంపతులు, తుమ్మల ఎలక్ట్రానిక్స్, పీన్యా, బెంగుళూరు - 58.

**జీవిత సభ్యులు:**

1. శ్రీ గిడుగు రాజేశ్వరరావు, ప్రసిద్ధకవి, కథానికా రచయిత, B-2, Service Officers' Flats, DRDO Residential Complex, Lucknow Road, Timarpura, Delhi - 110 054.

2. ప్రొ॥ అల్లాడి ఉమ, M.A., Ph.D., Professor of English, University of Hyderabad, Central University P.O., Hyderabad-500 046, A.P.

3. డా॥ కావూరి పాపయ్యశాస్త్రి, M.A.; Ph.D., ప్రసిద్ధ కవి, విమర్శకుడు, 4-1-53, Super Bazaar Centre, Bhadrachalam-507 111, Khammam District, A.P.

4. డా॥ పోచిరాజు శేషగిరిరావు, M.A.; Ph.D., ప్రసిద్ధ కవి, పండితుడు, 1-4-19/6, 7th Street, Habsiguda, Hyderabad - 500 007, A.P.

5. ప్రొ॥ తంబుశెట్టి రామకృష్ణ, M.Sc.; Ph.D., Head of the Department of Life Sciences, University of Calicut, Calicut University P.O. - 673 635, Kerala State.

6. శ్రీ బి.సిహెచ్. రంగారెడ్డి, Freedom Fighter, H.No. 124, Saleem Nagar, Malakpet Extension, Hyderabad - 500 036, A.P.

7. డా॥ చాగంటి తులసి, M.A.; Ph.D., ప్రసిద్ధ కథానికా రచయిత్రి, Professor of Hindi, H.No.5-127, Paul Nagar, Vizianagaram - 535 003, A.P.

8. శ్రీమతి నంబూరి పరిపూర్ణ, 7-41, Sangeetha Nagar Colony, Kukatpally, Hyderabad - 500 072, A.P.

9. ప్రొ॥ ఎం.కె. దేవకి - ప్రొ॥ పి.యల్. శ్రీనివాసులు రెడ్డి దంపతులు, ఆంధ్ర భారతి, శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, అనంతపురం - 515 003.

10. శ్రీ ఎ.వి. అప్పారావు, B.E., Plot No. 239, 102 Sunny Apartments, Kalyana Nagar, Vengala Rao Nagar, Hyderabad - 500 890, A.P.

11. శ్రీమతి అనిసెట్టి రజిత, ప్రముఖ కవయిత్రి, 3-12-60, కుమార పల్లి, హనుమకొండ-506001, వరంగల్లు, ఆంధ్రప్రదేశ్.

12. డా॥పి. ఓబులరెడ్డి, MA.; Ph.D., Reader, Dept. of English, S.K. University, Anantapur - 515 003, A.P.

13. శ్రీ జి.వి. సుబ్బారావు, M.A., Senior Asst. Officer (Retd.), 10-1-18/24, Shyam Nagar, Hyderabad - 500 004, A.P. (ప్రముఖ కవి)

14. శ్రీమతి తంగిరాల జయదుర్గా భవాని - శ్రీ కాళ్ళకూరి వెంకట సత్యనారాయణ జోగిరాజు దంపతులు, Manager, Sri Saraswathi Grameena Bank, Main Branch, Dokwal Complex, Adilabad - 504 001, A.P.

15. డా॥ ఆర్ద్రేపల్లి రామమోహనరావు, ప్రముఖ కవి, విమర్శకుడు, 3-5 పంచాయతీ గ్రంథాలయం వీధి, మధురానగర్, కాకినాడ-533 004, తూర్పుగోదావరి జిల్లా.

16. డా॥ జె. భాగ్యలక్ష్మి, M.Sc. Ph.D., A-13/29-B, Fort View Apartments, Kalkaji Extension, New Delhi - 110 019.

17. శ్రీ పొట్లపల్లి శ్రీనివాసరావు, ప్రముఖ కవి, C/o శ్రీ వి.ఆర్. విద్యార్థి, 2-7-1083, Kanaka Durga Colony, Wadeepalli, Warangal - 506 370.

18. శ్రీ వి. ఆర్. విద్యార్థి, ప్రముఖ కవి, 2-7-1083, కనకదుర్గ కాలనీ, వడ్డేపల్లి, వరంగల్లు - 506 370.

19. డా॥ రావి రంగారావు, ప్రముఖ కవి, C/o శ్రీమతి నర్రా ప్రభావతి, 27-431, పాత రామన్నపేట, మచిలీపట్నం - 521 001, కృష్ణాజిల్లా.

20. డా॥ పెన్నా శివరామకృష్ణ, ప్రముకవి, C/o Sri D.V. Pandu Ranga Rao, H.No. 1-7-1002/34/1, Ramnagar, Hyderabad - 500 048, A.P.

21. Dr. P. V. L. N. Rao, 25-A, Lady Madhavan Road, Mahalingapuram, Chennai - 600 034 or "Colts View", 94, Pilliyar Koil Street, Chennai - 600 032.

22. The Registrar, Dravidian University, Kuppam - 517 425, Chittoor District, A.P.

23. డా॥ ఎ. వృషభేంద్రాచార్, M.A., Ph.D., కన్నడ కవి, అనువాదకుడు, Principal, S.E.S. College, SANDUR - 583 119, Bellary District, Karnataka.

24. శ్రీ కలువకొలను సదానంద, ప్రముఖ రచయిత, కవి, భారతంమిట్ట, పాకాల - 517 112, చిత్తూరు జిల్లా.

25. శ్రీమతి సి. వేదవతి, ప్రముఖ రచయిత్రి, నెం. 45, ఎల్. ఐ. సి. కాలనీ, మెహిదీపట్నం, హైదరాబాద్ - 500 028.

26. డా॥ ఎస్. ఇ. బలరామిరెడ్డి, ప్రముఖ కవి, కలుగోట్లపల్లి - 518 553, చాగలమర్రి మండలం, ఆళ్ళగడ్డ తాలూకా, కర్నూలు జిల్లా.

27. డా॥ ఎన్. గోపి, ప్రముఖ కవి, ఆచార్యుడు, పూర్వ ఉపకులపతి, ఫ్లాట్ నెం. 12, ఇంటి. నెం. 13-1/5-B, శ్రీనివాసపురం, రామంతపూర్, హైదరాబాద్ - 500 013.

28. డా॥ మిరియాల రామకృష్ణ, ప్రముఖ కవి, ఇంటి నెం. 165/బి, మోతీనగర్, హైదరాబాద్ - 500 018.

29. శ్రీ ఎం. దేవర కొండప్ప, కన్నడ రచయిత, కవి , అనువాదకుడు, No. 659, 11th Main, 4th Block, Jayanagar, Bangalore - 560 011.

30. The Principal, D.K. Govt. College for Women, Nellore - 524 003, A.P.

31. శ్రీ మునిపల్లె రాజు, ప్రముఖ కథానికా రచయిత, కవి, A-30/IA (AFOCHS), Sainikpuri, Secunderabad - 500 094, A.P.

32. డా॥ భార్గవి పి. రావు, ప్రముఖ కవయిత్రి - రచయిత్రి, 70 MIGH, New Santhosh Nagar Colony, Hyderabad - 500 059, A.P.

33. శ్రీ ఈతకోట సుబ్బారావు, ప్రసిద్ధ కవి, 24/1175, 2nd line, Ravindra Nagar, NELLORE - 524 004, A.P.

34. డా॥ మామిళ్ళపల్లి రమాదేవి, ప్రసిద్ధ కవయిత్రి, C/o Smt. M. Sarada Devi, H. No. PJ 72/F2, Panjagutta, Hyderabad - 500 082, A.P.

35. శ్రీ ''రాధేయ'', ప్రసిద్ధ కవి, ఆంధ్రోపన్యాసకుడు, శ్రీ సత్యసాయి ప్రభుత్వ జూనియర్ కళాశాల, కొత్త చెరువు - 515 133, అనంతపురంజిల్లా.

36. శ్రీ గోరాబత్తిన నీలకంఠం, ప్రసిద్ధ కవి, Plot No. 17, 3rd Cross, Kaveri Nagar, A.K. Nagar Post, Nellore - 524 004, A.P.

37. డా॥ టి. శ్రీరంగస్వామి, M.A. Ph.D., ప్రసిద్ధ కవి, ఇంటినెం. 5-11-481, విద్యారణ్యపురి, వరంగల్లు - 506 009, ఆంధ్రప్రదేశ్.

38. డా॥ ఎం. గోపాలరెడ్డి, M.A., Ph.D., D-15, K.P.W.D. Quarters, Jeevana Bhima Nagar, Bangalore - 560 075.

39. డా॥ ప్రభల జానకి, M.A., Ph.D., 206, Leiah Apartments, B-15, Vasundhara Enclave, Delhi - 110 096.

40. శ్రీ సి.డి.కె. రెడ్డి, Flat No. 201, Glive Grove, 23 Grover Road, Cox Town, Bangalore - 560 005.

41. డా॥ కేతు బుచ్చిరెడ్డి, ప్రముఖ కథానికా రచయిత, కవి, 12-3-848, Jesus Nagar, Anantapur - 515 001, A.P.

42. శ్రీమతి చల్లా పద్మావతి, B.A., Music Teacher, Hurd Junior College, Narsaraopet - 522 601, Guntur District, A.P.

43. The Principal, Govt. Arts and Science College, ARMOOR - 503 224, Nizamabad District, A.P.

* * *

# కవితా! ఓ కవితా!

(ఇటీవల వెలువడిన కొన్ని నూతన కవితా సంపుటాలు)

## వచన కవితా సంపుటాలు:

1. **మనిషొకడే విడిగా మనలేడు:** ఎ. విద్యాసాగర్, ఐ.ఏ.యస్., వెల: రూ. 90/-, ప్రతులకు: ఎమెస్కో బుక్స్, ఏలూరు రోడ్డు, విజయవాడ - 520 002.

2. **మాటన్నది జ్యోతిర్లింగం:** కన్నడ వచనాలకు దీవి సుబ్బారావు అనువాదం వెల: రూ. 60/-, ప్రతులకు: దీవి సుబ్బారావు, ఫ్లాట్ నెం. 143, వాసవి కాలనీ, దిల్‌షుక్ నగర్, హైదరాబాద్ - 500 027.

3. **అవేద - మహాజన కవిత్వం:** జూపల్లి ప్రేమ్‌చంద్, వెల:రూ. 50/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్, 4-1-435, బ్యాంకువీధి, హైదరాబాదు - 500 001 మరియు దాని ఇతర శాఖలు.

4. **ప్రకృతి గీసిన వికృతి చిత్రం: మాకినీడి సూర్యభాస్కర్,** వెల: రూ. 10-, ప్రతులకు: శ్రీమతి మాకినీడి సుభద్ర, 32-8-5, రాజాజీ వీధి, కాకినాడ - 533 001

5. **విప్లవ ఋతువు: (సం) తాతా రమేష్‌బాబు,** వెల: రూ. 25/-, ప్రతులకు: శ్రీ రాధాకృష్ణ బుక్ సెంటర్, మెయిన్‌రోడ్, గుడివాడ - 521 301, కృష్ణాజిల్లా.

6. **కవితా ఝరి: (సం)సన్నశెట్టి రాజశేఖర్,** వెల: రూ. 15/-, ప్రతులకు: మేనేజర్, ఉత్తరాంధ్ర, నిత్యానంద్ నగర్, కాశీబుగ్గ - 532 222, శ్రీకాకుళం జిల్లా.

7. **ఆరనిమంటలు: గీట్ల జనార్దన్ రెడ్డి,** వెల: రూ. 50/-, ప్రతులకు: కవి, నేతాజీ నగర్, మంథని - 505 184, కరీంనగర్ జిల్లా.

8. **నది: కె. యస్. రమణ,** వెల: రూ. 35/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్.

9. **గడ్డిపూవు: (సం) కోడిహళ్ళి మురళీమోహన్,** వెల: రూ. 20/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్....

10. **కవి సమయం: శివారెడ్డి,** వెల: రూ. 12/-, ప్రతులకు: నవోదయ పబ్లిషర్స్, ఏలూరు రోడ్డు, విజయవాడ - 520 002.

11. **ముప్పయి వసంతాలు, ముప్పయి శిశిరాలు మీదుగా: అనామధేయుడు,** వెల: రూ. 5-, ప్రతులకు: మైత్రీ బుక్ హౌస్, విజయవాడ - 520 002.

12. **దూరాలను దూసుకొచ్చి: డా॥ సి. నారాయణ రెడ్డి,** వెల: రూ. 50/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

13. **వర్షి (దీర్ఘ కవిత): వెంకట్,** వెల: రూ. 10/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

14. **ఒకే ఒక్క సాముహిక స్వప్నావిష్కరణ: దేశరాజు,** వెల: రూ. 20/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

15. **రహస్తంత్రి: వేగుంట మోహన ప్రసాద్,** వెల: రూ. 50/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

16. **చితి - చింత: వేగుంట మోహన ప్రసాద్,** వెల:రూ. 50/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

17. **బతికిన క్షణాలు: వేగుంట మోహన ప్రసాద్,** వెల: రూ. 30/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

18. **విధ్వంస నేపథ్యం** (కవితా సంకలనం)**: (సం) ఎస్వీ. సత్యనారాయణ,** వెల:రూ. 20/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

19. **కవిగారి ఆత్మద్యుతులు: కవిగారు,** వెల: రూ. 75/-, ప్రతులకు: అమ్మకృప-స్వర్ణాలయం, 97, వాసవీ కాలనీ, ఎ, సికింద్రాబాద్ - 500 015.

20. **జ్వాలా తోరణం: గీట్ల జనార్ధన రెడ్డి,** వెల:రూ. 75/-, ప్రతులకు: కవి, నేతాజీ నగర్, మంథని - 505 184, కరీంనగర్ జిల్లా.

21. **అలసిపోయినవాడి అరణ్యకాలు: మునిపల్లెరాజు కవితాసంపుటి-2,** వెల: రూ. 40/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

22. **వికసించిన విద్యుత్తేజం** (కవితా సంకలనం)**:** వెల:రూ. 30/-, ప్రతులకు: ప్రజాశక్తి బుక్‌హౌస్, స్ట్రీట్ నెం.1, అశోక్‌నగర్, హైదరాబాదు - 500 020.

23. **శబ్నం: కృష్ణమూర్తి యాదవ్,** వెల: రూ. 20/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

24. **కొన్ని సమయాలు: శ్రీకాంత్,** వెల:రూ. 30/-, ప్రతులకు: ఝరి పొయిట్రీ సర్కిల్, 16-2-740/75/40, వి.కె. ధాణేనగర్, గడ్డి అన్నారం, హైదరాబాదు- 500 660

25. **సారంగి: ఆశారాజు,** వెల: రూ. 25/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

26. **సామాజిక హైకూలు: డా॥ రావిరంగారావు,** వెల:రూ. 16/-, ప్రతులకు: శ్రీ చింతపల్లి వెంకట నారాయణ, సాహితీమిత్రులు, కైకలూరు - 521 333, కృష్ణాజిల్లా.

27. **తెల్ల చీకటి: డా॥ రావి రంగారావు,** వెల: రూ. 20/-, ప్రతులకు: శ్రీమతి నర్రా ప్రభావతి, 27-431 పాత రామన్న పేట, మచిలీపట్నం - 521 001, కృష్ణాజిల్లా.

28. **అగ్గిపెట్టె** (తెలుగు, హిందీ, ఇంగ్లీషు)**: డా॥ రావి రంగారావు,** వెల: రూ. 20/-, ప్రతులకు: శ్రీమతి నర్రా ప్రభావతి, 27-431 పాత రామన్న పేట, మచిలీపట్నం - 521 001, కృష్ణాజిల్లా.

29. **చుట్టు కుదురు: డా॥ ఎన్. గోపి,** వెల: రూ. 40/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

30. **ఆమె నా బొమ్మ: అయిల సైదాచారి,** వెల: రూ. 20/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

31. **సుమతీ శతకం** (ఆంగ్లానువాదం)**: ఎ.ఎల్.ఎన్. మూర్తి,** వెల: రూ. 50/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

32. **ఉన్నదేదో ఉన్నట్లు: వరవరరావు,** వెల: రూ. 25/-, ప్రతులకు: నవోదయ బుక్‌హౌస్, ఆర్యసమాజ్ ఎదురు వీధి, కాచిగూడ, హైదరాబాదు-500 027.

33. **నాలాగే గోదావరి: బొజ్జా తారకం,** వెల: రూ. 20/-, ప్రతులకు: కవి, 96, అశోక్ నగర్, హైదరాబాద్ - 500 020.

34. **చిగురుకల** (హైకూలు)**: బొల్లిముంత వెంకట రమణరావు,** వెల: రూ.12/- ప్రతులకు: నవోదయ బుక్ హౌస్...

35. **నవనవం: దీవి సుబ్బారావు,** వెల: రూ. 30/-, ప్రతులకు: కవి, 143 వాసవీ కాలనీ, హైదరాబాదు - 500 035.

36. **కవిత్వంతో ఒక సాయంకాలం: సాహితీ మిత్రులు,** వెల: రూ. 15/-, ప్రతులకు: నవోదయ పబ్లిషర్స్, విజయవాడ, గుంటూరు.

37. **అయినా ధైర్యంగానే: అద్దేపల్లి రామమోహనరావు** వెల: రూ. 20/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

38. **గానమూ-గళమూ: యస్.యస్.మూర్తి, & నువ్వు-నేనూ - సౌభాగ్య,** వెల: రూ. 25/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

39. **ఊరవతలి సూరీడు: చెన్నా సన్యాసిరావు,** వెల: రూ. 20/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

40. **వలస: అఫ్సర్,** వెల: రూ. 30/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

41. **గూడు వదలిన గువ్వలు** (నానీలు)**: ఎస్. ఆర్. భల్లం,** వెల: రూ. 25/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

42. **చిగురు కేక: ఎస్. ఆర్. భల్లం,** వెల:రూ. 30/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

43. **కిర్రు చెప్పుల భాష: శిఖామణి,** వెల: రూ. 40/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

44. **మరో మజిలీకి ముందు: వై. ముకుంద రామారావు,** వెల:రూ. 40/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

45. **సందర్భం: కందుకూరి శ్రీరాములు,** వెల: రూ. 30/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

46. **హృదయ సీమ: నక్కా అమ్మయ్య,** వెల: రూ. 30/-, ప్రతులకు: శ్రీమతి ఎన్. మాణిక్యం, 4-7-35, సాయిబాబా గుడి దగ్గర, సంగారెడ్డి-502 001, మెదక్‌జిల్లా.

47. **గోరు కొయ్యలు: దాసరాజు రామారావు,** వెల:రూ. 15/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

48. **వెంటాడే కలాలు** (వెనుకబడిన కులాలు)**: ఇరవైముగ్గురు బి.సి. కవుల కవితా సంపుటి, సంపాదకుడు: జూలూరు గౌరీశంకర్,** వెల: రూ. 50/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

49. **ఇరవై ఒకటో శతాబ్దంలోకి: డా॥ అంతటి నరసింహం,** వెల:రూ. 60/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

50. **తొలకరి చినుకులు** (నానీల సంపుటి)**: సోమేపల్లి వెంకటసుబ్బయ్య,** వెల: రూ. 25/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

51. **మన ప్రస్థానం** (పేరడీలు)**: సబ్బని లక్ష్మీనారాయణ,** వెల: రూ. 40/- ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

52. **చిన్నప్పుడన్నీ ఆశ్చర్యమే: దీవి సుబ్బారావు,** వెల:రూ. 30/-, ప్రతులకు: కవి, 143 వాసవీ కాలనీ, హైదరాబాదు - 500 035.

53. **ఆరోవర్ణం: ఇక్బాల్‌చంద్,** వెల: రూ. 50/-, ప్రతులకు: కవి, మసీదురోడ్డు, సత్తుపల్లి - 507 303, ఖమ్మం జిల్లా.

54. **రంపె కోత (దళిత పాటలు): గ్యార యాదయ్య,** వెల:రూ. 10/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

55. **తల ఎగిరినా కల చెదరదు:సూర్యవంశి,** వెల: రూ. రూపాయిన్నర, ప్రతులకు: చలసాని ప్రసాద్, ఎల్.ఐ.సి. - 15, హెచ్.బి. కాలనీ, విశాఖపట్టణం.

56. **కవిత్వం: ప్రసేన్, వంశీకృష్ణ, సీతారాం, అఫ్సర్,** వెల: రూ. 50/-, ప్రతులకు: ప్రసేన్, 9-2-48, వినోద్ మహల్ రోడ్డు, ఖమ్మం - 507 001.

57. **ఊరుచావు: జూలూరి గౌరీశంకర్,** వెల:రూ. 10/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

58. **నీటి పొద్దు: మంచికంటి,** వెల: రూ. 25/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

59. **ప్రశ్నే ప్రశ్నార్థకమైన వేళ: నల్లూరి రుక్మిణి,** వెల:రూ. 15/-, ప్రతులకు: కవయిత్రి, సి-132, ఎస్.వి.ఎన్. కాలనీ, గుంటూరు - 522 006.

60. **Arc of Unrest: Yakoob**, Price: Rs. 50/-, For Copies: Visalaandhra Book House...

61. **More Voices on the Wing: Dr. V.V.B. Rama Rao**, Price: Rs. 200/-, For Copies: Vadapalli Ramani, C-7, New Township, B.T.O.S., Badarpur, New Delhi - 110 044.

62. **The Black Rainbow: Sikhamani**, Price: Rs. 50/-, For Copies: Visalaandhra Book House...

63. **ఆకలి శబ్దం: వింజమూరి అచ్యుత రామయ్య,** వెల: రూ. 20/-, ప్రతులకు: కవి, జూనియర్ అకౌంటెంట్, ఫిషరీస్ డిపార్ట్‌మెంట్, ఫిఫ్త్‌ఫ్లోర్, గగన్ విహార్, నాంపల్లి, హైదరాబాదు - 500 001.

64. **మనం మనమే: సంపత్ బాల్‌రెడ్డి,** వెల: రూ. 40/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

65. **నన్ను మాట్లాడనివ్వండి: బసలింగప్ప,** వెల: రూ. 30/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్...

66. **హైకూ చిత్రాలు: మాకినీడి సూర్య భాస్కర్,** వెల: రూ. 25/-, ప్రతులకు: శ్రీమతి ఎమ్. సుభద్ర, సౌమ్య పబ్లికేషన్స్, 32-8-5, రాజాజీ వీధి, కాకినాడ - 533 007, తూర్పు గోదావరి జిల్లా.

67. **హైకూ కవిత్వం** (అనుశీలన- ఒక అవగాహన)**: మాకినీడి సూర్య భాస్కర్,** వెల: రూ. 25/-, ప్రతులకు: శ్రీమతి ఎమ్. సుభద్ర, సౌమ్య పబ్లికేషన్స్, 32-8-5, రాజాజీ వీధి, కాకినాడ - 533 007, తూర్పు గోదావరి జిల్లా.

68. **వసంత విలాసం: నన్నపరాజు నరేందర్ రాజు,** వెల: రూ. 45/-, ప్రతులకు: కవి, 2-92, మేడిపల్లి పోస్టు - 505 453, కరీంనగర్ జిల్లా.

(సశేషం)

## ఉగాది శుభాశంసనములు

చిత్రభాను ప్రతాప వైచిత్రి మెఱయ
రగులుచున్నవి మంట 'లిరాకు' నందు
తన ప్రతాపమ్ముఁదన కుంచుకొని 'స్వభాను'
మంచియే చేసి మిమ్ము రక్షించుఁగాక!

- ఆచార్య వి. రామచంద్ర చౌదరి, చెన్నై



కీ.శే. నడకుర్తి వేంకట రత్నకవిగారు (1915-1989)
ధర్మపత్ని కీ.శే. ఇంటూరి మరియాంబగారు (1923-1973)

# చైతన్య కవిత

చిత్రభాను శరత్తు - స్వభాను వసంతం

October 2002 & April 2003



శ్రీమతి వి. యస్. రమాదేవి గారికి నాట్యగణపతి విగ్రహాన్ని
బహూకరిస్తున్న 'దాన చింతామణి' శ్రీ డి.కె. ఆదికేశవులుగారు;
మధ్యలో 'తెలుగు విజ్ఞాన సమితి' అధ్యక్షులు
శ్రీ ఎ. రాధాకృష్ణరాజుగారు

చైతన్య కవితా వేదిక. బెంగుళూరు